# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

ఉగాది
ప్రత్యేక సంచిక

పూర్తి నవల
**ఎవరి దారి వారిది**
బలివాడ కాంతారావు



13-4-84

# నూతన సంవత్సర శుభాకాంక్షలతో!

ఆపరేషన్, ఇతర వైద్య చికిత్సలతో నిరాశచెందిన సోదరీమణులు అనేకులు మాసలహాలచే సంతానవంతులయి ఇచ్చిన యోగ్యతాపత్రములు గలవు.. స్త్రీ, పురుష వంధ్యాదోష నివారణా నిపుణులు...

## మీకు బేబీ/బాబు కావాలా!



శాస్త్రద్వారా చికిత్స గలదు...

దంపతులు స్వయముగా వచ్చిన స్త్రీ, పురుషులలో ఎవరిలో లోపమున్నది తెలుసుకొని వారికి మాత్రమే చికిత్స చేయగలము.

మాసలహాల వలన, ఔషధముల వలన గర్భము నిలచిన వారు

1. పి.లక్ష్మి., సీతమ్మధార, వైజాగ్-13..
2. శ్రీమతి వి. వెంకటేశ్, వ్యాగనువర్కుషాపు గుంటుపల్లి.., విజయవాడ..
3. శ్రీమతి టి.ప్రసాద్., s.c.రైల్వే, హుబ్లీ..
4. శ్రీమతి యస్.వి.రామారావు R.T.C.స్టాండ్‌దగ్గర.. జగ్గయ్యపేట..
5. శ్రీమతి జె.వి.రామాంజనేయులు ముదిమాణిక్యంపోస్టు హుస్నాబాదు తా॥ కరీంనగర్ జిల్లా
6. శ్రీమతి కె. దామోదర్, తెలుకుంట పోస్టు, (వయా) ఎలిగేడు సుల్తానాబాద్ తా॥ కరీంనగర జిల్లా..
7. శ్రీమతి కె.నారాయణరావు, D.No:70, 7వ లేను సుబ్బరాజు లే ఔటు, లక్కసంద్ర, బెంగుళూరు 30

| | | | |
|---|---|---|---|
| ఈ మాసంలో | తెనాలి | గురు, ఆదివారాలు | మధ్యాహ్నం ..12 గం. నుండి |
| సంప్రదించుటకు | విజయవాడ | మంగళ, బుధ, శనివారాలు | సాయంత్రం.. 5 గం. వరకు.. |

# శ్రీ నాగార్జున మూలికా కుటీరం.

రైల్వేస్టేషన్ దగ్గర, రామాలయంవీధి, తెనాలి-522 202..

2వ లైను, కేదారేశ్వరపేట, విజయవాడ-520003..

# లోకం పోకడ - మోహన్





**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని**

**వాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం · 1908

*శివలెంక శంభుప్రసాద్*

**సంపాదకుడు :**

[1938–1972]

శుక్రవారం : 13–4–'84

శ్రీ రక్తాక్షినామ సం. చైత్ర శు. ద్వాదశి

**సంపుటము 76 : సంచిక 31**

**సంపాదకుడు :**

*శివలెంక రాధాకృష్ణ*

విడి ప్రతి వెల రు. 4-00

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం· విజయవాడ-520 003·


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి దేవిశ్రీ

(ఫొటో : కాజాన్)

విఖ్యాతి గాంచిన విమల్ వస్త్రాలు
కన్నులకింపైన రంగులు వినూత్న డిజైన్లు
వివాహాది శుభకార్యాలకు ఆడవారిని,
మగవారిని అలరించే విస్తృత శ్రేణి



చీరెలు
మోనోలిస, సిల్క్‌హాట్రిక్, పద్మిని, దీపాళి

సూటింగ్స్
ఫ్రంట్‌లైన్, ట్రెండ్స్, టెరెక్స్, లీరాయి, 24 కె
ఆల్‌టైమ్స్

షర్టింగ్స్
సూపర్‌టెస్ట్, పోర్ట్‌నాక్స్,
స్పైడర్‌మాన్, ఎవర్‌గ్లేడ్




విమల్ వస్త్రాల ప్రత్యేక షోరూమ్

# విమల్ దీప్

ప్రకాశంరోడ్, గవర్నరుపేట సెంటర్
విజయవాడ 2. PHONE: 75558

VAS

# మ న లో మా ట

**మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్త లందరికీ ఉగాది శుభాకాంక్షలు !**

ఆంధ్రపత్రిక వారపత్రిక 1908 లో మొదలయింది. 1910 లో మొదటి ఆంధ్రపత్రిక ఉగాది సంవత్సరాది సంచిక వెలువడింది. 1914లో ఆంధ్రపత్రిక దినపత్రిక ప్రారంభం అయింది. అప్పటి నుంచీ ఉగాది సంవత్సరాది సంచిక దినపత్రికకి అనుబంధంగానే పరిగణించబడుతూ వచ్చింది !

1924 లో మొదలయిన భారతి సాహిత్య మాసపత్రిక లాగే ఉగాది సంచికలు తెలుగువారి సంస్కృతికి ప్రతిబింబంగా ఉండటానికే ప్రయత్నిస్తూ వచ్చాయి. చిత్రలేఖనం, కవిత్వం, కధలు, చరిత్ర మొదలయిన రచనలకి ఉగాది సంచికలో తగిన స్థానం ఎప్పుడూ ఉంది కాని కొన్ని సంవత్సరాలుగా ఉగాది సంవత్సరాది సంచికలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదివే వారికి అందుబాటులో లేవన్న భావం కొంత పొడసూపకపోలేదు దీనిని మనసులో ఉంచుకునే ఈ ఏడాది, అంటే రక్తాక్షి నామ సంవత్సరం, సంవత్సరాది సంచిక ఆంధ్రసచిత్రవారపత్రికకి అనుబంధంగా వెలువరించాలనుకున్నాము. ఈ సంకల్పం ఎంత దాకా నెరవేరిందో పాఠకులే నిర్ణయించగలరు ! మంచి రచనలు చదువరులకి అందించటమే ఆంధ్రసచిత్రవారపత్రిక ధ్యేయం

కొన్ని వారాలుగా విపరీతంగా న్యూస్ ప్రింట్ కొరత ఏర్పడింది. ఇది ఎంతకాలం కొనసాగుతుందో తెలియదు. ఈ సంచిక అనుకొన్నన్ని పేజీలు వెయ్యలేని పరిస్థితి ఏర్పడింది. అందువల్ల కొన్ని మామూలు శీర్షికలని వెయ్యలేకపోయాము. ★

# ఉగాది

సంవత్సరమంతటికీ మొట్టమొదటి పండుగ ఉగాది. వసంత శోభను వెంట పెట్టుకుని వచ్చే అందమైన పండుగ ఇది. వసంతం అనగానే కోయిలమ్మ తీయని పాటలు, వేపపూలు, పుల్లని మామిడికాయలు, చెఱకు పానకాలు అన్నీవస్తాయి. రమణీయమైన ప్రకృతి సౌందర్యం కవి హృదయాన్ని పరవశింపజేస్తుంది. చైత్రశుద్ధ పాడ్యమి ఆంధ్రుల ఉగాది. చరిత్రలో విక్రమాదిత్యుని రాజ్యాభిషేకం ఉగాదినాడే జరిగింది.

ఉగాదిరోజు ప్రొద్దున్న తలస్నానంచేసి కొత్త బట్టలు కట్టుకుని ముందుగా వేపపూవు పచ్చడి రుచిచూసి తరువాత కాఫీ తీసుకుంటారు. రుచికరమైన ఈ పచ్చడిని కొత్త బెల్లం, కొత్త చింతపండు, మామిడి ముక్కలు, వేప పూలు మొదలైనవాటితో ప్రొద్దున్నే చేస్తారు. మనకు ఇది అనాదినుంచీ వస్తున్న ఆచారం. అసలు దీని అర్థం అన్నిరకాల రుచులు కలబోసిన పసందైన జీవయాత్ర మనది అని. జీవితంలో మనం తీయనైనవి చేదైనవి ఎన్నో అనుభవాలు రుచి చూడవలసిఉంటుంది. కొన్ని సందర్భాలు ఎంతో సంతోషంగా గడుస్తాయి. కొన్నిసార్లు మనం ఊహించని కష్టాలు ఎదురౌతాయి. దీన్ని తెలియజేయటమే ఆ పచ్చడి ప్రత్యేకత. వేపపూవులు కలపటంలో ప్రధానోద్దేశ్యం ఏమిటంటే జీవితంలో తీపికన్న చేదే ఎక్కువ. నిత్యజీవితంలో కొంతమంది సినిమాలో నాయికా నాయకులను ఊహించుకుని అలాగే అతి సుందరంగా ఉంటుందనుకుంటారు. అది వట్టి హాస్యాస్పదమే. ఈ పచ్చడి ఇంత చక్కగా జీవిత సత్యాన్ని బోధిస్తుంది.

ఉగాదికి ముఖ్యంగా చెప్పుకోవలసింది "పంచాంగశ్రవణం" ఇందులో జరగబోయే సంవత్సరంలో దేశ పరిస్థితులు ఎలా ఉంటాయో చెపుతారు. గ్రహణ కాలాన్ని ఖచ్చితంగా తెలియజేస్తారు.

కొన్నిచోట్ల వసంత నవరాత్రులు జరిపి అమ్మవారిని తొమ్మిది రోజులూ తొమ్మిది రకాలయిన అవతారాలతో అలంకరించి పూజిస్తారు శ్రీరాముని పెళ్ళి సందడి ఉగాది నుంచీ మొదలవుతుంది. కొన్నిచోట్ల శ్రీరామ నవరాత్రులుగా ఈ తొమ్మిది రోజులూ ఉత్సవాలు చేస్తారు.

ఉగాదికి ఒక ప్రత్యేకత ఉంది. ఒక సంవత్సరం ముగిసి మరొక నూతన సంవత్సరంలోకి అడుగుపెడుతున్నాం. సంవత్సరారంభం అంటే ఒకవిధమైన ఉత్తేజం, ఉత్సాహం మనకు సహజంగా కలుగుతాయి. ఆ ఉత్సాహాన్ని ఏ వయస్సువారు ఆ వయస్సుకు తగిన విధంగా ఉపయోగించుకుని మానసికంగా ఎదిగి ఆత్మశక్తిని పెంచుకోవాలి. ఎన్నో తీర్మానాలు చేసుకొని ఆచరణలో పెట్టుకోవచ్చు. మన నాయకులు అధినేతలుకూడా కొన్ని ఖచ్చితమైన తీర్మానాలు చేసుకుని పాల మనసుల పసిపాపలందరికీ చక్కని భవితకు బాటలువేసి ప్రేమమూర్తి అయిన స్త్రీకి సమాజంలో పవిత్రమైన స్థానాన్ని ఇస్తే ఈ ఉగాదే ఇంకా ఎంతో ఆనందంగా ఉంటుంది. అటువంటి ఉగాది త్వరలోనే వస్తుందని ఆశిద్దాం.

—పి. ఆదిలక్ష్మి ★

# తమసోమా....

- శ్రీ వజ్ఝల కాళిదాసు

గాఢాంధకార గర్భం చీల్చుకొని
గూఢార్థంలా ప్రకాశిస్తుంది
ఉషస్సు
చీకటి ముద్దలాంటి మేఘం లోనే
మెరుపు
బహుకల్మషమయ మాయా సరసినే
ప్రాణం పోసుకొని జన్మిస్తుంది
శిశువు
ఓహో, ఓహో
ఊహాతీతం
ఏమిలోకమిది
ఎవరిమాయ ఇది !
క్షార జలమ్ముల సముద్రపు లోతుల
గాదె లభించును మంచి ముత్యములు !
బొగ్గులలోనే
పుట్టును రత్నము:
పంకమునందే
పద్మము పొడమును !
ఓహో, ఓహో
ఊహాతీతం
ఏమిలోకమిది
ఎవరిమాయ ఇది !!
ఉషస్సులోనూ మెరుపుల్లోనూ
ఉదయిస్తుంది మహత్తర కాంతి.
ముత్యమ్ములలో
మురిపెము నిండును
పద్మమ్ములలో
తేనియపండును !
ప్రసవ దళమ్ముల పరిమళ సంపద
ఫల సంచయముల అమృత మాధురులు
ఓహో ఓహో
ఊహాతీతం
ఏమిలోకమిది
ఎవరిమాయ ఇది !
ప్రకృతి దేవతా సృష్టి రహస్యము
పరమ పురుష వినోదలాస్యము
జ్యోతిర్గమయ !

# మధ్యతరగతి విలువలకి ముప్పు

బడ్జెట్ రోజులలో పాత రోజులు గుర్తుకి వస్తూ ఉంటాయి స్వరాజ్యం రాకముందు, స్వతంత్ర భారతదేశంయొక్క ఆర్థిక మంత్రులు తమ అవకతవక విధానాలని అవలంబించటానికి మునుపు, అంతా ఎంతబాగా ఉండేదో చెబుతూ ఉంటారు పెద్దలు కొందరు సాధారణంగా ఇలాంటివాళ్ళు బ్రిటిషువాళ్ళు సృష్టించిన మహా పరిపాలనా యంత్రాంగంలో గుమాస్తా పనులు చేస్తూ ఉండిఉంటారు -- కచేరీలలో గుమాస్తాలూ, తపాలా ఆఫీసులలో క్లర్కులూ, కోర్టులలో మున్సిఫ్‌లూ, రైల్వేలలో గార్డులూ వగయిరా ఉద్యోగాలు. ఆ రోజులలో రైల్వేలు ప్రయివేటు కంపెనీలుగా ఉండేవి తెల్లవాళ్ళు ఆఫీసరులుగా ఉండేవాళ్ళు ఒక భారతీయుడు హెడ్ క్లర్కులయితే విశేషమే వీళ్ళందరికీ నెలసరి ఆదాయం స్థిరంగా ఉండేది ధరలు సరసంగా ఉండేవి జిల్లా కేంద్రాలలో ఇంటి అద్దె రు 5, స్కూలు జీతాలు మొదలయినవి చాలా తక్కువ, మీ పయి అధికారి మంచివాడయితే మీ అబ్బాయికీ ఉద్యోగం ఇచ్చేవాడు. ఇంట్లో గుమాస్తా సంప్రదాయానికి భంగం కలిగేది కాదు నెయ్యి సేరు రు. 2 లేదా రు 3 ఉండేది, గోధుమ సేరు అణా — బేడ ఉండేది, బియ్యం అంతే, పాలూ అంతే ఉద్యోగ విరమణ కాలానికి కొంత నిలవ చేసుకుని సొంత ఊరుకి వెళ్ళటానికి వీలు ఉండేది. ఆ ఊళ్ళో తగిన గౌరవమూ లభించేది.

ఇదంతా మారిపోయింది మార్పు మంచికి కాక చెడుకి వస్తే ? ఈ రోజులలో మంచి నెయ్యి కొనగలిగినవారెవరు, బాగా ధనవంతులు తప్ప ? ఆఫీసులలో తెల్లదొరలు ఏరీ ? జేబులో వందరూపాయిలు పెట్టుకుని బజారుకి వెడితే ఏమి కొనగలరు ? అన్నిటికీ కష్టమే, చివరికి రిటయిరయినప్పుడు కష్టాలు మరింత పెరుగుతాయి. వచ్చే పెన్షన్‌తో ఏమి కొనాలి ?

ఇది ఒక రకం పరిణామం. ఇంకొక రకం పరిణామమూ లేకపోలేదు, 1947 తరువాత జీవనప్రమాణాలు బాగా పెరగలేదూ ? గుమాస్తాల కుమారులు కోట్ల రూపాయల వ్యాపారాలు చేసే కంపెనీలకి మేనేజర్లుగా లేరూ? మున్సిఫ్‌ల కొడుకులు హయికోర్టు జడ్జీలుగా లేరూ ? అంతదాకా ఎందుకు, ఒక నగరం "కొట్వాల్" మునిమనవరాలు ఈ దేశానికి ప్రధానమంత్రిగా లేరా ? సెలవులకి ఎక్కడికి వెళ్ళాలో తెలియని కుటుంబాలకి చెందినవాళ్ళు దేశంలోని బీచిల్కి విలాసయాత్రలమీద వెడుతూ ఉంటారు. కొందరు విదేశాలకీ వెడతారు. 5 చుక్కల హోటళ్ళలో కాళీ ఉండదు, ఎయిర్ పోర్టులు రైలు స్టేషనులలాగ ఉంటాయి ధరలు అధికం అవుతున్నాయి కాని కొనేవాళ్ళు కొంటూనే ఉన్నారుకదా ? అన్నిటికీ కొరతలే కదా ? రు. 75000 తక్కువకి కారు ఏది వస్తోంది ? ఇది ఒక బాంకు గుమాస్తా సాంవత్సరిక జీతానికి మూడు రెట్లు కాని కారు కొనాలంటే అయిదు సంవత్సరాలు ఆగాలే ? ఒక్కొక్కరూ రు 10000 డిపాజిట్ కట్టి లక్షమందికి పయిగ 'మారుతి' కారు బుక్ చేసుకోలేదూ ? రోడ్డుమీద కారులసంఖ్య పెరుగుతోంది, ఇళ్ళలో ఐస్ బాక్సుల సంఖ్య పెరుగుతోంది డ్రాయింగ్ రూమ్‌లలో సోఫాల సంఖ్యకూడా పెరుగుతోంది గ్రామాలలో, నగరాలలో మధ్యతరగతి మనుష్యుల ఆదాయాలు పెరుగుతున్నాయి వారి ఆత్మాభిమానమూ పెరుగుతోంది నలభయి సంవత్సరాల కిందలాగ చేతులు కట్టుకుని "అయ్యా, చిత్తం" అనటంలేదే వీళ్ళ ! గత 20-25 సంవత్సరాలలో దేశంలో పెద్ద సాంఘిక విప్లవం కొనసాగుతోంది 1950 ప్రాంతంలో ఒక గుమాస్తా పరిస్థితికన్నా 1984 ప్రాంతంలో ఆయన కుమారుడి పరిస్థితి బాగా ఉందనటంలో సందేహంలేదు

అయినా అసంతృప్తి, అశాంతి ! ఎందుకు? మన సంపద పెరుగుతోంది నిజమేకాని ఈ పెరుగుదలకోసం మనం కొన్ని విలువలని బలి ఇవ్వవలసివస్తోంది. సమాజంలో జరిగే బేరాలన్నిటిలోనూ నీతి లోపిస్తోంది, జీవితంలో నిజాయతీ దెబ్బతింటోంది నీతి, నిజాయతీలని నిలబెట్టేది సాధారణంగా మధ్యతరగతి వారే ఈ తరగతి వారు పరిశ్రమలు, వ్యాపారాలు మొదలయిన వాటి నిర్వహణలో ప్రధాన పాత్ర నిర్వహిస్తున్నారు కాని నిర్ణయాలు తీసుకునే శక్తి వారికి లేకుండా పోతోంది నిర్ణయాలని తీసుకునే వాళ్ళు ఎవరంటే అంతూలేలూ, పాటిల్‌లూను వీళ్ళకి పాతకాలపు విలువలు ఏవీ లేవు, ఆ విలువలు మధ్యతరగతివి కానివ్వండి, ధనవంతులవి కానివ్వండి వీళ్ళకి విలువలు అంటూ ఏవయినా ఉంటే అవి అధికారాలకి పరిమితమయినవి మాత్రమే వాళ్ళకి అధికారమే అన్నిటికన్నా ముఖ్యం శ్రీమతి గాంధీ కూడా వారి కోవకి చెందినవారే అందుకనే, మేధావులుగా పిలువబడే వారికి ఆమె దూరమయ్యారు మేధావులంటే సంస్కారంకల మధ్యతరగతి వాళ్ళే కదా ? ఈ వర్గం వాళ్ళు ఆర్థికంగా బాగానే ఉన్నారు కాని రాజకీయాలలో శక్తిహీనులయిపోయారు సాంస్కృతిక పరిణామాలలో వారి పెత్తనం లేకుండా పోయింది చివరికి ఏ కళాకారుడికి ఏ బహుమానం రావాలన్న విషయంలోనూ వీరిదే పెత్తనం

బ్రిటిషువాళ్ళు ఉన్నప్పుడు ఇలాగ ఉండేది కాదు యీ పెత్తనం అంతా వాళ్ళదేకాని ఒక పద్ధతిలంటూ ఉండేది. మధ్యస్థాయి అధికారులు నిబంధనల ప్రకారం తమ పనులు తాము చేసుకోగలిగేవాళ్ళు. ఈ పరిస్థితి మారిపోయింది ఎవరికయినా లయిసెన్సు ఇవ్వాలా, వద్దా ? ఈ ప్రశ్నకి సమాధానం చెప్పేది దానితో సంబంధం కల అధికారి కాదు. అన్నీ ఒక రాజకీయవాది ఎవరో నిర్ణయిస్తాడు. అందుకనే ఇలాంటిరాజకీయవాది అయిన అంతూలే తనకి ఇటు న్యాయస్థానాలనుంచికాని, అటు మేధావుల నుంచికాని అడ్డు తగులుతోందని అనిపిస్తే వెంటనే తన యజమానుల వద్దకి పరిగెత్తుతాడు. ఇటువంటి పరిస్థితులలో న్యాయస్థానాల పాత్ర పెరుగుతుంది రాజకీయవాదులకీ, ఇతరులకీ వచ్చే పేచీలని తీర్చగలిగింది ఇవేకదా ? అంతూలే వ్యవహారం ఒక ఉదాహరణ అయితే ఎస్కార్టన్స్ కేసు మరొక ఉదాహరణ. కోర్టులమీద నమ్మకం లేని రాజకీయవాదులు ఇంకా ఏమి చేస్తారో చూడాలి !

అంటే -- అసంతృప్తి అన్నది మిధ్యకాదు కాని అది వస్తువుల కొరతవలన కలిగేది కాదు. మధ్యతరగతి మునుపటికన్నా ఎక్కువగానే కావలసిన వస్తువులని కొనుక్కోగలుగుతోంది. కాని, ఆ తరగతికి ప్రమాణాలు ఏమిటో తెలియని అయోమయం ఏర్పడుతోంది. అయోమయాన్ని సృష్టించే వాళ్ళే అధికారంలో ఉంటున్నారు. అంత మాత్రాన మనం అధైర్యపడనక్కరలేదు. మన విశ్వాసాలని వదులుకోకుండా మన దేశానికి హాని చేస్తున్న వాళ్ళని ప్రతిఘటించాలి. ★



సీరియల్

# తీరాగానికదేతాళం

చక్కిలం విజయలక్ష్మి

**త**న గదిలో కూర్చుని ఏదో చదువుకుంటూన్న జయంతిని మంగమ్మ వచ్చి పిల్చింది ''అమ్మాయిగారూ, అమ్మగారు పిలుస్తున్నారు'' అంటూ.

పుస్తకం మూసి, వున్న చోట పెట్టి దిగివచ్చింది జయంతి

హాల్లో దాదాపు ఏభై చీరెలు ముందు పెట్టుకుని కూర్చుని వుంది సుమిత్రమ్మ. పక్కనే గీత నిలబడి ఒక్కొక్క చీరే భుజంమీద వేసుకుని చూసుకుంటోంది.

జయంతిని చూసి ''రారా గీత సెలెక్ట్ ఈరోజు పూర్తయ్యేలా లేదు నీకు నచ్చిన చీరెలు నీవు సెలెక్ట్‌చేసుకో'' అంది సుమిత్రమ్మ.

జయంతి వచ్చి కూర్చుని చీరెల కేసి చూసింది. అన్నీ చాలా ఖరీదైన చీరెలు. కొట్టొచ్చే రంగులతో ఆడంబరంగా వున్నాయి

''ఇప్పుడు చీరెలు ఎందుకత్తయ్యా ? ఊరి నుండి తెచ్చుకున్నవి వున్నాయిగా'' అంది.

సర్రున కోపం వచ్చింది సుమిత్రమ్మకు.

''లేవని అన్నానా ? ఉంటే కొనకూడదా ?'' అంది కసిరినట్లుగా. ఆమెకు మన్‌మోహన్ మాటలు మాటిమాటికీ గుర్తు వస్తున్నాయి– 'బట్టలూ అవీ పనిమనిషిలా ... ''

కాస్త బెదిరినట్లుగా నిస్సహాయంగా, మౌనంగా చీరెలు చూడసాగింది జయంతి నవ్వు వచ్చింది సుమిత్రమ్మకు.

''ఈ చీరె బాగుంది కదూ ?'' అంది ప్రసన్నంగా.

జరీ గుడ్డతో యాప్లిక్ వర్క్ చేసిన మేఘం రంగు లమెరికన్ జార్జెట్ చీరె అది.

''అబ్బ ! ఎంత బావుందో ! ఈ చీరెలో నీవింకా బావుంటావు జయంతీ'' అంది గీత.

ఇబ్బందిగా చూసింది జయంతి.

''ఇంత ఖరీదైన చీరెలు నాకు అలవాటు లేదు అత్తయ్యా'' అంది మొమాటంగా.

''అలవాటు చేసుకుంటే లవుతుంది ఫరవాలేదు తీసుకో.''

''ఉహూ. ఈ చీరెలు కట్టుకుంటే ఏమిటో ఇబ్బందిగా, పేరంటానికి తయారై వెళ్తున్నట్లూ, ఎప్పుడు వదిలించుకుందా మన్నట్లూ వుంటుంది. పైగా ఏదైనా పని జేయాలంటే అనుకూలంగా వుండదు.'' కాస్త బిడియంగా అంది జయంతి.

తను తెచ్చిన చీరెలు తక్కువ ఖరీదువని

## (గత సంచిక తరువాయి)

ఏనుస్తూ స్వంతంగా చీరెలు తెచ్చుకునే పద్మిని గుర్తు వచ్చింది సుమిత్రకు.

''సరే. నీకు నచ్చినవే తీసుకో'' అంది.

అన్నింటికంటే తక్కువ ధరలో గోరంత జరీ అంచువున్న లేత రంగు వెంకటగిరి చీరెలు రెండు తీసుకుంది జయంతి.

నవ్వుతూ అంది గీత ''వదినయితే ఈ చీరెల్ని మంగమ్మకు ప్రెజెంట్ చేసేది.''

సుమిత్రమ్మ గాభరాగా చూసింది జయంతి కేసి. జయంతి కులాసాగా నవ్వింది

## 7

పద్మిని గదిలో విశాలమైన గదిలో డన్‌లప్ బెడ్‌మీద కూర్చుని పేకాడుతున్నారు పద్మిని, గీత. సామాన్యంగా గీతతో పేకాడదు పద్మిని. ఇంట్లో ఏదైనా విశేషం జరిగినప్పుడు, పూర్తి వివరాలు తనదాకా రానప్పుడు గీతను ఇలా పేకాటకు పిలుస్తూ వుంటుంది.

ముక్కలు పేర్చుకుంటూ యధాలాపంగా అడిగినట్లుగా అడిగింది పద్మిని ''అత్తయ్య జయంతికి చీరెలు తీసిచ్చారటగా ?''

ఉత్సాహంగా అంది గీత ''ఔను. సన్నని జరీ అంచుతో సింపుల్‌గా చాలా అందంగా వున్నాయి. నేనూ తీసుకుందామనుకున్నాను గానీ అమ్మ కోప్పడుతుందని మానేశాను.''

''ఊ, అయితే ఆ పిల్ల నెమ్మది నెమ్మదిగా ఆ జబ్బు నీకూ అంటిస్తోందన్నమాట.''

''జబ్బేమిటి ! '' ఆశ్చర్యంగా అడిగింది గీత.

> **జరిగినకథ–2:** ప్రముఖ ఇండస్ట్రియలిస్ట్ రఘునాధరావుగారు జయంతిని తన ఇంటికి తీసుకొనివచ్చి, భార్య సుమిత్రకు పరిచయం చేస్తారు. ఆమె జయంతిని గుర్తిస్తుంది తరువాత ఇంటిలోని సభ్యులకు ఒక్కొక్కరికి జయంతిని పరిచయం చేస్తారు జయంతి మరునాడు ఒక్కొక్కరి గది పరిశీలుస్తూ మన్‌మోహన్ గదిలో అతని ఫోటోను చూస్తుంది. వారం రోజుల్లో ఆ ఇంటికి పరిసరాలకి అలవాటు పడుతుంది జయంతి. జయంతిని కొత్త వంటమనిషి అన్నందుకు మన్‌మోహన్‌ను గట్టిగా కోప్పడుతుంది సుమిత్రమ్మ. గీత, జయంతి స్నేహంగా ఉండటం పద్మినికి నచ్చదు.

''అదే, సింపుల్‌గా వుండటం అనే జబ్బు ఈ పేదవాళ్ల కుండే కుళ్లె అది అందంగా, ఆడంబరంగా వుండే వాళ్లను చూసి లోలోపల కుళ్లుకుంటూనే సింపుల్‌గా వుండటంలో ఎంత హాయి వుందో మనను నమ్మమంటారు తమకు లేనిది మనం అనుభవిస్తున్నామనే దుగ్ధ తప్ప లేమిలో, నిరాడంబరత్వంలో సుఖం వుందని కాదు,'' కసిగా అంది పద్మిని

''ఛఛ. జయంతి అలాంటిది కాదు వదినా, చాలా మంచి అమ్మాయి తను సింపుల్ శారీస్ తీసుకుంది గానీ నన్ను తీసుకొమ్మనలేదు ''

''అదంతా నాటకం, మంచివాళ్లెప్పుడూ మంచివాళ్ళుగా కనిపించరు కనిపించటానికి ప్రయత్నించరు వాళ్లు చాలా మామూలుగా వుంటారు. ఒకరిని ఆకర్షించటానికి కాకుండా వాళ్లేది చేయలనుకుంటారో దాన్ని అతి సహజంగా చేసుకుపోతారు. కడుపులో కుళ్లు వున్నవాళ్లే మంచివాళ్ళుగా కనిపించటానికి తాపత్రయ పడుతుంటారు ''

''ఇప్పుడు జయంతి అంత అసహజంగా ఏం ప్రవర్తించింది ? ! ''

''అత్తయ్య ఖరీదైన చీరెలు తీసుకోమంటే అంత చౌక చీరెలు ఎన్నిక చేసుకోవలసిన అవసరం ఏముంది? అందమైన చీరెలు తేరగా వస్తూంటే వద్దనే మూర్ఖులు ఎవరైనా వుంటారా ? ఇది కపటం కాదూ ? అయినా ఈ జయంతి ఎవరు ? ఆ పిల్లకు మనం చీరెలు తీసివ్వటం ఏమిటి ? '' అసహనంగా అంది పద్మిని

''జయంతి మన బంధువులమ్మాయిట ''

''ఈ కుటుంబానికి నాకు తెలియని కొత్త బంధువు లెవరున్నారట ? ఆ పిల్లమీద అంత సానుభూతి వుంటే ఎంతో కొంత ముట్టజెప్పి పంపించాలి. లేదా నెల కింత జీతం ఏర్పాటు చేయాలి. అంతేగానీ మనతోపాటు చీరెలు, నగలు కొనిపెట్టడం ఏమిటి ! అసహ్యంగా లేదు ? నువ్వేమంటావ్ ?''

''అవన్నీ నాకు తెలీవుగానీ 'జయంతి నీకు వదిన అవుతుంది ' అని నాన్నగారు ఓసారి నాతో అన్నారు. 'జయంతి శాశ్వతంగా ఈ ఇంట్లో వుండిపోవలసిన పిల్ల' అని అమ్మ చాలాసార్లు అంది'' అన్నది గీత.

ఆ అమ్మాయికి జయంతిని పద్మిని ఇంతలా తీసేసి మాట్లాడ్డం ఇబ్బందిగా, బాధగా వుంది.

''కొంపదీసి మీ మనూ అన్నయ్యకు చేసుకుంటారా ఏమిటి ?'' ఎగతాళిగా నవ్వుతూ

అనబోయిన పద్మిని మాట పూర్తిచేస్తూ వులికిపడింది.

"ఔను. చేసుకుంటే బాగుంటుంది కదూ ?" చాలా ఆసక్తిగా అంది గీత.

ఆ మాట వినిపించుకోలేదు పద్మిని. "వెళ్లు వెళ్లు. వెళ్లి చదువుకో" కసిరినట్లుగా అని బెడ్‌పై వెల్లకిలా పడుకుని ఆలోచనలో పడిపోయింది.

* * *

రెండు మూడు రోజులు గడవకముందే పద్మిని తల్లి, దండ్రి, పినతండ్రి దిగబడ్డారు

పద్మిని పినతండ్రికి వయసొచ్చిన ఓ కూతురు వుంది. ఆ పిల్లకు అందచందాలతో పాటు బి.ఏ. డిగ్రీ వుంది. పిల్ల తండ్రికి లక్ష దాకా కట్నం ఇవ్వగల స్తోమత వుంది. ముఖ్యంగా పిల్లకీ, పిల్ల తండ్రికీ, వాళ్లను పిలిపించిన పద్మినికీ మన్‌మోహన్‌ను వాళ్లింటి అల్లుడుగా చేసుకోవాలనే కోరికా వుంది. మన్‌మోహన్ తాలూకు లేమిపట్ల అసహనం, అంతస్తుపట్ల అభిరుచి, సంపద తెచ్చిన అహంభావం పద్మినికి చాలా ఇష్టం.

విషయం విని రఘునాథరావు దంపతులు ప్రాన్పడిపోయారు. వాళ్లకు వెంటనే అర్థమైపోయింది జయంతి ఈ ఇంటికి వచ్చిన కారణం గ్రహించి పద్మిని క్షణాలమీద తన వాళ్లను పిలిపించిందని అయితే జయంతి విషయం కప్పిపుచ్చాలని గాని, వచ్చినవాళ్లను మభ్యపరచాలని గానీ వాళ్లను కోవటం లేదు ఉన్న విషయం బయట పెట్టాలనీ, మరో ఆడపిల్ల తండ్రి ముందుకు వచ్చి ఇబ్బంది పెట్టే అవకాశాన్ని ఇవ్వకూడదనే వాళ్ల వుద్దేశం. అయితే మనూ కాస్త తలతిక్క మనిషి. అతనికి ఎప్పుడుబడితే అప్పుడు ఏ విషయంబడితే ఆ విషయం చెప్పి ఒప్పించటం చాలా కష్టం. ఆ తగిన సమయం కోసమే వాళ్లు ఎదురు చూస్తున్నారు. ఇంతలో ఈ ఉపద్రవం వచ్చిపడింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక తోటలో కుర్చీలు వేయించుకుని కూర్చున్నప్పుడు పద్మిని తండ్రిగారు కదిలించనే కదిలించారు.

"బావగారు మేము వచ్చిన విషయం గ్రహించే వుంటారు."

"అమ్మాయిని పురిటికి తీసికెళ్లే విషయమే కదా ?"

"అబ్బెబ్బే. అదేం కాదు. తొమ్మిదో నెల్లో తప్ప పంపమని ఇదివరకే చెప్పారు కదా."

'మరేమిటి ?' అన్నట్లుగా చూశారు రఘునాథరావుగారు.

"అదీ... మా మంజుల విషయం. మా తమ్ముడు కట్నం ఎంతైనా ఇవ్వగలడు. కాని అపాత్ర దానం చేయకూడదన్నట్లు అంత కట్నం పోస్తూ అల్లాటప్పా సంబంధాలకు ఇచ్చుకోం కదా ? పోతే మీ గురించి మాకూ, మా గురించి



మీకూ తెలియనిదేమీ లేదు మన మన్‌మోహన్ అయితే అన్ని విధాలా తగినవాడని నేనే మా తమ్ముణ్ణి ఒప్పించి తీసుకువచ్చాను. ఏదో అక్కా చెల్లెళ్లు ఒక ఇంటి కోడళ్లయితే కలిసిపోయి మసలుకుంటారు. మీకు గానీ, మాకు గానీ నిశ్చింతగా వుంటుంది. ఏమంటారు ?''

''అనడానికి ఏముంది ? మీ ఆలోచన సబబైనదే. కాని అబ్బాయి ఇంకా చదువు కుంటున్నాడు...''

''భలేవారే బావగారు. ఇంకా చదువేమి టండీ ! ఇంకో రెణ్నెల్లలో పరీక్ష లైపోయి బోర్డు వేసి లీడింగ్ లాయర్ అయిపోతాంటేనూ !''

''ఏది ఏమైనా ఇంకో రెండేళ్ళ దాకా అబ్బాయి పెళ్ళిమాట తలపెట్ట తల్చుకోలేదు. పైగా అమ్మాయి వుంది. దాని పెళ్ళి తర్వాతే మనూ పెళ్ళి.''

''పోనీ అలాగే చేద్దాం. ప్రస్తుతానికి నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుంటే పెళ్ళి రెండేళ్ళ తర్వాతే చేయవచ్చు'' పద్మిని పిన తండ్రి అన్నాడు.

ఇంకేం సాకు చెప్పాలో తోచలేదు రఘునాధరావు గారికి. ఇక వున్న విషయం చెప్పక తప్పేలా లేదనిపించింది.

''కన్య అంటే లక్ష్మి సమానం. మరి అలాంటి కన్యాదానం చేస్తామంటే కొంగు పట్టే అవకాశం లేక పోవడం మా దురదృష్టం. మీ దగ్గర దాచే దేముంది ! మనూకు ముందుగానే అనుకున్న సంబంధం ఒకటుంది. మీ సంబంధం విషయంలో మాకెంత గురివున్నా ముందుగా అనుకున్నది కాదనుకోవడం సమంజసం కాదుగా ?''

ఇది వూహించినదే అయినా చకితులైనట్టు నటించారు వియ్యంకులు.

నిష్కర్షంగాఅన్నట్టుగా అన్నాడువియ్యంకుడు ''బాగుందండీ బావగారు హాస్యం. ఇంటి కోడలి

# ఈ రాగానికదే తాళం

క్కూడా తెలీకుండా సంబంధం కుదుర్చు కున్నారని మమ్మల్ని నమ్మమంటారు ?!''

''చిన్నప్పుడెప్పుడో అనుకున్నది. ఇటీవల మరుగున పడిపోయింది. అందువల్ల పద్మినికి తెలిసే అవకాశం లేకపోయింది. అంతే.''

''మరుగున పడిపోయినా ఇన్నేళ్లకైనా మళ్లీ వెలికితీసి గుర్తు చేసుకుంటున్నారంటే గొప్ప సంబంధమే అయి వుంటుంది. ఎవరి కుటుంబంలో పిల్ల బావగారూ ?'' ఎంత లౌక్యంగా మాట్లాడినా ఆ మాటలు వెనుక వ్యంగ్యం కొట్టవచ్చినట్టు కనిపిస్తూనే వుంది

సుమిత్రకు మండిపోయింది. రఘునాధరావుగారు ముందుగానే హెచ్చరించటం వల్ల ఆవిడ అంతవరకూ నోటికి తాళం వేసుకుని కూర్చుంది. ఇప్పుడు ఆవేశంగా నోరు తెరవబోయింది గానీ భర్త కళ్లతోనే వారించటంతో ఆగిపోయింది.

''మన జయంతి'' అన్నారు రఘునాధరావు. ఆ అనటంలో వియ్యంకులిద్దరూ ఎంత వెదకినా న్యూనభావం కనిపించలేదు, సౌమ్య భావం తప్ప.

ఆశ్చర్యంతో తల మున్కలైనట్టు పోజు పెట్టి అంది పద్మిని తల్లి ''ఎవరు ! ఇంట్లో పని పాటా చేస్తూ తిరిగే ఆ పిల్లా !?''

ఇక వూర్కో లేకపోయింది సుమిత్రమ్మ.

''ఆడపిల్ల పనిపాటా చేసుకోక నైట్ క్లబ్బులవెంట తిరిగితే సంసారాలు నడుస్తాయా వదినగారూ ?'' అంది.

''అలా అంటారేమిటి వదినగారూ ! అర్హత, అంతస్తునుబట్టి చేసే పనులుంటాయి'' అంది వియ్యపురాలు

''నిజమేలెండి. జయంతికి క్లబ్బులో పేకాడేంత అంతస్తు లేదు. కానీ మనూకు భార్య కాదగ్గ అర్హత మాత్రం పుష్కలంగా వుంది '' నవ్వుతూనే అంది సుమిత్రమ్మ.






## ఉగాది నాడు

వలికారులో దిగంబరములై లజ్జించు
ప్రాకులు చివురాకు కోకలూనె —
ఉన్నయట్లుండి కుహూ కుహూ గానము
వినిపించె నారామవీధి నుండి —
మల్లికా సౌరభోన్మత్తమ్ములై వీచె
మందమందమ్ముగా మారుతములు —
భావి శుభా శుభ ప్రవచనం బొనరింప
పంచాంగమును విప్పె బాపనయ్య —

ప్రతి గృహంబున చైత్ర ప్రభాతవేళ
వేపపువ్వుల పచ్చడి విందు జరిగె
తెలుగువారల మొగముల వెలుగుతోచె
వచ్చె రక్తాక్షి — నూతన వత్సరమ్ము.

**— శనగన నరసింహస్వామి**

''అయితే మనూ క్లబ్బులకు, క్రికెట్ మేచ్‌లకు తన వెంట రావడానికి మరో భార్యను చేసుకుంటాడా ?'' ఏగతాళిగా నవ్వుతూ అంది వియ్యపురాలు

సుమిత్రమ్మ ఆవేశం హద్దులు దాటి పోయింది. అయినా చిరునవ్వుతో అంది ''హరి ఇంట్లో పనిపాటల కోసం మరో పిల్లను చేసు కున్నప్పుడు మనూ కూడా తన వెంట తిరగ డానికి ఇంకో పిల్లను చేసుకుంటాడు.''

ఉండేలు దెబ్బతిన్న పిట్టలా నిర్జీవం అయిపోయింది వియ్యపురాలి ముఖం.

చిలికి చిలికి గాలివాన అయ్యే ప్రమాదం వుందని గ్రహించిన రఘునాధరావుగారు సుమిత్రమ్మకు మరి మాట్లాడటానికి అవకాశం ఇవ్వలేదు.

''దానికేమిగానీ మరోసారి మీతో వియ్యమందే అవకాశం వచ్చింది. అయినా దాన్ని సద్వినియోగం చేసుకోలేక పోతున్నందుకు విచారంగా వుంది. జయంతి ఈ ఇంటి కోడలు కాక తప్పదు. అయితే మీ కుటుంబంలోని ఒక అమ్మాయి మా కోడలయింది. మాకూ ఓ అమ్మాయి వుంది. మీ కుటుంబంలో తగిన అబ్బాయి వుంటే చూడండి. దానిదేముంది ? మరోసారి మనం వియ్యం కలుపుకోవచ్చు'' అన్నారు.

మరో రెండు మాటలు వేసినా రఘునాధరావుగారు అంతకంటే ఎక్కువ మాట్లాడలేక పోయారు. ఇక బలవంతం చేయడం సభ్యతగా వుండదని అనుకున్నారేమో ''అలాగే కానివ్వండి'' అన్నాడు వియ్యంకుడు.

## 8

''వయసు పైబడేకొద్దీ మీ అమ్మా నాన్న లకు మతి పోతున్నట్టుంది.'' ఉపోద్ఘాతం లేకుండానే అంది పద్మిని.

# ప్రేమ్ సబ్బుతో స్నానం
# రోజంతా ఉల్లాసం

మీ శరీరమునకు మృదుత్వమునిచ్చి సహజ
సౌందర్యమును పెంపొందించు సబ్బు ప్రేమ్.
దీని స్వచ్ఛమైన నురగ, పరిమళము
మీ మనసును పులకింపజేయును.




గులాబి మఱియు ఆకుపచ్చ
రంగులలో లభించును



జయలక్ష్మి
గుంటూరు వారి తయారీ

Imageads M-1783

# పలాశ రక్తాక్షులు

## డాక్టర్ దాశరథి

ఈ రక్తాక్షి పలాశాలు
ఎవరు ఎగురవేసిన పతాకాలు ?
ఇవి గ్రామీణ కామినులకు
ఎంతో విలువైన గులాబీలు
నల్లని సిగల్లో ఎర్రని మోదుగుపూలు
చల్లని ఆకాశంలో వెచ్చని ప్రభాతాలు
కాళిదాసు వర్ణించిన పలాశ కుసుమాలు
బాలేందు వక్రాలు, నఖక్షత మనోహరాలు
పట్నాల్లో కనిపించని పలాశాలు తీసుకుని
బహుదూరపు అడవుల్లో దిగుతుంది ఆమని
అందుకే ఉగాది, అడవుల్లో బాగుంటుంది;
అరుణ పలాశ సుమంపై నల్లని తుమ్మెద వాలుతుంది
మకరందం ఆరగించి మత్తెక్కి ఝుమ్మంటుంది
మానవుడు చేయలేని పని మధుపం చేస్తుంటుంది
భిల్లాంగన నల్లని కబరీ భరంలో చెక్కిన
విచ్చినపలాశ సుమావళి ఎంతో చక్కన
గులాబీలమీద లేని మోజు
పలాశములపై కలుగుతుంది ఈరోజు
''పలాశ కుసుమవ్ వృథా'' — కాదు
పనికిరానిదేదీ సృష్టిలో లేదు
అడవిలో నిప్పంటుకున్నట్టులు
అగుపిస్తాయి మోదుగు పూమంటలు
పలాశ పతాక చేతగొని
వాలింది వనిలో ఆమని
ప్రతిపలాశం రక్తాక్షి
ప్రతి మనిషీ క్షుధాగ్నికుక్షి
''రక్తాక్షి'', పూచిన మోదుగువలె
రమణీయంగా వుంటే హర్షించవలె
రక్తపాతం లేకుండా ఈ సంవత్సరం
రక్తి కట్టగలిగితే మనకు సంబరం.

''పోనీలే. మతి పోతూ వుండటంవల్ల కనీసం మతి అన్నదొకటి వాళ్లకు వుందని అర్థం అవుతోంది నీకది కూడా లేదు కదా'' అన్నాడు హరి.

''నన్ను కించపరుస్తూ తప్ప నాతో మాట్లాడలేరా ? ''

''ఎవరు ఎవర్ని కించపరుస్తున్నారో తెలీకుండానే అంటున్నావా ? నిన్ను కట్టుకున్న నేరానికి నీవు ఏమైనా అనేదుంటే నన్ను అను. వాళ్లననడం ఎందుకు ?''

''వాళ్లు చేసే తప్పులు వాళ్లను చేయనివ్వు. అనేదేదో నన్ను అను అనటంలో ఏమైనా అర్థముందా ?''

''అంత నేరం వాళ్లేం చేశారు ?''

''ఇంకా ఏం చేయాలి ? ఆ జయంతిని ఈ ఇంటి కోడల్ని చేస్తారట !''

''ఏం ? తప్పేముంది ? జయంతి ఆడపిల్ల కాదా ?''

''అంటే ! పెళ్లి చేసుకోవడానికి ఆడపిల్ల అయి వుండటం ఒక్కటే చాలంటారా ?''

''చాలదుగానీ జయంతికి ఆడపిల్లకు వుండవలసిన లక్షణాలన్నీ వున్నాయి. అది చాలు.''

''మీరు కూడా మతిపోయి మాట్లాడుతున్నారు. ఆడపిల్లకు వుండవలసిన లక్షణాలేమిటి నా మోహం! ఆ లక్షణాలుండబట్టే ఆడపిల్ల అంటారు'' అసహనంగా అంది పద్మిని.

''అలా ఎలా అవుతుంది ? నీవు కూడా ఆడపిల్లవే. మరి నీలో ఆడపిల్ల లక్షణాలేవీ ?'' అన్నాడు హరి.

## ఈ రాగానికదే తాళం

''అంటే అంట్లు తోమటం, వంట చేయటమేనా ఆడపిల్ల లక్షణాలంటే?'' కోపంతో మండిపడింది పద్మిని.

''అంతేకాదు. ఇల్లు దిద్దుకోవటం, భర్తను లాలించడం, కుటుంబ సభ్యులను సమాదరించడం. ముఖ్యంగా ఆడపిల్లకు మృదు హృదయం వుండాలి. ఇంత అసహనం, కర్కశత్వం పనికిరాదు'' చిరునవ్వు నవ్వుతూ అన్నాడు హరి.

''ఇలాంటి మాటలతోనే ఆడవాళ్లను మాయపుచ్చి వంటింటి కుందేళ్లను చేశారు మీ మగవాళ్లు. ఇక ఆ పప్పులేవీ వుడకవు'' వ్యంగ్యంగా అంది పద్మిని

''నీవు తప్పుగా అర్థం చేసుకుంటున్నావు పద్మా. స్త్రీలను వంటింట్లో మగ్గిచావమని నేననటం లేదు. ఈనాడు స్త్రీలు దేశాలేలుతున్నారు. వాళ్లు మృదు హృదయులైతే దేశ ప్రజల్ని కన్న పిల్లల్లా పాలించగలరు. స్త్రీ వంటింట్లో వుందా ? దేశాన్నేలుతోందా? అన్నది కాదు ముఖ్యం. స్త్రీ ఏ స్థానంలో వున్నా ఆ స్థానంలోంచి స్త్రీత్వంలోని ఆ మాధుర్యం అందరికీ పంచబడాలి. అది ముఖ్యం.''

''అంటే ఆ మృదుత్వం, మాధుర్యం నాలో లేవనేగా మీరనేది ?'' మండిపడింది పద్మిని.

''అది ఒకరనేది కాదు. వాళ్లవాళ్ల ప్రవర్తనే చెబుతుంది.''

అంతవరకూ హస్తభూషణంగా పట్టుకుని వున్న ఇంగ్లీషు నవల భర్త మీదికి విసిరికొట్టింది పద్మిని. తల దగ్గర, కాళ్ల దగ్గర వున్న నాలుగు దిండ్లను విసిరేసింది. కుర్చీలో కూర్చున్న హరి ఒక్క అంగలో లేచి వచ్చాడు. మంచం పక్కన టీపాయ్‌మీద వున్న పేపర్ వెయిట్ అందుకున్న పద్మిని చేతిని పట్టుకుని రెండు చేతుల్లో ఆమెను బంధించాడు.

పద్మిని కళ్లు కెంపులయ్యాయి. కోపంతో ముక్కుపుటాలెగిరి పడ్డాయి. పెదిమలు అదర సాగాయి.

''ఆడదాని కోపం పడగ్గదికే అందం సుమా ! కానీ దాన్ని పడగ్గదిలోనే బంధిస్తే బావుంటుంది. ఏమంటావ్ ?'' అన్నాడు హరి కొంటెగా నవ్వుతూ.

కోపం జారిపోయి వ్యంగ్యం చోటు చేసుకుంది పద్మిని ముఖంలో.

''ఇదేమాట మీ అమ్మగారికి చెప్పలేక పోయారా ?'' అంది.

పద్మిని ఆశించిన రియాక్షన్ కనిపించలేదు హరిలో. అలాగే నవ్వుతూ అన్నాడు ''మా అమ్మ కోపం దుర్వాసుని కోపం లాంటిది. అది ఎవరికీ హాని చేయదు.''

''రేపు నా కొడుకు కూడా నా కోపాన్ని గురించి ఇలాగే అంటాడు. అప్పుడేమంటారు ?''

''అమ్మ దొంగా ! అయితే కొడుకునే కనబోతున్నావన్న మాట !''

సిగ్గుపడ్తూ అంది పద్మిని ''కన్నా మీలాంటి కొడుకును మాత్రం కనను.''

చిన్నబోయాడు హరి.

''అదేం ?''

''అదంతే. మీలా నా కొడుకును మానవ

# కరుణాసిక్తాక్షి!

సిరిసంపద్వి భవమ్ములిమ్మ, వరుసం జేయెత్తి, ప్రార్థింతు, మా
దర పాత్రంబవు గమ్మటంచు, రుధిరోద్గారీ, నినుంగోర, మా
దురదృష్టంబగు, నీదు యేలుబడిలో, దుర్మార్గముల్ రేగె, దు
ర్భరమై పోయెను సాధుజీవన, మపారం బాస్తినష్టంబుగాన్ ॥

ఎందరు బ్రాహ్మసేవనులు, యెందరు ప్రాజ్ఞులు, రాజనీతి స
ద్వందితు, లెంద రాప్తులు వదాన్యులు, పొట్టనుబెట్టికొంటి, నీ
తుందుదులేమొ, ధాన్యములు దోచితి, గ్రామములూ చముట్టుగా
మందెను, శాంతి నొందితివె, రాక్షస, పుణ్యము, పూరుషార్థమా ॥

ఇక నీ పాలన శేషమందు, ప్రజకెతే సౌఖ్యముల్ గూర్పు, బా
యక, కష్టమ్ములు తెచ్చివచ్చునెద, సౌఖ్యాంతంబుగానేగు మా
గక, సంతృప్తియె యింక మాకు, రుధిరోద్గారీ, వినూత్నాదృతిన్
యొకమారీ విటురమ్ము శోభనము మారున్‌గూర్ప నుత్సాహివై ॥

అక్షీణ ప్రతిభా సమన్వితుడవై, యబ్దాధిరాజన్య, ర
క్తాక్షీ ! నీ పరిపాలనన్, జను లహంకారంబు బోనాది, ని
త్యక్షేమంకరులై, పరోపకృతులై, యత్యంత భాగ్యమ్మ, సత్
శిక్షాయుక్తి వెలుంగనిమ్మ "కరుణా సిక్తాక్షి"వై, ప్రమొక్కెదన్ ॥

రాజరికమ్మ చంద్రుడనెడ, రక్షణ, ఆప్తత, అర్ఘ్యశాఖలం
దాజగజెట్టి శుక్రుడును, అంబుదరాశి గురుండు, ధాన్యముల్
తేజసి సూర్యుడున్ వెలయ, దేశము సర్వసుఖాలవాలమై
ప్రస్తి జనహ్లాదవంబయి, విశేషము పాడియు పంటగల్గి, యే
యోజ కొరంతలేక, మను, యోగ్యత గూర్పుము నూతనాబ్దమా !

— శ్రీ ములుమూడి లక్ష్మీనరసింహం

సేవ అంటూ పేద బ్రతుకు బ్రతకనివ్వను. వాడు మీలా కాటన్ బట్టలు ధరించడు. ఆకు చెప్పులు వేసుకోడు. సైకిల్‌మీద తిరగడు" గర్వంగా అంది పద్మిని.

పద్మినిని వదలి దూరంగా నిలబడ్డాడు హరి.

"నీవు చాలా మూర్ఖత్వంలో వున్నావు పద్మా. జీవితం అంటే ఆడంబరాలు అనుభవించటం మాత్రమే కాదు."

"ఔనౌను. తినడానికి తిండివున్నా పస్తులుండటం."

"పస్తులుండమని కాదు. ఎదుటి మనిషి పస్తులుండగా పరమాన్నం తినే హక్కు మనకు లేదు."

"ఈ సమానత్వం అనేది జీవితంలో

## ఈ రాగానికదే తాళం

సాధించడానికి ఎంత మాత్రం వీలులేనిది. పుస్తకాల్లో చదువుకోడానికి బాగుంటుంది. దేశంలో ఇన్ని కోట్లమంది పేదవాళ్ళున్నారు. మనకున్న కొద్ది సంపద ఎంతమందికి పంచగలం ?"

"పక్కవాడికి పంచగలిగితే చాలు."

"అప్పుడు మనం పస్తులుండాలి."

"కష్టపడే వాడెప్పుడూ పస్తులుండడు."

మండిపడింది పద్మిని. "ఏమిటి మీ వాదన! మన పెద్దలెంతో కష్టపడి ఈ సంపద కూడబెట్టి వుంటారు. మళ్ళీ అదంతా నలుగురికీ పప్పుల్లా పంచిపెట్టి తినడానికి మళ్ళీ కష్టపడాలా ? ఇలా కష్టపడి, సంపాదిస్తూ, పంచిపెడ్తూ, మళ్ళీ సంపాదిస్తూ, మళ్ళీ పంచిపెడ్తూ... దాని కంతం లేదా ? ఈ మాత్రానికి ఎందుకు సంపాదించాలి ?"

"శ్రమించటం శరీర ధర్మం. మనకున్నది నలుగురికీ పంచటం మానవ ధర్మం."

"ఈ నవలల్లో డైలాగులు వల్లించకండి. నాకు ఒళ్ళు మంట".

నిట్టూరుస్తూ అన్నాడు హరి "నా విషయంలో నీకు ఒళ్ళు మండని అంశం ఏదైనా వుందా ?"

క్షణంలో పద్మిని ముఖంలోని కోప ఛాయలు మాయమయ్యాయి. నవ్వుతూ అంది "ఎందుకు లేదు! వుంది."

ఆశ్చర్యపోయినట్టు చూశాడు హరి.

"ఉందా ! ఏమిటది ! ?"

"నాకు భర్త కాగలిగిన మీ అదృష్టం"

హరి కూడా నవ్వాడు.

"నాకంటే ముందుగా నా అదృష్టాన్ని గుర్తించిన నీకు నా ధన్యవాదాలు" అన్నాడు కొంటెగా.

సర్రున కోపం వచ్చింది పద్మినికి.

"ఏదో మొరటు సామెత చెప్పినట్లు నా విలువ మీకూ, మీ వాళ్ళకూ ఏం తెలుస్తుంది ! మీకు తెలిసిందల్లా అంట్లుతోమే వాళ్ల పనితనం".

శ్రీహరి ఏమీ అనలేదు.

'అభిజాత్యాన్ని చూసుకుని అహం పెంచుకోవడం కంటే అంట్లు తోమడంలో ప్రావీణ్యం అనే ఇన్‌డ్యువిజువాలిటీ కలిగి వుండటం గొప్ప విషయమే పద్మినీ' అనుకున్నాడు మనసులో.

మౌనంగా లేచి, బయటకు వెళ్లటానికి బట్టలు వేసుకోసాగాడు.

"ఇదిగో! మీరు మాటమార్చి వెళ్తున్నట్లు కాదు. ఆ జయంతి విషయం ఏదో తేల్చి మరీ వెళ్లండి" అంది పద్మిని.

తనను కాదన్నట్లుగా జోళ్ళు వేసుకుని గుమ్మం వైపు నడిచాడు హరి.

ఒక్క అంగలో మంచం దిగి వచ్చి భర్త కాలర్‌ను వెనక నుండి పట్టుకుంది పద్మిని.

"నేను మాట్లాడ్తుంటే పలక్కుండా వెళ్తారేమిటి ? నేనంటే అంత లక్ష్యం లేదన్న మాట ! ఊ ?"

వెనుదిరగలేదు హరి. మెడ మాత్రం తిప్పి అన్నాడు "చూడూ, నామీద అధికారం చూపే హక్కు నీకు లేదని నేను అనను. కానీ దాన్ని అందంగా చూపడం నేర్చుకో. ఇంత మొరటుగా కాదు."

కాలర్ మీది పద్మిని చేయి వదులయింది. హరి ముందుకు సాగిపోయాడు. కాళ్ళు నేల కేసి దబదబ బాదుతూ మంచం మీద వెళ్లి పడింది పద్మిని.

( ఇంకా వుంది )

### కొమ్మి దేవి — గుంటూరు

అసూయ ముందు పుట్టి ఆడది తరువాత పుట్టిందంటారు. సమంజసమే.

★ అందుకే ముందు పుట్టిన మగవాళ్లకి అసూయ ఎక్కువ !

భగవంతుడు కన్పిస్తే మీరు అడిగే మొదటి ప్రశ్న ఏది ?

★ ఎక్కణ్ణుంచి వస్తున్నారని ?!




### ఎమ్. కె. ఎస్. దులియాజాన్

పుట్టిన పిల్లకి మొదటి గురువు ఎవరు ?

★ తల్లి.

### పి.ఆర్. — భిలాయి

(1) ఇదివరకు సంవత్సరానికి పది నెలలు వుండేవట, జనవరి, ఫిబ్రవరి కలిశాయట. ఇందుకు కారణం ఏమిటి ? (2) సముద్రం లోతు, పొడవు, వెడల్పు ఎంత ? (3) మీ జవాబు చిన్నదిగా వుంటుంది. కారణం ? (4) ... ఇచ్చే జవాబులు చక్కగా జవాబులివ్వండి (5) మూడవ ప్రపంచయుద్ధం రావడానికి కారణాలు వివరించండి. (6) ప్రపంచంలో అతి విలువైన అతి విలువలేని వస్తువేది ?

★ అబ్బ ! కార్డు చదివేసరికే నీరసం వచ్చిందయ్య పేరెడ్డీ, కార్డు తప్పు అడ్రసుకి పంపావు !! ఇవన్నీ తెలిస్తే నేనింకా యిలాగే ఎందుకు వుంటాను ? నెత్తిన కొమ్ములు తిరిగేవి !

# ఇవేమన పద్యాలు




ప్రియములేని విందు పిండివంటలచేటు
భక్తిలేని పూజ పత్రిచేటు
ఓజమాలు వాలు ఓలిమాళ్లకు చేటు
విశ్వదాభిరామ వినుర వేమ.

### ఆర్. వి.— మాదాల

కట్నం ఎంత యిచ్చినా ఇంకా తీసుకురా, తీసుకురా అని కోడలిని కొట్టిపంపే ధనకామాంధులని ఏమనాలి? యీ సమాజం ఎప్పుడు మారుతుంది ?

★ కట్నం యిచ్చి ఆడపిల్లకి పెళ్లి చేయము అనుకునే తల్లితండ్రులు తయారవ్వాలి ముందు— కట్నం అడిగినవాడిని పెళ్లి చేసుకోను అని నిలబడగల అమ్మాయిలు తయారవ్వాలి జీవిత భాగస్వామిని డబ్బుతో బేరమాడని యువకులు తయారవ్వాలి. ఇదొక విషచక్రం, ఎప్పుడో ఎక్కడో ఒకరూ అరా — ఛేదించి లాభంలేదు. నాశనం చేయాలి. దానికి నాంది పల్కకల్గిన వాళ్లు — అమ్మాయిలూ అబ్బాయిలూను. ఆర్థికంగా ఒకరిమీద ఆధారపడనివాళ్లకే తెగింపు వుంటుంది. సంపాదించే వయస్సు వచ్చేదాకా అబ్బాయిలు, సంపాదించకల అర్హతలు సంపాదించనిదే — అమ్మాయిలు — పెళ్లికి తలవంచకూడదు.

### సి. హెచ్. వి. ఎస్. — కాట్రాయిపాడు

నాకు 25 సం. వుంటాయి — ప్రస్తుతం టెన్త్ పాసయ్యాను. నాకింకా చదువుకోవాలని వుంది. కాని జ్ఞాపకశక్తి వుండదు.

★ ఒక వయస్సు వచ్చేక అంతే — ఏదైనా ట్యుటోరియల్‌లో చేరి పరీక్షలకి కడుతూ ముందుకి సాగడమే దారి. నలుగురితో కలిసి చదువుకుంటూంటే తప్ప — పోటీ తత్వం ఏర్పడదు. పోటీ, స్పర్థ వుంటే తప్ప — చదువు రాదు.

### పి. ఆర్. బి. — చర్ల

సూక్తులు చెప్పడం వరకే, పాటించలేము అని తెలిసి కూడా చాలామంది చెప్తారు.

★ వినడానికే సూక్తులు చెప్పడం ! ★

# మీ పాప, పుట్టిన 6 గంటల తర్వాత మీ నుంచి ‘నివారక ఆహారం’ పొందుతుంది. దాన్ని యిచ్చేది మీరే యుగయుగాలుగా తల్లి యొక్క స్వాభావిక సంస్కారం యిది.



**తల్లి పాలు ప్రకృతి యిచ్చే మహత్వపూర్ణమైన వరం!**

ఎందుకంటే పాప పుట్టుకతోనే తల్లి స్తనాల్లో పాలు వస్తాయి. మరి వాటిలో ప్రాకృతికమైన రూపంలో "రోగ నిరోధక ద్రవ్యాలు" ఉంటాయి. దాంతో, అప్పుడే పుట్టిన పాపయొక్క ఆమాశయం, పేగుల్లోనివీ, యితర వ్యాధుల నుంచి రక్షణ కలుగుతుంది. అందుకే స్తన్యపానానికి అంత ప్రాముఖ్యత యివ్వబడింది.

**స్వాభావికమైన పోషణ**

శరీర నిర్మాణంకోసం ప్రకృతిలోని ప్రోటీన్లు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లు, ఆరోగ్యాన్ని కాపాడే విటమిన్లూ సరియైన మోతాదులో ఉండి, తల్లి పాలను సరిగ్గా సంతులితంగా కూడా తయారుచేస్తాయి— అప్పుడే పుట్టిన పాపకది సరియైన పోషణనిచ్చే ఆదర్శమైన ఆహారం అవడంకోసం (ఉదాహరణకి, స్తన్యపానం చేసే పాపలకు విటమిన్ సి లోటువలన వచ్చే స్కర్వీ వ్యాధి రాదు సాధారణంగా) మరి తల్లి పాలు తాగిన పాప ఎలా పెరిగి, పెరుగుతాదో చూడండి! ఇక మీరు మీ పాపను గుండెలకి హత్తుకుని పాలిస్తుంటే ఎంత ఆనందాన్ని పొందుతారని! మరి ఆ పసికందు యింత పెద్ద లోకంలో కేవలం మీ మమతను పొంది ఎంత సురక్షితంగా వున్నట్టి అనుభవాన్ని పొందుతాడని!

**ప్రపంచమంతా ప్రచలితం**

ఇప్పుడు రోజుకి రోజూ, ప్రపంచమంతటా ఎక్కువ మంది తల్లులు, అంటే పశ్చిమ దేశాలలో సహితం, తల్లులు తమ పాలే యివ్వడం మొదలెట్టారు. ఎందుకంటే, తల్లి పాలలోని అమూల్య పోషక తత్వాల మహత్తర లక్షణాన్ని మళ్ళా అవగాహన చేసుకోవడం మొదలెట్టారు.

**తప్పకపోతే**

మరి మీరేగనక యిక ఏ కారణం వల్లనైనా తప్పకపోతే, మీ పాపకు మీ పాలు యివ్వలేకపోతే— అంటే మీ ఆరోగ్యం సరిగా లేకనో, లేదా మీలో, సరిపడినన్ని పాలు పడకో, అలా జరిగినప్పుడేం చెయ్యాలి మీరు?
అటువంటి సందర్భంలో మీరు ఎంతో ఆలోచించిన మీదట, ఎటువంటి ఎటువంటి ఆహారం యివ్వాలంటే, ఆ యిచ్చేది తల్లి పాల తర్వాత అన్నింటికన్న ఉత్తమమైనదిగా ఎంచుకునేదాన్ని.

**స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే**

అమూల్‌స్ప్రే, పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం. ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు, దాంతోబాటే, తేలికగా అరగగలిగే కార్బోహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో ఆవశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి. ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది. మొదటిగానే పేస్ట్‌లా తయారు చేయవలసిన అవసరం ఉండదు.

**పొదుపు**

అమూల్‌స్ప్రే. డబ్బాలో దొరికే శిశుఆహారాన్నిటికన్న పొదుపైనది. ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన— "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు.

**జాగ్రత్త పడటం**

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ, సీసానీ, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి. పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి. పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదు ప్రకారమే ఖచ్చితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి.

**ఉచితం!** ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి- గర్భధారణ, ప్రసవానికి ముందర జాగ్రత్త, ప్రసవము, తల్లి పాలు, ఇతర ఆహారములు, మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దిన చర్య, పిల్లవాని అభివృద్ధి, జబ్బులను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు, జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ. జ్ఞాపకముంచుకోవలసిన విషయములు. ఈ పుస్తకం తెలుగు, ఇంగ్లీషు, హిందీ తమిళం, మలయాళం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ భాషల్లో దొరుకుతుంది. దానికోసం పోస్ట్ బాక్స్ 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రు. 1.25 స్టాంపుల్ని జతపర్చండి.




**అమూల్‌స్ప్రే**

తల్లిపాల తరవాతనే ఇది

అమ్మకం చేయించునారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్,
పోస్ట్ బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్.



ASP/AS-TEL5/83

# శ్రీవేంకటేశ్వర వైభవం!

తిరుపతి వేంకటేశ్వరస్వామిని గురించి ప్రత్యేకించి చెప్పవలసిన అవసరంలేదు కోట్లాది ప్రజల ఆరాధ్యదైవం ఆ శ్రీనివాసుడు ఆ స్వామి కరుణా కటాక్షాలవల్లే కుగ్రామమైన తిరుపతి మహానగరంగా రూపుదిద్దుకొంటోంది విద్యాకేంద్రంగా, వాణిజ్యనిలయంగా, ఆదర్శధర్మనీయ యాత్రాస్థలంగా, ప్రముఖ పారిశ్రామిక పురంగా నూత్న కాంతుల శోభలతో అలరిస్తున్న భూతలస్వర్గం తిరుపతి వ్యాటికన్ సిటీలా తిరుపతికి ప్రత్యేక ప్రాతినిధ్యాన్ని ఇచ్చి త్వరలో స్వర్ణోత్సవాలు జరుపుకోబోతున్న తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆధీనంలో ఉంచాలన్న ప్రతిపాదన చోటు చేసుకొంటోంది

ఏడుకొండలవాని సన్నిధిలో తిరుమల తిరుపతి, తిరుచానూరులు కలుపుకొని రమారమి రెండులక్షల జనాభా ఉన్నట్లు అంచనాలు తెలుపుతున్నాయి నిత్యం వచ్చే యాత్రికుల సగటు సంఖ్య పదహైదు వేలనుంచి ఇరవై అయిదువేలు కాగా — బ్రహ్మోత్సవాల సమయాలలో, నూతన సంవత్సర ప్రారంభ దినాలలో లక్ష రెండు లక్షల వరకు ఉంటుంది ప్రపంచంలో మరే ఇతర మత సంబంధమైన దేవస్థానానికీ ఇంత భారీఎత్తున యాత్రికులు రావడంలేదు నేడు విశ్వంలో మత పరంగా ఎక్కువ రాబడిని అందుకొంటున్న భారతీయ పుణ్యక్షేత్రం తిరుపతి మాత్రమే! సాలీనా 38 కోట్ల రూపాయల ఆదాయం ఏ ఇతర సంస్థలకు లేదు మరో విచిత్రమేమిటంటే తిరుమలేశుని రికార్డును తిరుమలేశుడే క్రాస్ చేసుకొనిపోతున్నాడు ఆదాయవృద్ధేకాని తగ్గిన సూచనలుకాని, తగ్గే సూచనలుకాని సమీప భవిష్యత్తులోలేవు. మతపరమైన మౌఢ్యానికిది నిదర్శనమని కొందరంటూ ఉంటారు ధార్మిక చింతన ఎక్కువవుతోందని విశ్వవ్యాప్తంగా మానవ జీవితంలో భద్రత లోపించడంవల్ల శాంతికాముకత పెరుగుతోందని, అందుకు నిదర్శనం కోట్ల సంఖ్యలో వచ్చే దేశ విదేశాల యాత్రికులేనని కొందరంటారు నాస్తికులైనా ఆస్తికులైనా మానవసేవలో మాధవసేవను







దర్శిస్తారనేది నిర్వివాదమైన అంశం. దేవస్థానం రాబడి ఎన్నో మానవ హితైష కార్యక్రమాల కోసమే వినియోగించబడుతోంది. మూఢ నమ్మకమని, బ్లాక్‌మనీని తొలగించే మార్గం వేంకటేశ్వరుని హుండీ అని కొందరు వాదులాడినా, ఆ డబ్బంతా మానవసేవకే ఉపయోగపడుతోందికదా! హాని చేయనంతవరకు ఏ నమ్మకాన్నైనా మూఢనమ్మకమని అనవచ్చునా అనేది సందేహం. ఏదీ ఏమైనా కోట్లాది యాత్రికులు బారులు తీర్చి, నిద్రాహారాలు మాని భువనమోహనుడు, భూరమాదయితుడు అని శ్రీనివాసుని దర్శనంకోసం ఆత్రులు చూస్తూ నిలబడిఉంటే అదొక బొమ్మ అని, అంతా పిచ్చితనమని అనుకొనేవాళ్లని చూస్తూ ఉంటే తమాషాగా ఉంటుంది.

తిరుమల భూలోక వైకుంఠం. బహు పునీతమైన శేషాచలం సుందరనందనోద్యానవనంలా భాసిస్తుంది. శంకుమిట్ట ప్రాంతం, అతిథిగృహం, నరనారాయణుల శిలావిగ్రహం, గోగర్భంవద్ద ఉండే పూలవనం, నడుమన నయ్యాటలాడే రాధాకృష్ణులు, పాపవాశనం, ఆకాశగంగ, భూవరాహస్వామి ఆలయం మరచిపోనివి. ఇక శ్రీవారి వైభవం చెప్పనలవికానిది. కర్పూర జ్యోతుల ధగద్ధగలతో, చిత్ర విచిత్ర సుమదళాలతో, అపూర్వ చందన జలకమ్ములలో అపురూపంగా ప్రతిక్షణం పూజలందుకొనే స్వామి అందరి హృదయాలలో చిరస్మరణీయంగా నిలిచిపోతాడు. దైవదర్శనానికి అందరూ అర్హులే. కులమత వర్గ వివక్షల ప్రసక్తేలేదు. గుణశీల



సౌందర్యమే ప్రధానము. తలనీలాలు మొదలుకొని ఒంటిమీది పోగులవరకు సర్వం నిలువుదోపిడీ ఇచ్చుకోవలసిందే. జనన మరణాల మధ్యనున్న స్వల్పకాలిక జీవన వ్యవధిలో మానవలక్ష్యమేమిటో తెలుసుకోవడానికి ఇదొక చక్కటి అవకాశం. కాలినడకని వచ్చినా, సెలయేటి ఉరకలా పరిగెత్తి వచ్చినా ఇది నగ్నసత్యం!!

తిరుపతిలో లేని విద్యలేదు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం ప్రసక్తిని విడమరచి చెప్పనక్కరలేదు. మహిళా విశ్వవిద్యాలయం, సంస్కృత విద్యాపీఠం, వైద్యకళాశాల, పశువైద్య కళాశాల, వ్యవసాయ కళాశాల, న్యాయ కళాశాల, సాంకేతిక శాస్త్రాల విద్యా సంస్థలు, వేద పాఠశాలలు, ధార్మిక సంస్థలు — ఒక్కటనేమిటి సకలకళామతల్లి సరస్వతీదేవి విశ్వస్వరూపమే తిరుపతి అని చెప్పవచ్చు. పరిశోధనల్లో కాకలు తీరిన మేధావులున్నారు. సాహితీ కోవిదులున్నారు. కళాస్రష్టలున్నారు. కవికంఠీరవులున్నారు. సంగీతనృత్య కళామూర్తులున్నారు. అలా తిరుపతి కడుంగడు పవిత్రమైనది. భారతీ నిలయమది.

శ్రీ కోదండరామస్వామి ఆలయము, గోవిందరాజు గుడి, కపిలతీర్థం, తిరుచానూరు పద్మావతీ దేవస్థానం, మంగాపురం శ్రీనివాసుడు, శ్రీవారి మెట్టు, నాగలాపురం వేంకటేశ్వరస్వామి తిరుపతి పరిసరాలలో దర్శించదగ్గ దివ్యక్షేత్రాలు. యాత్రికుల సౌకర్యార్థం తిరుమల తిరుపతి దేవస్థానం ఎన్నో పథకాలను అమలులో పెడుతున్నది. యాత్రికులు ఏ మాత్రం బాధపడకూడదన్న పవిత్రమైన ఆశయంతో దేవస్థానం అహోరాత్రులు ఎంతగానో శ్రమిస్తోంది. అయినా లక్షలాది భక్తులు వస్తూ ఉండడంవల్ల ఏదో కొంత, ఎక్కడో కొంత కొఱత ఉంటూనే ఉంది. పరస్పర అవగాహనతో, సంఘీభావంతో సమస్యలను పెంచుకోకుండా, ఎవరికివారే వారి

భూలోక స్వర్గం
శేషాచలం



వారి పరిధుల్లో పరిష్కరించుకొంటే ఏ ఇబ్బందీ ఉండదు. ఏ విధమైన అభియోగాలకు అవకాశమివ్వకుండా చూచుకొనవలసిన బృహత్తరమైన బాధ్యత దేవస్థానంవారికి ఉందన్న సంగతిని వారు విస్మరించరాదు.

తిరుపతి విద్యా కేంద్రంగా, యాత్రా స్థలంగా మాత్రమే పరిమితంకాలేదు. అదొక వ్యాపారకేంద్రం. ఎన్నో పరిశ్రమలు వెలిసాయి. పత్రికాసంస్థలు పుంజకొంటున్నాయి. ప్రసిద్ధి పొందిన మోపెడ్స్ లిమిటెడ్ సంస్థ తిరుపతిలోనే ఉంది. అత్యంత అధునాతనమైన బస్‌స్టేషన్ ఇటీవలే రూపొందినది. లక్షల ఖర్చుతో రైల్వే స్టేషన్ విస్తరించబడినది. విమానకేంద్రం ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే తిరువతి నుంచి ప్రపంచం నలుమూలలకు రహదారి సౌకర్యాలున్నాయి. ఆకాశవాణీని ఏర్పరచాలని అనుకొంటున్నారు. టెలివిజన్ సెంటర్ ఏర్పడనుంది. త్వరలోనే తిరుపతిని బాలాజీ జిల్లాకు రాజధానీ నగరం చేయాలన్న ఆలోచనకు ఒక రూపం రానున్నది.

తిరుపతికి ఆదాయం కొరతలేదు. ఏటా ఎన్నో ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి. ఎందరో రాజకీయ నాయకులు, దేశ విదేశాల ప్రముఖులు వస్తూ పోతూంటారు. ఎన్నో రకాల అంశాల మీద సదస్సులు, సభలు, సమావేశాలు జరుగుతూనే వుంటాయి. ఈ కారణాల వల్ల తిరుపతి జనసాంద్రత రోజు రోజుకు వేగంగా పెరిగిపోతోంది. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని ఇప్పటినుండే ఎన్నో విధాల కార్యక్రమాలు అధికార అనధికార బృందాలు, స్వచ్ఛందసంస్థలు ప్రభుత్వ సంస్థలు చేపడుతున్నాయి. తిరుపతి ప్రజలే కాదు, ప్రపంచ వ్యాప్తంగా ప్రజలందరూ తిరుపతి బాగుకోసం శ్రమించాలి. తిరుపతి మన జాతీయ సంపద. హిందూమత వారసత్వానికి సజీవ ప్రతిబింబం. దాన్ని కాపాడుకొనవలసిన అవసరం మనందరికీ ఉన్నది;

ఇలా రాస్తూపోతే తిరుపతి గురించి ఎంతైనా రాయవచ్చును. ఒక విషయం చెప్పి ముగిస్తే ఇక బాగుంటుంది; ఉత్సవాలనిర్వహణలో ఉత్సవమూర్తుల అలంకరణ విధానంలో మంత్రోచ్చారణ పద్ధతిలో, వేదపఠనం, భక్తిగీతాలాపనలో, ధార్మిక ప్రసంగంలో, హరికథాతీరులో, భజనలో, సంకీర్తనలో మనవారికి ప్రత్యేకమైన కళాస్పందన 'ఉన్నట్లు కానవస్తుంది. ప్రపంచంలోని ఏ ఇతర దేశాల వారికీ లేనంతటి కళా పరిపక్వత మనవారికుందేమో అనిపిస్తుంది. ఈ కళ మన జాతిది. తరతరాల మన సంస్కృతి మనకిచ్చిన మానవ వరప్రసాదం. దాన్ని పదిలంగా తరువాతి తరాలకు అందించడం మన విధి, బాధ్యత కాదంటారా ? ★

**—డాక్టర్ గుమ్మమూరు రమేష్‌బాబు**

# ఆల్విన్

## స్టీల్ బీరువాలు మళ్ళీవచ్చాయి.

## ఇక మీరు నిశ్చింతగా నిద్రపోవచ్చు.



గాఢనిద్రకు నోచుకోని రోజులు గతానికి చెందినవి. మీ చింతలను చెంతకు రానీయక పారద్రోలడానికి ఆల్విన్ వుంది. ఇంతకాలానికి, మీ ప్రియమైన వస్తువులని, విలువైన వాటిని దాచుకొనడానికి మీకొక 'కోట'.

అందంగా రూపొందించిన ఆల్విన్ స్టీల్ బీరువాలు దృఢంగానే కాక నాజూకుగానూ వుంటాయి. మందమైన స్టీల్ రేకులు అతి దగ్గరగా చేర్చబడి పురుగులు దొరబడకుండా, దుమ్ముదూరకుండా. భద్రత లోపించకుండా నిర్మించబడ్డాయి. మారు తాళాలకి రాకుండా లాకింగ్ ఏర్పాట్లు చెయబడ్డాయి.

ఆల్విన్ స్టీల్ బీరువాలలో మీ విలువైన వస్తువులని భద్రపరచండి. నిర్భయంగా నిద్రించండి

హైద్రాబాద్ ఆల్విన్ లిమిటెడ్
సనత్ నగర్ హైద్రాబాద్ 500 018

**ALLWYN**

మీ జీవితంలోకి ఆధునిక జీవనాన్ని ఆహ్వానించండి

SAA/HAL/2455 Tel

# ఎవరి దారి వారిది

పూర్తి నవల



బలివాడ కాంతారావు

## ఇదేదో వార్త కాదు - భూమి కంపించేముందు చేసే దొర్లెడు శబ్దం.

**"ఈ వూరు పచ్చగా వుండాలన్నా, యీ వూర్లో శుభ్రమైన గాలి పీల్చాలన్నా, యీ వూర్లో యెవరి హద్దుల్లో వాళ్లు మెసలి అందరూ హాయిగా బతకాలన్నా... యిలా జరగడానికి వీల్లేదు.**

**వద్దు.... వద్దు.... మీ భూముల్లో ఒక్క సెంటు వాడికి అమ్మకండి...."**

ఇలా పొట్టిగాలేని పొట్టినాయుడు పదుగుర్లో "నాయుడు బాబ"ని చెలామణి అవుతున్నవాడు సాయంత్రం వరకూ అరుస్తునేవున్నాడు

"వాడెవడో – వాడి వూరేమిటి? పేరేమిటి? వాడి తాత ముత్తాతలెవరు? వాడు యీ వూర్లో యింత మదుపు పెట్టడానికి డబ్బెలా వచ్చింది? డబ్బు వేషాలేసి గడించాడా? వెర్రిగా దోచాడా? ఆ విషం డబ్బుతో వీడు యీ వూర్లో విత్తనం వేస్తానంటున్నాడు. ఈ విత్తనం వేసి పొత్తు కుదుర్చుకోడానికి చూస్తున్నాడు. దాంతో పెత్తనం చెలాయిస్తాడు. తప్పదు. విషంలో పుట్టిన పురుగుకు విషమే ఆహారమన్న సామెత వీళ్లు మరచినట్లుంది."

రాత్రి రెండు ఝాములైనా యిలాంటి తలపులలో నాయుడుబాబుకు నిద్దర రాలేదు. తేలిపోయిన గుడ్లకు అంతా చెడు దృశ్యాలే కనిపిస్తున్నాయ్. మండిపోతున్న మనసుకు వీళ్లు మేలు మేలన్న మాటలు మెడ విరిచిన మాటల్లానే తోచాయి. "నా జాగా ఆయువుపట్టు. ఈ జాగా లేకండా వాడెలా ఆ ఫేక్టరీ కట్టించగలడు? ఈనాటికి ముక్కూ ముఖం వూరూ పేరూ తెలియని వాడెవడో వీళ్ల అక్కరకు వచ్చి అయిన వాడయ్యాడని మురిసిపోతున్నారు—పోనీ మురిసి పోనీ—ఊరంతా యేకంకానీ—నేను నా భూమిలో సూది మోపినంత జాగాయివ్వను. ఇవ్వనంటే యివ్వను. వీళ్ళంతా నా మాటకు వీసమంత విలువ యివ్వటంలేదు. నన్నో కోతినిచేసి ఆడిస్తున్నారు. మీరంతా గెంతులేసి వహ్వావ్వా అని అరవండిరా—అలా అరుస్తుండండి. ఒక్కసారి హనుమంతునిలా మీ మీద వురకపోతే నేను...నేను..." చివరిమాటలు బయటకు వచ్చేసాయి.

ఈ ఆలోచనలతో కొత్త బలాన్ని పుంజుకున్నాడు నాయుడు. "చలికాలంలో చంటివానిలా ఎండకాలంలో యెదిగిన వాడిలా వున్న అగ్నిలాంటి పవిత్రత మా కుటుంబానిది. గువ్వల్లా వూర్లో యెగిరాంగానీ గుడ్లగూబల్లా యెవర్నీ భయపెట్టలేదు. ఈ యింటినీ, యింటి చుట్టూ వున్న జాగాను వదిలేసి, నా వంశాన్ని బలిమిని బుగ్గి చెయ్యనని" భీష్మించుకున్నాడు.

పట్టిన నిద్దర కలత నిద్దరే ఇంతకల్లోలమైన రాత్రి భార్య గతించిన్నాడు తప్ప, యిదివరకెప్పుడూ గడపలేదు. ఈ నిద్దర సరిగ్గా లేకపోవటంతో కొడుకు నరసింహం గురించి కొత్త విషయం తెలుసుకున్నాడు. కొడుకుది కుంభకర్ణుని నిద్దరనుకున్నాడే గానీ, వీడు యింటికప్పు యెగిరిపోయేటట్లు మంచి రాత్రి మీద గుర్రుపెట్తాడని యీ రాత్రే తెలుసుకున్నాడు. ఇదొక కొత్త అలవాటా? కొత్త జబ్బా? ఆలస్యంగా కళ్ళు మూసినా మామ్మూలుగా తొలికోడి కూసినప్పటికే తెలివి వచ్చింది, జానెడు చుట్ట వెలిగించి యేటి వేపు వెళ్లాడు. భళ్లున తెల్లవారేసరికి తూరుపు ఆకాశంలో వెల్లుల్లి రేకుల్లాంటి మేఘాలు కదులుతున్నాయి. మునిగిన నీటిలో మల్లెవాసచలు. నీలి ఆకాశం నీటిలా నిశ్చలంగా వుండి దానిపై నిప్పురాజిన మంటలా, పొద్దు కనిపించింది. చేతులెత్తి దండమెట్టి "నన్ను దండించకు దేముడా" అని మొక్కి యింటికొచ్చాడు నాయుడు.

కంచుగ్లాసు నింపుగా ఆవుపాలు గడగడా తాగేసి యెదరగా సాలలో వున్న యెడ్ల జత దగ్గరకు వెళ్లాడు. ఒక గిత్త యింట్లోనే పుట్టింది. శ్రమపడి వెతగ్గా వెతగ్గా దానికి తగిన జత కుదిరింది. బురద బుక్కి బురదకక్కి పండించే రైతు బ్రతుకే శ్రమ! శ్రమపడి కూర్చుకున్న హంగులు – ఈ ఆవులు, గిత్తలు, చెట్లూ చేమా – గాలీ నీరూ – ఇవన్నిటిమీద కితగాడెవడో యెందుకు దాడి చెయ్యాలా? పగడంచు పచ్చకోక కట్టి, పట్టెడందంతో తిలకం దీర్చుకున్న చిలక పలుకుల కలికి రుక్మిణిలా వున్న యీ ప్రకృతికి...ఏం జరగబోతోంది? ఈ పచ్చని చెట్లు కొట్టేసి – సిమ్మెంటు గోడల మధ్య నిత్యం కప్పల మేళంలా డబడబ లాడే మిషన్లు – ఈ రుక్మిణీ దేవిని నడివీధికీడ్చి నగ్నంచేసి అనుభవించినట్లు కాదూ .. ఛాఛా .. ఇది యెంత మాత్రం జరగడానికి వీల్లేదు.

ఇలా యింకోసారి భీష్మించుకునే సరికి యింటిముందు వెంకటరెడ్డి ప్రత్యక్షం. ఊరికి యిద్దరూ పెద్దలే అనుకుంటారు. ఇద్దరికీ బొద్దు

మీసాలున్నాయ్. నాయుడు మీసాలు పూర్తిగా పండిపోయాయ్. రెడ్డి మీసాలు సగం పండాయి. కాని మాటను అయిన మాటగా చెలామణి చేస్తాడని రెడ్డి మాటకు యిదివరకు విలువ వుండేది కాదు. అతగాడు గ్రామ పంచాయితీ ప్రెసిడెంట్ అయినా వూర్లో కష్టం సుఖం చెప్పుకోడానికి ప్రజలు హెచ్చుమంది నాయుడు దగ్గరకే వస్తారు

ఉదయమే వీడిక్కడ కచేరీ పెట్టడానికొచ్చాడని తెలుసుకున్నాడు నాయుడు. కూర్చోబెట్టకుండా పంపించేద్దామంటే వాడే వరండాలో బల్ల మీద కూర్చుంటూ –

"ఏంటీ నాటకం అన్నావట ? ఇది నాటకం కాదు నాయుడూ – ఇది నిజం. ఎవడో ఈ వూర్లో అదృష్టజాతకుడు పుట్టాడు. వాడి మూలాన వూరంతటికీ మేలు చెయ్యడానికి ఆ బాబు వెతుక్కొని వచ్చాడు. కాదనకు."

"రెడ్డి ! నువ్వు బానిసగా బతుకుతానంటే నేనొద్దన్నానురా ! నువ్వు తలపాగా తీసేసి ఆడికి బుర్ర అందించావు. తల గొరిగినా గొరుగుతాడు. పీక తీసినా తీస్తాడు. ఆడు ముందుకేం సేస్తాడో నువ్వు యిప్పుడు సెప్పగలవా ?"

"ఊర్లో యింతమంది సదువుకున్న కుర్రాళ్లు. అటు వ్యవసాయానికా పనికిరారు. అందరికీ ఉద్యోగంలో యేస్తామంటున్నాడు అలాంటి ఉపకారం సేస్తున్న మనిషిమీద యాదార్థమైన మాట ఆడు."

"మవ్వెందుకు ఆడి పంచన చేరావో నాకు తెలీదనుకున్నావురా ? పిల్లికి సీకటైతే జగానికి సీకట్రా ? డింకీలు కొట్టి బియ్యే అఘించిన కోతి నీ కొడుకు – ఆ జగన్మోహనరెడ్డి – వాడి వుద్యోగం కోసం వూరినే అమ్మజూస్తున్నావు."

"నీకు అర్థం అయ్యింది అంతే. నీ ఉపకారం చూసుకుంటున్నావుగానీ – వూరి వుపకారం గురించి ఆలోసించలేదు."

"ఆ వచ్చినోడి వూరూ పేరూ నీకు సరిగ్గా తెలుసునురా ? ఆడు వ్యాపారస్తుడురా ! దొంగ మాటలు, దొంగ వ్యాపారం, దొంగ డబ్బు లేకండా పెద్దోడు కాలేడురా ! ఈ వూరికి నువ్వు శకునిలా దాపరించావు."

"ఓష్ ! నువ్వే ధర్మరాజువిలే "

"నాకేం అంత్తోరి డబ్బు కలవలేదు. తలచెడిన చెల్లెలు ఆస్తి కూడిపోలేదు. ఇలా నా కన్నా నువ్వెదిగిపోయి ప్రెసిడెంటువైనా – వూర్లో మూలనున్న ముసలమ్మనడుగురా – మా వంశం ఏమిటో తెలుస్తాది."

"సచ్చిన తాత ముత్తాల వూసెలగానీ – సూడు – నాతో ఒక్క మాటే ! ఆ జీవరావు బాబు నిజంగా జీవంపోసిన బాబు. మంచి బాబు కాబట్టే మనల్ని బతిమాలుతున్నాడు."

"ఎందుకు బతిమాలుతున్నాడు ? ఎకరానికి యీనాడు మీకు మూడువేలిస్తున్నాడా ? వచ్చే యేడాది యీనాటికి యీ యెకరం విలువ యెంతవుంటాదో ఆలోసించినావా ?"

"అచ్చ అనుకో ! ఈ బాబు రాకపోతే యీ భూమికి వెయ్య రూపాయలైనా యిచ్చినోడున్నాడా ? ఏటో యెగిరిపోతున్నావుగానీ – ఆ బాబు తల్చుకుంటే యేమైనా సెయ్యగలడు "

"ఏంటిరా ఆమాట ? ఆడింటిమీద నేను పడ్డానురా – వాడు నా యింటిమీద పడ్డానికి ? నా బతుకు చిందరవందర సెయ్యడానికి వాడికేం హక్కు వుందిరా ?"

"పెజలకు మంచిచేస్తామని ముందుకొచ్చి జీవనబాబు పెజలపక్కన వున్నాడు. గవర్నమెంటు యిచ్చిం దరిరేటు పాతరేటు వుమ్మకోవాలని రానుంది కావాలనీకు".

"ఒరే రెడ్డి ! అసందర్భంగా వాగకురా ! ఒక కోర్టు కాదురా –



మూడు కోర్టులు తిప్పిస్తానురా ! నా శవంమీద నడిచే నాజాగా తీసుకుంటాడురా ! చచ్చినా వూరుకోనురా — దెయ్యమై పీడిస్తానురా !''

''నాయుడూ ! నివ్వు యదార్థం సూడటంనేదు.''

''ఒరే రెడ్డి ! నా యదార్థం నాదిరా ! అదే నా డబ్బురా ! ఆ డబ్బే వెన్నెల వెలుగురా.''

''ఆ వెలుగులో కనిపించింది సూడకు. దాగిన యదార్థం సూడు. సూడ్డానికి ప్రయత్నించు. ఆ బాబు చేస్తున్నపని ఒక పువ్వుగా కనిపిస్తాది...''

''నీ భట్రాజు పలుకులు నాకేలరా ? సూదిమొన మోపినజాగాయైనా యివ్వను.''

''ఏంటా మాట ? ఆలనాడు దుర్యోధనుడిలా పలుకుతున్నావ్.''

''ఒరే ! నేను ఆడిలా మోసంతో దోచుకోలేదురా ! నివ్వు దోచుకున్నావు. నివ్వు యెవడివెంట యిప్పుడు పడ్డావో వాడికీ నీగాలే సోకింది — యెళ్లు యెళ్లు — ఇంటికొచ్చావని యీమాత్రం మార్యాదిచ్చాను వీధిలో యీమాటే అంటే మునకాల కర్ర లేచిపోను.''

రెడ్డి ఛర్రున లేచిపోతూ,

''ఇలా మొండిపట్టు పట్టు — ఏదీ ఆగిపోదు. నీకు మిగిలింది చెడ్డపేరే...''

''పో పోరా...''

## 2

ఎక్కడ యే మాటొస్తుందో యెవరే తగువుతెస్తారోనని నాయుడు వూర్లోకి వెళ్లటం తగ్గించేసాడు. ఊరిలోనికి వెళ్లకపోయినా వూర్లో వార్తలన్నీ మోసుకొచ్చే వార్తాహరుడున్నాడుగా ! దాలిగాడు పేదవాడైనా వాడి మాటలకు పేదరికంలేదు. వూసగ్గుచ్చినట్లు, యింపైన పాటలా సొంపుగా ఏ విషయమైనా చెప్తాడు. వాడికున్న ఆస్తి ఒక కూతురు—ఒక కొడుకు.

''బాబూ ! రెడ్డి ఆ పెసిడెంటుగిరీ వలిసిందని నీమీద నిప్పులు కక్కుతున్నాడు. రెడ్డి సంగతెవడికి తెలీదు ! ఈనాడు నిప్పులా వున్నోడు రేపు నీరులా మారిపోతాడు. నీలాంటి నెమలిపిట్టని సూసి ఆనక్క గెంతితే సరా ! పెద్దమనిషి పెద్దమనిషే—పేడకుప్ప పేడకుప్పే.''

''ఇంతకీ యేమంటున్నాడురా ?''

''నేను పెసిడెంటునా ? నాయుడు పెసిడెంటా ? ఈ వూర్లో నా మాట సెల్లుతాదా ? ఆడిమాట సెల్లుతాదా ? ఆ జీవనబాబు నా గుమ్మానికి రోజుకు నాలుగుసార్లెగబడతాడుగానీ—ఛీ నాయుడు ముకం సూస్తాడా ? అని మీసాలు నులుపుతున్నాడు బాబో.''

''వాడు తక్కువ వాడురా. అందుకే ఆ నిక్కులు నీలుగుతున్నాడు. ముక్కూముకం యెరగనివాడిని సులభంగా వూరికి తగిలించాడు. ఆడిని వదిలించుకోవటం అంత సులువుకాదు. ఆడు నా గుమ్మం యెక్కకపోతే నాకేం నష్టం.''

ఈ మాటలు పొద్దున్నే పడ్డాయి. ఇంకా యెదిగిన యెండ చల్లారకుండానే నాయుడు యింటికి కాస్త దూరంగా కారు ఆగింది. తెల్లని కారు! జిగజిగ మెరుస్తున్న కారు ! కొత్తకారు. ఈ దేశంలో తయారయిన కారు కాదు. అందులోనుండి దిగి నడుస్తూ వస్తున్న మనుషులు యీ వూరు మనుషులుకారు. ఈ చుట్టు పట్ల యిలాంటి మనుషులు లేరు. ఇద్దరికీ తెల్లని దుస్తులమీద మోజు వున్నట్లుంది. అతని వయసు పోల్చుకో వచ్చుగానీ ఆవిడ వయసు పోల్చుకోవటం కష్టం.

దాలిగాడి వార్తని కాదని, రెడ్డిగాడి గర్వాన్ని కాలదన్ని వచ్చినవాడిని నాయుడు స్వాగతం పలికాడు. వరండాలోనే కూర్చోబెట్టాడు.

''ఇంతవరకు మనం మనం కలుసుకోలేదు. అంతా మధ్యవర్తుల ద్వారానే జరిగింది'' అన్నాడు జీవనరావు కూర్చుంటూ.

''ఎవరి ద్వారా జరిగినా మీది జరగని మాట !''

''జరిపించుకోవాలని వచ్చాను'' అన్నాడు నవ్వుతూనే జీవనబాబు.

''మా తరతరాల నించి అద్దంలా వుందీ వూరు ! మీరు దేశమంతా వదిలేసి యీ అద్దంలో నీడ కెందుకు యెగబడుతున్నారు ?''

''ఎన్నెన్నో అద్దాల్లో ముఖం చూసుకున్నాను. కానీ నా అసలు ముఖం యీ వూరి అద్దంలోనే సరిగ్గా కనపడింది.''

''మాది డెబ్బై ఏళ్ల అనుభవం. మీది ఒకరోజు ఆర్భాటం.''

''అసలు సంగతి చెప్పనియ్యండి. నేను ఫ్యాక్టరీ పెట్టానంటే వూరకనే భూమి, అక్కువ ధరకి నీరూ, కరెంటు యిస్తామని పరుగెత్తుకొచ్చే వాళ్ళున్నారు. కానీ యీ వూరి మనుషులమీద నాకు గొప్ప గౌరవం. ఈ వూరికేదో వుపకారం చేద్దామనే వుద్దేశంతో ... ''

''మంచిదే ! చెయ్యండి. ఎవరొద్దన్నారు ? కానీ యెవరి ఆశలు వాళ్లకుంటాయని మర్చిపోకండి.''

''అందుకే యీ వూర్లో ఒక్కొక్క కుటుంబం నించీ ఒక్కొక్క మనిషికి ఉద్యోగంలో వేస్తానన్నాను. అలా చెయ్యాలంటే యిప్పటికి దొరికిన భూమి చాలదు. మీరు జాగా యిస్తేనే ఫేక్టరీ పెద్దదవుతుంది. ఉత్పత్తి పెరుగుతుంది !''

''మీరు చేసే పనివల్ల జరిగే కీడు ఆలోచించనట్లుంది''

''కీడు జరుగుతుందని మీరొక్కరే అన్నారు''

''లేవండి'' అన్నాడు నాయుడు.

''చూడండి యీ యిల్లు. ఈ యింటిని యీ వూరి బయట మాతాత కట్టించాడు. చూడండి ఆ గోడలు — మూడడుగుల గోడలు మట్టిగోడలని మూతి విరిచేయకండి. ముప్పయి గాలివానలకు చెక్కుచెదరలేదు. పైన సరంబీ చూసారా? ఎక్కడైనా యింత చెద చేరిందా? ప్రతి పలకమీద ఆ తరిణి బుచ్చెన్న చెక్కిన చిలుకు చూడండి ఈ యింటి సంగతి మీకు తెలీదు. ఇందులో మొసలి యిందులోనే దేహాలు చాలించిన








## వారి పురాణ గ్రంథాలు

## శ్రీదేవీభాగవతం

—శ్రీ అయినంపూడి గురునాథరావు

డెమ్మీ సైజులో **662** పేజీలు

**3** సంపుటాలు సెట్టు వెల: రూ. **45/-**

## ఎమెస్కో వచనరామాయణం

—శతావధాని కోట వీరాంజనేయశర్మ

క్రౌన్ సైజులో **1848** పేజీలు

**13** సంపుటాలు సెట్టువెల: రూ. **67/-**

వీటికోసం మీ దగ్గరలో వున్న పుస్తక విక్రేతను అడగండి! లేకుంటే తెప్పించి పెట్టమనండి. వీలుకాదంటే- మీకు కావలసిన గ్రంథాల మొత్తం ఖరీదులో 1 రూపాయి తగ్గించి M.O చేయండి. ఆ 1 రూపాయికి వి.పి. పెట్టి గ్రంథాలు పంపుతాము

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్**

3237, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాద్-500005

# జూలూరి

వివాహాది
శుభకార్యములకు
కావలసిన
పట్టు,మరియు
కాటన్ చీరెలకు
ప్రత్యేక కేంద్రం




జూలూరి -
పట్టు చీరలకు
పెట్టింది పేరు!

**జూలూరి వీరేశలింగం బనారస్ సిల్క్ ప్యాలెస్**

జూలూరి మాన్షన్ జనరల్ బజార్ సికింద్రాబాద్ ఫోన్ 76545-72333

'ఉగాది' శుభ సందర్భంగా మా అభిమాన రాయలసీమ ప్రజానీకమునకు
తెనుగు నూతనవత్సర శుభాకాంక్షలు.

ఈ శుభసందర్భంగా కెనెటిక్ ఇ జనేరిక్‌వారిచే తయారు చేయబడిన

'లూనా టి యఫ్.ఆర్. ప్లస్ మరియు 'స్పార్క్ సిటీ షటల్' (మినీ మోటార్ సైకిల్) యొక్క సంపూర్ణ వివరములు తెలిసికొనుటకు మీ సమీపములో వుంటున్న మా బ్రాంచీలను సంప్రదించి మీరు కోరిన వాహనములను పొందకోరుచున్నాము.

ఇట్లు,

# శ్రీ దుర్గా ట్రాక్టర్ వర్క్స్

అలమాస్ పేట, కడప-**516001**

బ్రాంచీ ఆఫీసులు

1. కృష్ణా మ్యాన్షన్స్, బేరీ స్ట్రీట్, తిరుపతి
2. రామకృష్ణాకాంప్లెక్స్, నాయుడు బిల్డింగ్స్, చిత్తూరు.
3. రైల్వే ఫీడర్స్ రోడ్, కల్పనా కాంప్లెక్స్, అనంతపురం
4. దుర్గా కాంప్లెక్స్, గుత్తి రోడ్, అనంతపురం
5. పార్క్ రోడ్, కర్నూలు.



మా తాతా – తండ్రీ యేలుబడి చేసి ఒకరి సొత్తు వేసుకోలేదు. ఒకర్ని నొప్పించలేదు. ఏది పోయినా పోనీ మా పూర్వులు మెసలి పేరు ప్రతిష్ఠలు గడించిన యీ పవిత్రమైన జాగాని మాత్రం వదిలేదిలేదు.''

''ఇంతకన్నా విలువైనదీ యింకోచోట కట్టించి యిస్తాను. మీరు పవిత్రమనుకున్న యీ జాగాలోని భాగాలు కొత్త ప్రదేశానికి తరలించవచ్చు. నాగార్జున కొండ నిక్షేపాలే డామ్‌కోసం తరలించినప్పుడు, మీ చెక్కిన చిలుకు తరలిస్తే తప్పులేదు''.

''నన్ను యెందుకు యిందులో ముంచుతావు బాబూ? నేను నీకేం అపకారం చేసాను చెప్పు ?'' అన్నాడు సూటిగా నాయుడు.

''ఉపకారానికి అపకారానికి అర్థాలు మారిపోతున్నాయి నాయుడు గారూ! మీ మనుమడి యింటరు పోయిందటగా! మంచి వుద్యోగంలో వెయ్యిస్తాను. మీరు కోరిన రేటు యీ జాగా కిస్తాను–కాదనకండి.''

''ఇంత అలజడి నేనెప్పుడూ యెరగను. అలజడితో అట్టుడికిన అగ్గితో మీ మీద పడేవాడ్నే. కాని మీరు నాగుమ్మానికి వచ్చారు. అందులో ఆడకూతురుతో వచ్చారు. ఇంత వయసొచ్చినా యిలాగ గట్టిగా వున్నానంటే యీ జాగా, ఈ నీరు. ఈ గాలే! ఈ వూరు పచ్చదనం. ఈ వూరి మనుషుల్లో ఓర్పు, తృప్తి. ఇప్పుడు ఈ ఫేక్టరీ పెడ్తే వద్దన్నా విషగాలులు వస్తాయి. దురాశతో దొంగలైపోతారీ ప్రజ! అంచేత నాదొక మనవి వుంది. వింటానంటే చెప్తాను.''

''చెప్పండి''

''ఎన్నోచోట్ల ఆ విషగాలులు అప్పుడే వీస్తున్నాయ్. తమకు తామే దొంగలై తమ కుటుంబాలకీ, యిరుగు పొరుగుకీ, వీధిలోని వాళ్ళకీ, పూర్వోవాళ్ళకీ దొంగలైపోయిన మనుషులున్న జాగాలెన్నో వున్నయ్. ఈ ఫేక్టరీ దయచేసి అక్కడ పెట్టుకోమని తమతో మనవి చేసుకుంటున్నాను''

''మీ అబ్బాయి లేడా ?'' అంది చప్పున జీవనరావు భార్య స్నేహలత

''అమ్మా! ఉన్నాడు. వాడు అపురూపంగా ఈ జాగాలో పెరిగాడు. అందుకే వాడికి చింతలేదు. పగలూ నిద్దురపోతాడు. నిద్దరపోతే లేపడం కష్టం.''

''పోనీ మీ మనుమడి వుద్దేశమైనా కనుక్కున్నారా ?''

నాయుడికి యీ ప్రశ్న నచ్చినట్లు తలవూపాడు. తన నిజాయితీని యెవరో శంకిస్తే యెంత కోపం వస్తుందో అంతకోపం వచ్చినా మౌనంతో ముఖం చీదరించుకున్నాడు.

ఇంతలో మనుమడు రాజారావు చేతిలో కాఫీ కప్పులతో ప్రత్యక్షం. కోపం ఒక్కసారి విజృంభించింది.

''మన మర్యాద కాఫీరా ? కంచుగ్లాసులో గ్లాసుడు ఆవుపాలురా ? ఎక్కడనించి తెచ్చావురా యీ కాఫీ ?''

''రోడ్డుమీద కాఫీ హోటల్లోనించి.''

''పెద్ద వాళ్ళొచ్చారని మన బుద్ధులు మార్చుకుంటావురా? నీ అమ్మకు బుద్ధిలేకపోతే నీకు లేదురా...'' అంటూ అటు తిరిగి ''బాబూ! బాగా మరిగిన పాలు. ఆవుపాలు. స్వచ్ఛమైన పాలు. అది తాగండి. ఒంటికి మంచిది. అదేమిటి అలా చూస్తున్నారు. వాడు మా మనుమడండీ. నాకు ఒక్కడే కొడుకు. ఆ ఒక్క కొడుక్కీ వీడొక్కడే సంతానం. మా వంశంలో ఒక్కొక్కడే. ఒక్కడయినా వంశ మర్యాదను నిలిపిన వాళ్ళే...''

''మీ తాతల గురించీ తండ్రుల గురించీ తెలీదుగానీ–మీ మనుమడి గురించి మాత్రం తెలుసు. మీరన్నది పూర్తి నిజం.''

''అప్పుడే కలిసారా ?''

''హాఁ''

''ఏంరా? నాకు చెప్పలేదేంరా ?''

మనుమడు యింకా అలా చూస్తుంటే జీవనరావు రాజారావు భుజం మీద చెయ్యివేసి

''గుర్తుందా ? నెలరోజుల క్రితం – రాత్రి మీద నా కారు ఆగిపోతే ..''

''మీరేనా? పోల్చుకోలేకపోయాను''

''అవును. నేనే అప్పుడు సఫారీ సూట్‌లో వున్నాను. నాయుడు గారూ–అసలు యీ వూర్లో ఫేక్టరీ పెట్టి యిలాంటి చదువుకున్న కుర్రాళ్ళి ఉద్యోగాలివ్వాలన్న ఆలోచన ఆ రాత్రి కలిగించింది మీ మనుమడే...''

''ఏంరా? నాతో యెందుకు చెప్పలేదురా?''

''జరిగింది నేను చెప్తాను వినండి. ఫేక్టరీ పెడ్దామని నేను మా ఆవిడ, మా పెద్ద అమ్మాయి స్థలంకోసం తిరుగుతూ యిలాగే వెళ్ళి



పోయాం. జిల్లా చివరివరకూ వెళ్ళి యెక్కడెక్కడో చూసి తిరిగి వస్తుంటే చాలా రాత్రయిపోయింది. మీ వూరు పొరుగూరికీ మధ్యలో కారు ఆగిపోయింది చీకటి రాత్రి. జనసంచారం లేదు. ఇంతలో ఒక పదిమంది కుర్రాళ్ళు గోల పెట్టుకుంటూ పట్నంనించి నడిచి వస్తున్నారు. వాళ్ళు మాకేంచేసినా దిక్కులేదు. మాకార్లో డబ్బూ, బంగారంవుంది. దోచినా చేసేదిలేదు. సినిమా చూసాక బస్సులేక నడచి వచ్చేస్తున్నారని తరవాత తెలిసింది. ఏవో విజిల్సు కొడ్తారనుకున్నాను. మా అమ్మాయిని యెత్తుకుపోతారన్న భయంవేసింది. వయసులోవున్నవాళ్ళు యేంచేస్తారో

నని అమ్మాయి గజగజ వణుకుతూ దాక్కుపోయింది. మా అందర్నీ చూసి ఆగిపోయారు. కారునుతోసే మాంటారా అని దగ్గరగావచ్చి అడిగింది మీ మనువడే. టార్చివేసి యింకా బాగుచేస్తున్నట్లు బోయ్ నెట్ యెత్తి చూస్తున్నాను. మావూరు వచ్చేమని అందరూ పిల్చారు కానీ నేను మౌనందాల్చాను. ఇంతలో త్రోవపోయేలారీని అడ్డంగా నిల్పొని ఆపేసారు. ఆ డ్రయివర్ని కాదన్నా లాక్కొచ్చారు. రిపేరు చెయ్యకపోతే లారీ కదల దన్నారు. మొత్తంమీద కారు కదిలింది ఆపి దిగాను. మీ దేవూ రని అడిగాను. మీవూరు చూపించారు. మీరేం చేస్తున్నారన్నాను. ఏమీ లేదన్నారు. చదువుకున్నారుకదా వుద్యోగాలెందుకు చెయ్యరన్నారు. మా కెవరిస్తారన్నారు. ఇంత సత్ప్రవర్తనతోవున్న విద్యావంతులను వినియోగ పర్చుకోలేని సంఘం నిర్జీవసంఘం అనిపించింది. మనుషుల మంచినిచూసి, నేను ఫేక్టరీ జాగాను యెంపికచేసాను. మంచి మనుషులు బాధపడకూడ దన్న ఆవేదన నన్నిక్కడకు రప్పించింది. ''సరే — మీ యిష్టం'' అంటూ జీవనరావు ముందుకు కదిలాడు. తిరిగి వెళిపోతూ ఆగి వరండాలో నిల్చున్న నాయుడువేపుచూసి అన్నాడు.

పట్టినపట్టు మీరు వదలటంలేదు. పట్టినపట్టు వదలటం నాకు అలావాటులేదు.''

ఈమాట వినగానే నాయుడు అతనివెంట వెళ్తూ తనహద్దు దాటగానే.

''ఇప్పుడు నాజాగా హద్దు దాటిపోయావుగాబట్టి అంటున్నాను. పట్టినపట్టు విడిచేకన్నా ప్రాణం వదలడం మేలనియెంచే వంశంమాది. ఇది మాత్రం గుర్తుంచుకో!'' అన్నాడు కటువుగా.

## 3

చూస్తుండగానే ముప్పయ్యేళ్లలో పెరిగిన చెట్లన్నీ మూడురోజుల్లో తెగిపోయాయి. నాయుడు యింటి ముందుకు తూర్పువేపు ముళ్లతీగల కంచె పడింది. పచ్చదనాన్ని సందుల్లో మొలిపించుకుని ప్రాణంతో వున్న కొండరాయి బండరాయై సిమ్మెంటుతో కలిసి శిథిలమై పోయింది. చూస్తుండగానే పునాదులు లేచిపోయాయి. తరతరాలు యీ వూరిని పాలించే పచ్చదనం, పువ్వుల్లాంటి తెల్లమేఘాలను, కారుమబ్బులను ఈడ్చుకు వచ్చే వాతావరణం యికసరి! పొగతో రణగొణ ధ్వనితో కంపుతో కాలుష్యం చెందుతుందీ వూరు. ఇక మేఘాలు బూడిదరంగు పులుము కుంటాయి. తొలకరి మబ్బులు తొంగి చూడవు. మబ్బుల్లో మెరుపులు మునిగిపోతాయి.

''ఈ వూరి గుండె చెదరిపోయింది'' అనుకున్నాడు నాయుడు.

నాయుడు, గుండె చెదరినా పట్టుదల జ్ఞప్తికి వచ్చి గుండె దిట్టం




చేసుకున్నాడు. పిట్టల అరుపుల బదులు, బాకా కూతలు, చల్లని హాయి నిచ్చే గాలికి బదులు వేడిగాలి. రాత్రి పగలూ అదే పనిగా కోలాహలం. మరలు కొట్లాటతో మనుషుల ఆరాటం. చూస్తుండగానే అన్నీ మారి పోయాయి.

ఇలా మార్చినవాడి పట్టుదలతో పని చురుకుగా జరుగుతుంటే నాయుడిలో ఆరాటం పెరుగుతోందిగానీ తరగటంలేదు. కిరీటంలేని రాజులా యిన్నాళ్లూవున్న తన దగ్గరకు రానురాను వూర్లోవాళ్లే రాక తగ్గించేసారు. ఎన్నడూరానివారు యిప్పుడొస్తుంటే యిందులో యేదో కిటుకుందనుకున్నా ఆ కిటుకేంటో తెలీటంలేదు. వచ్చిన మునసబు వయసులో పెద్దవాడు కాదు. ఎదురు తిరిగి యేలుబడి చేస్తున్నాడని విన్నాడు. ఇదివరకు తన మాటను కాదన్నవాడు యిప్పుడు ఔనన్నాడంటే మునసబు మల్లేసుకు రెడ్డికీ యేదో తగువు వచ్చివుండాలి. ఈ రెండు కత్తులూ ఒక ఒరలో యిమడవు.

మునసబు అడక్కుండా సోది చెప్పుకున్నాడు.

''అసలు ఆ జీవనబాబు వెన్నలాంటి మనిషి. కంట్రోలంతా ఆవిడది ఆవిడ లేకండా యెక్కడకూ కదల్లేడు. అతగాడికన్నా ఆవిడ యెక్కువ చదువుకుంది తెనుసా ?''

''చదువుకుని యెవడ్ని వుద్ధరిస్తుందిరా మల్లేసూ ?''

''మనం కాదన్నా రెడ్డియేమంటున్నాడో తెలుసా? ఇన్నాళ్ళూ మంచి పాలచుక్కలకి వాచిపోయాం.. ఏనాడు కోడిగుడ్లు దొరికాయి ?''

''ఆ గేదెలూ ఆ కోళ్ళఫారం ఆవిడ సొత్తా ?''

''ఈ కంపెనీలో ఆవిడా ఒక డైరెక్టరు.''

''ఇవన్నీ పెట్టడానికి చాలదనా నా యిల్లూ, నాతోటా నొల్లేయా లని చూసింది మహాతల్లి.''

''అసలు ఫేక్టరీ నీయింటి యెదరగా యెందుకు కట్టాడని—ఎప్పటి కైనా నీజాగా కలుపుకుని మరింతది చెయ్యాలని .''

''కలుపుకుంటాడురా — కలుపుకుంటాడు !'' యీసడించాడు నాయుడు.

''అసలు సంగతి తెలుసునా! భూమి రిజిస్ట్రేషన్ అయిన వరకూ ఒక మాట — అయిపోయాక యింకో మాట.''

''అన్నమాట నిలబెట్టలేదా ?''

''అలా అడిగాననేకదా నామీద అలా విరుచుకు పరుతున్నాడు''

''వాడే !''

''వాడు వాగడు. వాగింది వాడిబంట్లు. మనవూరి ప్రెసిడెంట్ ఆడినోరు వీడినోరు అయిపోయినట్లు వాగితే నాలాంటోడు కేలుచేస్తే యెందుకా కోపమో ?''

''కోపం వచ్చిన మాటేమిటన్నావు ?''

''అతగాడు నిన్ను నమ్మాడనుకుంటున్నావు నేనూ అలాగే అనుకున్నాను. నాలాగా వూర్లో యెందరో అలాగే అనుకున్నారు అతగాడు వ్యాపారి. ఆతడు యెవర్నీ నమ్మడు. చీ పని వున్నంతకాలం నిన్ను నమ్మినట్లు నటిస్తాడు. ఉద్యోగాలన్నాడా? ఏటున్నాది ? ఏటిచ్చి నాడు? మనవూరి మనిషిని ఒకడ్నేస్తే వాళ్లవాళ్లను ముగ్గుర్నేసాడు. మన వూర్లో సదువుకున్నాడిక కూలి పనే యిచ్చాడు. పోన్నూరు నుంచి తెచ్చిన తన వాడిని కమ్చి పట్టుకు వీళ్లను తోలమన్నాడు ఇక జీపితాలంటావా? రోజు కూలి యేడు రూపాయలిస్తాడు ఏమంటే యింకా లాభాలు లేవం టాడు. మనూరి పెజకీ బుద్ధిలేదు. మనం కూలికి పిలిస్తే యేడురూపా యలకే తలొగ్గేస్తన్నారు,''

''ఇంత అద్వానంగా వున్నా ఒక్కడూ అడిగేవాడు లేడా ?''

ఈ వూరికి నాయకుడు లేడు. నాయకురాలే వున్నాది ''

''ఎవర్రా ?''

''మ రె వ రు ? ఆ డయిరెక్టరమ్మే -- లతమ్మ — మాటల మీదే మనుషులను వంచేస్తాది పని అంటే గభీమని చెయ్యటమే. పరిస్థితి బట్టి నడుసుకుంటాది కాబట్టి మంచి మర్యాదా ఆయమ్మ దగ్గరే వున్నాదని

పిస్తాది. ఆవిడ రహస్యం యేమిటో తెలుసుకోనటం అంత సులువుకాదు.''

''రహస్యం. చావు రహస్యం తెలుసుకోలేం గాని – ఏ రహస్యం తెలుసుకోకండా మిగిలిపోనాదిలే.''

''అది కాదు నాయుడు బాబూ ! ఆ ఆడమనిషిలో ఆ చాకచక్యం లేకపోతే వూరంతా నివ్వూ నేనూ తప్పించి ఆయమ్మ మాటకు తిరుగు లేదనుకో – అది ఆవిడ జాతకబలం అనుకోవాల మరి.''

''నివ్వన్నదేంటో నాకు బోధపడ్డంలేదు. నాకొచ్చిన యినఫరమేషను బట్టి వూరు అల్లకల్లోలం అయిపోనాది – కాదంటావా?''

''నేను కనపడ్డది కాదంటే నమ్మతారెవరు ? అనాచారం, దొంగతనం లావై పోనాది.''

''ఇంకా చెప్పు''

''పేకాటలకీ సారాలకీ వూర్లో డబ్బాడుతోంది''

''ఒరే మల్లేసూ ఒక్క మాటంటాను. కోపం రాదుకదా!''

''మీ బాబు ఒకనాడు అప్పులిచ్చి యింత ఆస్థి చేసాడా ?''

''నాతో యెన్నడూ అనలేదు ఆ సచ్చినోడు.''

''ఇప్పుడు వూర్లో అప్పులెవరిస్తున్నారురా?''

''పొన్నూరునించి వచ్చి ఫేక్టరీ చేరినోళే''

''ఎంత వడ్డీకిస్తున్నారురా?''

''నెలకి రూపాయికి పదిపైసలనించి పాతిక పైసల దగ్గర వరకూ వున్నాది.''

''ఆనాడు తోటలు అమ్మకండిరా అంటే విన్నారా ! అక్కడికి నేనే యెర్రోడిలా అరుస్తున్నాననుకున్నారు అంతా! ఇప్పుడు వాడి చేతికి జుత్తు అందిచ్చారు. ఆ జుత్తులు పట్టుకుని మెడలొంచి పాదాలొత్త మంటున్నారు రా...వత్తండి వెధవల్లారా''

''అందులో నా భూమిలేకపోయినా నాకు పౌరుషం లేదనుకున్నావా?'' అన్నాడు మల్లేసు.

''ఒరే మీరంతా మీకున్నది మీరే లెక్కపెట్టుకోలేని దద్దమ్మలురా. మీ విలువ మీరు తెలుసుకోలేని మతి మరుపు మనుషులురా మీరు. వెలుగు నించి పీకటికి నడిచే గుడ్డివాళ్ళురా. ఆ జీవనరావు దిగువచించి మీదికి వచ్చిన మనిషి కాబట్టే—హాయిగా మీ మీద సవారిచేసి చీకటినించి వెలుగుకు పోతున్నాడు...''

''ఏదో సర్ది సరిసెప్పుతావని వస్తే...నన్నే తిట్తావా ? ఒక్క మాట ! నేను ఆడిద్వారా ఒక్క యెర్రని యేగాని యెరగను. నా తరవున ఒక్కడ్ని వుద్యోగంలో యెయ్యించానా చూడు. అయ్యో! అధికారం అంతా పై వూరినించి వచ్చినోడి సేత పెట్టేసి సవటలై పోయామని నా గోల''

''నీ కాకిగోల యిప్పుడెక్కడినిపిస్తాది ?''

''ఏం ?''

''ఆ ఫేక్టరీ గోలవిను. ఆ బాకాల గోలవిను. అది నిత్యం పెళ్లిబాజా కొందరికి – మరికొందరికి చావుబాజా. నివ్వూ – ఆ యెంకటరెడ్డి సస్తే, వేరేబాజా అక్కర్లేదు.''

''అనరాని మాటలంటున్నావు. నివ్వే అక్కడకు మిగిలిపోతావా ? నీతోటా, ఒయాయిల్గూ మిగిలిపోతాదా ?''

''ఒరే మల్లేసు – మా వంశం సంగతి తెలీదురా ?''

''నివ్వు మీసాలు మలిపితే సరా ! నీ కొడుకు సదవని యెర్రోడు, నీ మనుమడు సదువుకున్న యెర్రోడు.''

''ఆలది నా వంశంరా...''

''నవ్వుతూ నీకొడుకైనా యిచ్చేస్తాడు. ఊరికేయెందుకు కూర్చోవాలని నీమనుమడైనా.. ''

''అడ్డదిడ్డంగా వాగకు. నావాళ్ల సత్తువ నాకు తెలుసు. పోతావా పోవా ?''

''పోతాను. ఈ వూరికి యిన్నాళ్లూ యేదెబ్బా వడలేదు. ఇప్పుడు జీవనబాబు దెబ్బ కొట్టుకొచ్చేసింది. మనం ఆపినా ఆగదు. ఇప్పుడు నీ

కత్తికన్నా వాడికత్తి వాడైనది. దిగండి కోడిపందాలకి.'' అంటూ వెలి పోతుంటే యెదరగావచ్చిన బిచ్చమెత్తుకుంటున్న యెర్రోడు మెల్లగావచ్చి—

''మునసబు యెత్తెత్తి యెగురుతూ పోతున్నాడు యేమైనాది ?''

''ఒరే ! నీ తాత యేంచేసేవోడురా ?''

''అడుక్కున్నాడు.''

''మీ తండ్రో ?''

''అడుక్కున్నాడు.''

''నివ్వో ?''

''అడుక్కుంటున్నాను.''

''నీ కొడుకూ అడుక్కుంటాడా ?''

మౌనం.

''మాటాడవేరా ? అది వంశమర్యాదకదరా ?'' అంటూ ''ఏడీ నీ కొడుకు అడుక్కోడానికి రాలేదేం ?''

''బాబూ ! సెప్పకేం ?'' తలగొక్కున్నాడు.

''ఏమైనాడురా ?''

''ఆ పెద్దబాబు...!''

''ఏ పెద్దబాబురా ? ఈవూరికి ఒక పెద్దబాబున్నాడురా?''

ఆ మరల మీది పెద్దబాబున్నాడుకదా ! అందులో పనిచేసినోలకి కాపీహొటేలు లోపల పెట్టినారుకదా — ఆహొటేల్లో టిపినందిస్తాడు. ఈడు తింటాడుబాబూ—కాసింత పచ్చబడ్డాడు. పనిలేనప్పుడు అ—ఆ—లు, అంకెలు నేర్పిస్తున్నారట బాబా !''

''నివ్వూ ఆడి గొందెలోనే దూరావూ — పో — పో —'' అంటూ యింట్లోపలకి వెళిపోయాడు నాయుడు.

## 4

ఇద్దరూ ఒక్కరోజే కూడబలుక్కుని వుండిపోయినట్లుంది. యింటికి వెళ్తే కంబారి పాలినోడు యెక్కడికెళ్లాడో తెలీదట ! పెళ్లానికీ పెద్దకీ చెప్పక. పోయినోడిని నమ్మడం చిక్కే ! తన జాగ్రత్తలో తను వుండాలనుకున్నాడు నాయుడు. ఎడ్లకు తనే కుడితి పెట్టుంటే యిల్లు వూడుస్తున్న కోడలు ప్రత్యక్షమైంది. నిత్యం నవ్వుతున్న కొడుకు కాస్త ముఖం ముడుచుకునే వచ్చాడు.

''దుంగమ్మ యెక్కడికైనా యెలిపోనాదా ?''

మాటాడకండా వుంటే.

''ఒంట్లో నిమ్మళం లేదా ?''

''పట్నం యెలిపోయిందట''

''మరి రాదా ?''

''రానట్టే''

''ఏం ?''

''పేక్టరీ బాబు యింట్లో పనికి కుదిరిందట.''

''ఇది యీరోజు తంతు కాదు, యెన్నాళ్లనించో సాగుతున్న రాయబారం అన్నమాట ! అందుకే ఆమధ్య కోడలకి జబాబులివ్వ నేర్చింది. అంత, తిని యింటి మనిషిలా పెరిగింది. యెంత సులువుగా అభిమానాలను తెంపుకొని పారిపోయిందిరా ?''

కొడుకు ముఖంలో నవ్వు కనిపించింది.

''ఎందుకలా అన్నిటికీ నవ్వుతావు ?''

''మామిడిచెట్టు పువ్వేసింది.''

ఆ సువర్ణరేఖ చెట్టువేపు చూస్తూ—

''మానుకి విశ్వాసం వుందిగానీ — మనిషికి లేదురా !''

మళ్ళీ నవ్వాడు.

''ఒరే ! ఇంట్లో వుండలేం. వీధిలోనికి రాలేం. ఎటుప్రక్క యెళ్తే అటే ముసలం — దీనికొక్కటే యిరుగుడు. వచ్చే యేడాది పంట కలిసొచ్చాక సుట్టూ గోడ కట్టేసుకుందాం.''

మళ్లీ నవ్వాడు.

''ఆ నవ్వు అవునన్న నవ్వా కాదన్న నవ్వా''

''అప్పుడు మాటకదా !''

''అనుకోవడం అంటూ ఒకటుంది కదరా !''

''చేసేముందు అనుకుందాంలే !'' అంటూ నవ్వుతూ లేచిపోయాడు కొడుకు.

''కొంప లంటుకుపోతుంటే నీకేం ఒంటికి తగల్దేదు''

''ఎక్కడంటుక పోనాయి ?''

''మరేంటిరా యిది ! ఆడెవడో మనమీద కత్తికట్టినోడిని ఫేక్టరీ బాబు అంటున్నావు''

''మరి వూరంతా అంటున్నారు.''

''వూర్లో ఒక్కడే బాబున్నాడు. ఈ వూరికి యిన్ని బాబుల్లేరని యిన్నాళ్ళా ఈ యింట్లోవుండి నువ్వు తెలుసుకోపోతే — రేపు నిన్నెవడు నరసింహ బాబు అంటాడురా'' ఈ మాటలు పొరుగూరునించి అప్పుడే వస్తున్న నర్సునాయుడు విని—

''బావా ! ఒకడు బాబు అంటేవుంది లేకపోతే లేదా ? మీ యాళ్ళ వంశంలో యాదిలేదు''

''తాగుడూ జూదం మాత్రం లేదు'' అన్నాడు నాయుడుబాబు

''అందుకే తరతరాలు తరక్కుండా లచ్చిందేవి నిల్చింది.''

పొట్టి నాయుడు నర్సునాయుడుతో వచ్చిన ఐదుగుర్నీ బల్ల మంచంపై కూర్చోబెట్టాడు. ఆ మంచంవేపు చూస్తూ .

''ఏదీ చెక్కుచెదరకుండా కాపాడుకొస్తున్నావు. ఇల్లు నిన్నకట్టిన యిల్లులా వుంచావు. ఈ బల్లమంచంపై ముగ్గురు పడుకున్నా యింకా చోటుంటాది — ఇది బర్మాటేకను కుంటాను...''

''కబురూ కాకరకాయ లేకండా దిగబడ్డారు.''

''కబురెట్టే, కోడో, గొర్రో కోస్తావని...''

''ఇప్పుడుమాత్రం తప్పించుకుని పోగలవా ?''

''ఈ వేళకి మాపని సులువుచేస్తే నివ్వు యిందు బోజనం పెట్టినట్లే''

''ఏంటో ఆ పని. .''

''చూశావా ఆడ్ని — పోల్చినావా ?'' నాయుడు ఆ యువకుడివేపు చూస్తూ —

''నీ మనుమడు సుందర్రావు కదరా !''

''నీ మాటకి తిరుగునేదు. ఈడు మా సెడ్డ సిక్కు తెచ్చి పెట్టినాడు.''

''పెళ్లంతో జగడమాడినాడా ?''

''మా వంశంలో లేనిపని సేసినాడు.''

''అంత తలవంపు తెచ్చిన పనేటి ?''

''నాగలి పట్టకండా కలం పట్టి బి.ఏ. అనిపించుకున్నాడు.''

''అదేమి తలొంపురా !''

''ఉద్యోగం చేసే అవసరంలేదు కదా అనుకుంటే కలంతో దున్నలేడు — నాగలి పట్టలేడు. ఏ పనీ లేకుండా ఆడు యెర్రోడై మమ్మల్నందరినీ యెర్రి మొర్రి చేసేస్తన్నాడు అందుకే నీ అవసరం వచ్చినాది.''

''నా అవసరమా ?''

''మరి కాదనకు ... ''

''పలుకు — అదేటో ఆ పని ... ?''

''ఇది పైసా పరకా, వందా వెయ్యి లంచం యిచ్చి తెచ్చుకుందామన్నా కాలేదు. పోనీ ఎమ్మెల్లేసేత సెప్పించినా మనిషి లొంగలేదు. ఇలాంటోడిని కలుసుకుని తేల్చుకుందామని వస్తే — ఆ జీవనబాబు.''

''ఆడి పంచన చేరిన వూరి పెద్దల్ని పట్టుకుని వెళ్లకపోయావా?''

''వాళ్లిద్దర్నీ పట్టుకునే వెళ్లాను. వాళ్లని బయటకి పంపేసి



నాతో యేమన్నాడంటే; మీ మాటను గౌరవించడానికి మీరెవరో నాకు తెలియదు. మీ భూములేమీ నేను కొనలేదు. ఈ రెండు షరతుల మేరకే నేను ఉద్యోగాల్లో మనుషులను వేసుకుంటున్నానన్నాడు.''

''మీ వూరు పిలవలేకపోయావా ?''

''పిల్చాను. మా వూరు రండి. మా గౌరవం సూడండి అన్నాను.''

''సూడ్డానికి వచ్చినా తేల్చుకుని వస్తాడు''

''ఏం తేలుస్తాడు ?''

''మీ తాత కట్టిన మీ యింటిని పడగొడ్తాడు.''

''పోతే పోయిందిలెద్దూ ! కొత్త పునాదులతో గట్టిమేడ కట్టుకోవచ్చు. ఆడే యీ ఫేక్టరీ మావూర్లో పెట్టే వూరకనే భూమి యిచ్చేవాడిని ?''

''అంతేనా ? అయితే యింతకీ నా అవసరం యేం వచ్చినాది ?''

''అతగాడు ఒక మాట అన్నాడు. అది సాలా ఖరీదైన మాట. అదే అసలైన మాట, సిసలైన మాటని మా అందరికీ అనిపించింది. ఆ మాట అనగలిగినవాడు నిజాయితీ వున్న మనిషే అనిపించింది.''

''ఎందుకలా నానుస్తావు. అసలు సంగతి చెప్పు''

'' ఈ సుట్టుపట్ల నేను గౌరవించిన మనిషి ఒక్కడే వున్నాడు. అతడు రికమెండుసేస్తే తప్పక యేసుకుంటానన్నాడు. మరి నివ్వు సెయ్యక తప్పదు.''

''పొరపాటు వినుంటారు. మా యిద్దరి మద్దివ పచ్చగడ్డేస్తే మండుతాది.''

''మనవి ఈనాటి స్నేహాలు సంబంధాలు కావుకదా! తప్పించుకునే మాట నివ్వు అనలేవు. నిన్ను ఒప్పించకుండా మేమూ కదల్లేం.''

నాయుడు తలమీద తలపాగా గుడ్డతీసి విప్పి చూపిస్తూ –

''నా తలపాగ గుడ్డతో నా గొంతుక కోసుకోమంటున్నారంతే'' అన్నాడు చాలా గంభీరంగా.

''ఏదో ఉపకారం చేస్తానని వస్తే వురేసుకుంటానంటే యింకేం అనగలం? లక్షణంతెచ్చే ఉద్యోగం లేక వూరిమీద వదలి కీడుతెచ్చుకుంటాం గానీ నీ గొంతు కోస్తామా ?'' అంటూ లేచిపోయాడు నర్సునాయుడు.

వెళ్లిపోతూ ఆశచావకండా వెంటవస్తున్న నరశింహను చూసి గొణిగాడు ''గురిచూసి ఒక మాట నివ్వేస్తే మీ బాబు గుణం కుదిరి యీ వుపకారం చేస్తాడు. తొందరలేదులే.''

నరశింహనవ్వాడు. తిరిగొచ్చిన కొడుకుతో ''వాళ్లేం, మంతరిస్తున్నారు ?''

కొడుకు నవ్వాడు.

''ఎందుకు నవ్వుతున్నావురా ?''

ఈ నవ్వు నాకెలా అబ్బిందో పెంచిన తండ్రివి నీకే తెలీదా అన్నట్లు మళ్ళీ నవ్వాడు నరశింహ.

''వాళ్ళ మాటలు విని వాడి దగ్గర జోలి పట్టుక వెళ్లావో?''

మళ్ళీ నరసింహ చిరునగవు. ఎన్నడూ యీ నవ్వుకు కారణం అడగని వాడివి యీనాడే యెందు కడుగుతున్నావని యెగతాళి చేస్తున్నట్లుందా నవ్వు. నాయుడుకు ఇన్నాళ్లా దేనికీ తొణకని బెణకని బ్రతుకు యిప్పుడు ప్రతిక్షణం తొణికించేసి వణికించేస్తోంది. దృష్టి ఆనకపోవడం అంటూ ఉండేది కాదిదివరకు. వాకిటనున్న చెట్టునించి తీసిప వేప పుల్లతో తోమినపండ్లు యిన్నాళ్లా కదలక యిప్పుడే కదులుతున్నట్లున్నయ్. ఎన్నడూ లేని పంటినొప్పి యిప్పుడే వచ్చింది. చేతిలో బంగారం మురుగు యిత్తడి సరుకులా కనిపించింది. మెడలో పులిగోరు పతకం తెగి పోయింది.

మాటాడకుండా మక్కువతో మమకారాలను పెంచుకున్న కోడలు. నవరుచులు వండి యింకా నాలిక తడిసి నిత్యం వూరిస్తున్నది. నవ్వినా ఆ నవ్వు గంధంవాసనే గానీ కపట విషంగాని కొడుకు! ఎప్పుడో ఒకప్పుడు కోపమొచ్చినా చక్కనైన గుణంతో ఘనంగా బతికే మనుమడు. ఈ ఐన వాళ్ల బలం వుండగా యెందరు మోసం చేస్తే తనకేం ఖాతరు ? ఎన్ని అవయవాలు పుప్పి అయినా తనకేం బాధ ?

సాయంత్రం సరికి దాలిగాడు వచ్చాడు. వారం రోజులై కనిపించని వాడు వెలుగుండగా వచ్చాడు.

''బాబూ ! రెడ్డిని శకుని అన్నావుగానే అసలు శకుని ఆ మునసబు బాబూ''

''మల్లేసు మాటలు నేను నమ్ముతానా ?''

''ఏమంటున్నాడో తెలుసునా ? తమరు మనిషంత మనిషి వస్తే మెడపట్టుకుని గెంటేసిన పనిసేసినారట.''

''ఎవరన్నారురా ?''

''ఊరంతా ఆ మునసబే సాటుతుంటే.''

''ఆడా ? యెదవ. ఆడి నక్క వినయాలు నాకు తెలియనివా ? జీవనరావుమా ఆడి పెళ్లాన్ని యెప్పుడు నా యెదరగా తిట్టాడో నన్ను అల యెదరగా తిట్టాడని తెలుసునురా ! ఈ నక్క గారీ కళ్యాణం పాడుతుందిరా ? ఇలా కూస్తూ ఆడు నాశనం ఐతే బాగున్ను కానీ వూరిని ముంచేస్తున్నాడు.''

''ఎన్నడూ రానిది యీ పేక్టరీ యీ వూరి కొచ్చిందని యెన్నాశలు పెట్టారు బాబో! ఏదో ప్రెసాదం యిస్తారని సూస్తే – ఆ పెసాదం వూర్లో వున్నోలే పంచుకున్నారు. నాలాటి పేదోడి బాగుకోసం పేక్టరీ పెట్టానన్నారు. బాబూ నాను యీ వూరి పేదోడ్ని ! వుద్యోగం·యిమ్మని నా ఒక్క కొడుకు ఆశపడి యెల్తే నీ భూములేవీ తీసుకోలేదే పనివ్వడానికని మొండిసెయ్యి సూపించినాడు. మల్లేసు యేం భూమి యిచ్చాడు ? ఆడికి పిల్లా జెల్లా ? పదివేలు లోపాయికారీ పుచ్చుకుని మా సుట్టమని పొన్నూరోడ్ని యెయ్యించుకున్నాడు.''

''మాయగాళ్లకి మాయగాళ్లే కుదురుతారురా.''

''బాబూ మీరేమనండి. ఆ వచ్చిన మారాజు, మారాణి మంచోలే బాబూ.''

''మంచోలా ?''

''ఊరోళ్లే ఆలని పాడుసేస్తున్నారు భాబూ !''

''ఆడూ చదువుకున్నా ఆడి పెళ్లాం అంతకన్నా చదువుకున్నాది. బుద్ధుండక్కర్లేదా ?''

''చేసిన మంచి చెప్పుకోవాల. ఆయమ్మే మంచిసేస్తుంది బాబూ !''

''ఏం సేసిందిరా ?''

''పాలమ్మి, గుడ్లమ్మి యేపారం సేస్తోందని యికటం ఆడాం. ఆ వచ్చిన లాబాలతో రెండ కుట్టుమిషన్లు కొని వూర్లో కొందరి ఆడోళ్లకి బట్టలు కుట్టడం నేర్పిస్తోందండి. ఆ బాబు మొన్న పదుగుర్నీ సేరదీసి నేను ఈ వూర్ని పెంచుకుంటున్నా నన్నాడు.''

''ఆడి మాటకు యెవడూ యెదురుతిరగ కూడదని, కుడిసేత్తో దోసుకుని యెడమ సేత్తో యిలాగ యెంగిలికూడు యిసుర్తాడురా !''

''ఆ గుడ్డి దీపాలుతీసి – యీాదిలో యెలుగు దీపాలు వెయ్యిస్తున్నాడు బాబూ...''

''మరేం ఆ యెలుగులో రెండుసేతుల్తో బుక్కండి'' అన్నాడు వేళాకోళంగా నాయుడు.

''బుక్కనుంటున్నావా బాబూ ? ఇదివరకు బుక్కినోలే బాగా బుక్కుతున్నారు. ఏనాడు యీ వూర్లో కాయగూరలు కొనుకున్నాం ? ఎవడీ గుడ్డికెల్లి యే చెరుకుముక్కో, గోంగూరో తెచ్చుకున్నా యెవరడ్డు పెట్టారు ? ఇప్పుడో ! ములగకూరనించి, పళ్ళుతోము వుల్లదాకా కొనుక్కుంటేగానీ బతకనేం ! మరి నాలాంటోలకి పైసాలెక్కడున్నాయ్ ? పొలం పనులకు పొన్నూరోళ్లెప్పుడైనా యీ వూరొచ్చినారా ? ఇప్పుడు యీ వూరు పొన్నూరోల పాలన అయిపోనాది. డబ్బుతో వచ్చిన డాబుసరి డూ డూ బసవన్న వేషం లాగున్నది. నీవ్వుకాదన్నా ఆడిస్తున్న ఆ గంగిరెడ్డోడు – ఆ పెద్దబాబే''

''పెద్దబాబెవరురా ?''

''పేక్టరీకి పెద్ద. ఎవడు పేక్టరీకి పెద్దయితే ఆడే పెదబాబు. ఆడే యీ వూరికి పెద్ద. ఆడేం తలుసుకున్నా సెయ్యగలడు.''



ఒకి దాలిగా అంచాడు నాయుడు.

''ఊరికి పనికిరానిది వుంటేనేం పోతేనేం ? ఇదొచ్చి వూరు బ్రష్టు అయ్యిందిగానీ బాగుపడనేదురా ! బాగుచెయ్యాని వారిదేం పెద్దరకంరా — బోడి పెద్దరికం'' యింతా అన్నా ఇంకా నాయుడు కోపం తగ్గలేదు.

దాలిగాడు నవ్వాడు.

''ఎందుకురా నవ్వుతున్నావు ?''

మళ్ళీ నవ్వాడు. వాడు వెళిపోయేక లేచి ముందుకువెళ్లి తిరిగి వస్తుంటే ఫేక్టరీ దీపాల వెలుగువల్ల తన నీడను తనే తొక్కుకుని కదులుతున్నట్లనిపించింది.

ఇంకో నీడను చూసి ఆగాడు. మనుమడు ఫ్యాక్టరీ దీపాలవేపు చూస్తున్నాడు.

''అటెందుకు చూస్తావు ? ఈ యిల్లూ వాకిలీ మననీడ. ఇది వదిలి వెళిపోతే మనవంశం వన్నె తరిగిపోతాది.''

మనుమడు మాటాడకుండా యింట్లోకి వెళిపోయాడు.

## 5

ఎంత వినకూడదన్నా వూరి వింతలు నాయుడు చెవిలో పడుతున్నాయి.

''ఊరికి రోడ్డేసినాడు.''

''వాడి లారీలూ ట్రాక్టర్లూ నడవడానికి యేసుకున్నాడు'' అన్నాడు నాయుడు.

''దేనికైతేటి ? ఊరికి వుపకారం జరిగింది కాదా ?''

''ఇన్ని తరాలు ఈ వూరికి యింతమంది పెద్దలు యేలినారు. అన్నారేగానీ ఒక్కడు రామమందిరం కట్టించగలిగాడా ?''

''కూలోల కడుపుకొట్టి కట్టిస్తున్నాడు'' అన్నాడు నాయుడు.

''ఎవరూ సచ్చిపోనేదు కదా ! రామా కృష్ణా అనుకోడానికి ఒక జాగా కుదిరింది కదా !''

''పట్నం యెల్లి పడిగాపులు పడడం తప్పిపోనాది'' అన్నదొక యిల్లాలు.

''ఏటున్నాదని అలాగ యిరగబడిపోతున్నారు ?'' అని నాయురు అందుకుంటే.

''వారానికొకసారి బయటే బయస్కోపు సూపిస్తున్నాడు కదా ! టికెట్టునేదు. ఏ మూల కూకోని సూసినా కనిపిస్తన్నాది.''

''ఇదంతా యెత్తులే.''

''వోటిచ్చుకోని సేస్తామని యేటి సెయ్యలేదుకదా ! ఇతగాడు ఓటు పుచ్చుకోకుండానే యిన్ని పనులు సేస్తుంటే గవర్నం కాదా ?''

''అయితే యితగాడికే యెయ్యి వోటు.''

''నిల్చుంటే యెయ్యరూ ? అడగాలా ?''

నాయుడు వూర్లో తిరిగి ఈ మాటలు విని నడ్డి వంచుకుని వచ్చినట్లు వచ్చాడు. మాటలన్నీ దెబ్బపై దెబ్బల్లా పడిపోయాయి.

''ఇదివరకు కేకేస్తే కోకొల్లలు. ఏం కావాలరా అంటే తమ సిత్తం అనేవారు. వయసుకి గౌరవం. పొలాలు పరపతి పుట్టించేవి. పంటకోసం శ్రమపడేవారు. పంటలొస్తే సంబరంగా వుండేది. ఇప్పుడో? బతిమాలి చెయ్యించుకోవాల. నేనేది సేస్తే నాకేం వస్తాదన్న చూపేగానీ నమ్మకంగా పని పూర్తిచేసి చేతులు కట్టుకుని నిల్చున్న రోజులు కావు. నాకన్నా నువ్వెంత కష్టపడిపోతున్నావ్? నాకులేని సుకం నీకేల? వయసులో ముదరోడివైతే బుద్ధిలో ముదిరిపోనావా ? నాలాగ రాయగలవా ? సేత వనుందా ? ఏది సూసి నిన్ను మొయ్యిమంటావ్ ?''

''ఇదీ రాగటా ! చూసిన చూడనట్లే కదిలిపోతున్నారు. ఊరు మారిపోయింది. ఒకే కుటుంబంలా వుండే వూరు. ఒకరి కష్టాలు యింకొకరు ఒకరి నష్టాలు యింకొకరు పంచుకునే ఆనవాయితిని పెళ్లగించేసినాది యీ ఫేక్టరీ !''

## మరో ఉగాది

మావి చివురే మాడిపోయెనా
మధురగానము మంటగలసెనా
పాడదేలనా కోయిలీవని ?
వాడిపోయెనా నేటి ఆమని !
ప్రకృతి కోపగించి
పలు కష్టనష్టాలకు గురియైన సామాన్యుణ —
దుష్టుల స్వార్థానికి బలియై
దుర్భర జీవితాలు గడిపే మాన్యులు —
స్వార్థాహం భావాల పెళపాళార్భటుల
వాగ్దానవర్షంలో ఎండిపోతూ
దగాపడిన తమ్ములు — అమ్మలు —
ప్రవహించే పరిస్థితుల అస్తవ్యస్తత;
అంతా అస్వస్థత ...
కంటక బాధితమై
కలకంఠి కంఠంగానం ఒలికించరాదు —
రుద్ధపడిన కలంకంఠం కవనం చిలికించలేదు !
అయినా — ఇది ఉగాది
శేషాశల కుగాది !
ఇది ఆమని — సుమజీవన వని !
ఎండవానల, కటికశీతల
కాలబాధల కెదురునిలిచి
మోడులే చివురించ, చూస్తూ
నాలో ఆశలు మొలకెత్తుతున్నాయి
ఆహ్వానిస్తున్నాయి మరో ఉగాదిని !

— మేకా సుధాకరరావు

ఊరి వార్తలు వినకపోతే యేదో వెలితిగా వుంటుంది. తెలుసుకున్న విషయాల మీద యేదో ఒక అభిప్రాయం యివ్వకపోతే తెలివితక్కువ వాడన్న బాధ మిగిలిపోతుంది. తన అభిప్రాయాలను యెదుటివాడు విని యేకీభవిస్తే బ్రహ్మాండమైన తృప్తి వస్తుంది. ఊరి వార్తలు మోసుకొచ్చి, తన అభిప్రాయాలను విని వాటితో యేకీభవించే దాలిగాడు యెన్నాళ్లయి రాకపోగానే వూరు పూర్తిగా మారిపోయిందని నాయుడు నిర్ధారించుకున్నాడు.

సాయంత్రం నాయుడు వరండాలో బల్లమంచంమీద కూర్చున్నాడు. ఒంటరిగా కూర్చుంటే యిప్పుడు ఒళ్లు విరుస్తున్నాడు కళ్లు మండుతున్నాయి. దగ్గరగా కూర్చున్న మనుమడు దగ్గుతున్నాడు.

''జీనసరావు నన్ను ముంచేసి ఆడు తేలిపోవాలని యిన్ని పన్నాగాలు పన్నుతున్నాడు. స్థానబలిమి అంటారు ఎక్కడ తెలిపోనాదో ?'' అని లోలోన వాపోతుంటే చీకటిపడే సమయానికి దాలిగాడు కనిపించాడు.

''నీకూ ఆగాలి సోకిందిరా కనపడ్డమే మానేసావ్. ఎందు కిప్పుడొచ్చావ్ ? యెలిపో'' అన్నాడు నాయుడు.

''ఏం సెప్పను బాబో ? ఎదుటోడితో సెప్పుకోలేని యిరకాటంలో పడిపోనాను.''

''ఏమైనాదిరా ?''

''ఇన్నాళ్లూ తిండికి లేకపోయినా తీపిగా బతికాంబాబూ ! ఆడు నాబతుకులో యిషం కలిపీసాడు బాబో ! ఈ బరువుతో యెందలపడిపోదును ?''

''ఎవ్వడావాడు ?''

''ఆ పెద్దబాబుకు సుట్టమేనట ''



"సుట్టమయితే "

"మొక్కలీసుగా వున్నాడు వండిపెట్టడానికి గంగిని కుదుర్చుకున్నాడు."

"పెళ్లయినోడేనా ?"

"లేదని సెప్పినాడు. పెద్దబాబు మాసుట్టమే ఆబాబుతోసెప్పి నీ అన్నకి పని ఫేక్టరీలో యిప్పిస్తానన్నాడు."

"మాటలుసెప్పి మోసం సేసాడన్నమాట !"

"పనిలేకపోతే పోయె. పెళ్లిసేసుకుంటానని మాటిచ్చి మాయలో కూతుర్ని ముంచేసినాడు."

"నెలప్పిందా ?"

"ఎవరితో నాగోల సెప్పకోనుబాబో! ఊరిలో పొక్కితే మాకులంలో యెలియేస్తారు. ఊరంతా యేళ్లు సూపించి యికటం ఆడరా !

"అయితే యిప్పడేం సేస్తావురా ?"

"నిలదీసి అడిగితే ఆడుకాదంటాడు. పెద్దోల అండదండలాడికున్నాయ్. నీ సరుకులో నాదెంలేదని నన్నే ఆడిపోస్తారు. బయటపడినా సిక్కే — పడకపోతే యెన్నాళ్లు దాసుకోగలను? ఈదెయ్యాన్నెలా వదిలించుకుంటాను బాబో ?"

"తప్పు నీదిరా !"

"రెండుపూటలూ తినాలనుకోవటం తప్పా బాబూ ?"

"అది కాదురా ! వయసొచ్చిన పిల్లకి యింత పసుపు నీరు పోసావు కాదు."

"అంత కలిగివుంటే దానికి ఒకరింట్లో పనికెందుకు పెట్టాను బాబూ"

"పెట్టావు! కానీ ఎవరింట్లో పెట్టావు ? మొక్కలిపోడి దగ్గర పెట్టితే—అగ్గీ—లక్కా ఒక దగ్గరుంటే యిలాగే అవుతాది. తప్పనీది"

"తమరూ యిలాగంటే యెందల పడిపోదును ?"

"ఉన్నమాటే అన్నానురా !"

"ఉన్నమాటవిని వుపాయం ఆలోసిస్తారని తమతోటే సెప్పకున్నాను బాబూ ! "

"ఏటి ! ఆ కొవ్వి పోయినోడితో యీ కొవ్విపోయిన దాని గురించి జగడ మాడమంటావా ?"

దాలిగాడు చప్పన లేచిపోయి "నా కొంపంటుకుంటే యింతనీరు యిసురుతావని వస్తే నన్ను కోతినిసేసి ఆడించడం నీకు తగునా ? నా గీత బాగులేక గోల పెట్టుకుంటే పీక కొయ్యడాని కొస్తావా బాబూ ?"

"పో పోరా ! నివ్వూ ఆలలో మనిషివే. ఆ మునసబునీ, రెడ్డినీ పట్టుకోని యెళ్లు. తగువు తేల్చుకో..."

దాలిగాడు ఏడ్పుకుంటూ పోయాడు.

## 6

ఊరంతా ఒక్కసారి గుబ్బుమంది. ఈ పిడుగులా పడిన వార్త వినగానే నాయుడు వెర్రెత్తిపోయాడు. చేత మునకాల కర్ర పట్టుకుని అంగట కాసాడు సాయంత్రమైనా మనుమడు యింటికి రాలేదు రోజంతా కోడలు మాటే వినపడలేదు. కొడుకు నవ్వుతూనే వున్నాడు.

రాత్రి సరిగ్గా నిద్దర పట్టలేదు. తన కిరీటాన్ని తన మనుమడే కాళ్లతో తన్ని వూడబీకుతాడని పొరపాటునైనా వూహించలేదు. ఇది ఒక్కడు చేసిన పనికాదు. ఇదొక పద్మవ్యూహం. అందులో సైంధవుడు యీ వెంకటరెడ్డి. అభిమన్యుడిలాంటి తన మనుమడు అందులో యిరుక్కుపోయాడు

మరుచటి రోజుకూడా మనసు మండిపోతోంది. కొడుకుమీదే కేక లేస్తుంటే వాడు నవ్వాడు.

"నవ్వరా — నేను సచ్చినా నవ్వుతావురా !"

కొడుకు అటు ముఖం తిప్పి నవ్వుకున్నాడు.

"నా బతుకే నవ్వుల పాలైనాది" అని అరిచాడు. మళ్లీ మీసాలు నులుపుకుంటూ — "వాడు పాచికలు ఆడుతున్నాడురా ! అవి దొంగ పాచికలు. ఏనాటికైనా ధర్మం జయించదా ! నన్నింత అల్లర పాలుచేసిన వాడి తొడలు విరగ్గొట్టనా !"

మూడు రోజులైనా మనుమడు యింటిని యింట్లో వున్న ఆత్మీయులను గుర్తుపెట్టుకోనట్టు యిటువేపు రాకపోగానే

"ఆడెందుకొస్తాడు ? ఎలాగొస్తాడు ? నాలాగ మీసాలు వుంచితే కదా పౌరుషం రాడానికి ?"

నాయుడు యిలా అరుస్తునే వున్నాడు. ఆరాటపడుతునే వున్నాడు. ఫేక్టరీలోనించైనా యిటు తిరిగి చూడనట్టుంది. నెల గడిచినా నిన్న మొన్న జరిగిన అవమానంగానే నాయుడు అదే గొణుగు, అదే సణుగు, అదే ఆరాటన, ఆవేదన. చూస్తుండగానే చితికిపోయిన మనిషిలా కనిపించాడు. తన పంతానికి మూడువైపులా స్తంభాల్లా నిల్చున్న యింట్లో ముగ్గుర్లో ఒక్కరు వైదొలగ్గానే ఒక ప్రక్కకు ఒరిగిన మేడలా వుంది తన జీవితం. తుమ్మితే కదిలే ముక్కులాంటి బతుకైపోయిందని అనుకుంటుంటే—

ఇంతలో యిదేమిటీ విడ్డూరం? మానని గాయాన్ని కత్తితో కెలికి

నట్లు క డలమిటలా సంచరిస్తోంది. ఏనాడు యెదరగా నిల్చొని మాట్లాడనిది యిదేమిటి తిరుగుబాటు ?

''నాకు వాడొక్కడే''

''ఒక్కడని నన్ను వీధిలోకి విసిరి తన్నుతావా ?''

''వాడు వండుకోలేదు. పైన తిన్నది వంటబట్టక చిక్కిపోయాడు. రెండు రోజులై జ్వరమట''

''ఈ యింట్లో యెవరికి జ్వరం లేదు ?!''

''నేను వెళ్తాను''

''నీకు మొగుడు ముందా – కొడుకు ముందా ?''

''ఇన్నాళ్లూ మొగుడి కింద యింత చేసాను. నా కొడుకు ఒక యింటివాడయ్యే దాకా వాడి క్రింద యింత చెయ్యనివ్వండి''

''ఏం చేసేసావ్ నా కొడుక్కింద ?''

కోడలు కాస్త తలుపు చాటుకు వెళిపోయి నెమ్మదిగా ''పెళ్లయిన దగ్గర నించీ ఙూనాటి వరకూ మంచి నీటితో కడిగి, పువ్వులతో పూజించాను. ఐనా విగ్రహం విగ్రహంగానే వుంది – విగ్రహంగానే మిగిలి పోతుంది.''

ఇంత పెద్దకూత వినగానే నాయుడు నిర్ఘాంతపోయి కోపంగా—

''అక్కడికి నా కొడుకొక విగ్రహం – నీ కొడుకే ఒక అగ్నిపరత్వం! వెళ్తానంటే కాదనడానికి నేనెవడ్ని ? వెళ్లు – వెళ్లిపో ! నా తలదన్ని పోయిన వాళ్లంతా నా ప్రాణం వుండగా ఈ యింట్లో కాలు పెట్టలేరు – పొండి – అంతా పొండి ... ''

కోడలు మెల్లగా కట్టు బట్టలతో కదలుతుంటే అక్కడే నిల్చున్న కొడుకుతో.

''వెళ్లరా – నువ్వూ పోరా నీ పెళ్లం యెంట.''

కొడుకు తండ్రివేపు ముఖం తిప్పి నవ్వాడుగానీ ఒక్క పాదం ముందుకు మోపలేదు. చప్పున ఆవేశంతో కొడుకును పట్టుకుని కౌగలించుకున్నాడు.

''నా నరసింహా నా బాబు ... '' అంటూ ఆవేశపడిపోయాడు.

## 7

కొడుకు వండిన ముద్దఅన్నం తింటూ—

''ఉత్తరాతి విగ్రహం అన్నాది. దాని నోరెలా వచ్చిందో? ఏనాడైనా యింత పదునుమీద అన్నం వార్చిందా ?''

కొడుకు నవ్వాడు. ఆ నవ్వుచూసి ముసలాడు మురిసిపోతూ ''నాయనా ! నీకు నవ్వే చేతనవుతాదనుకున్నానురా! గిన్నెలు యెంత బాగ తోమావురా'' అంటూ మరకలువున్నా, తువ్వాలుతో తుడిచేస్తూ అన్నాడు.

''ఈమాత్రం బోడిపనికి యెన్ని యెత్తిపొడుపు మాటలో ?''

ఇంత బాహాటంగా అన్నా కొడుకు వింటున్నా వినలేదన్నట్లే అనిపించింది. చెప్పుకోడానికి యింకెవరూ యింట్లో లేరు.

''ఎంత మెత్తగా వుండేది. ఎప్పుడూ యిలా కత్తిలా మారతాదని అనుకోలేదు. ఒరే నరసింహా ! నీ పెళ్లం ఆ లలితమ్మలాగ డయిరెక్టేరు అయిపోతాది గావాలరా ?''

ఊర్లోకి వెళ్లకఉండలేదు వెళ్ళి యిరకాటంలో పడిపోయాడు.

''ఏమంటున్నారో యిన్నావా ? నా పిచ్చివాగుడు యినలేక పారిపోనాదట ! ఒరే నీ పెళ్ళానికిగానీ, నీకుగానీ, ఆ రాజారావుగ్గానీ ఒక్కనాడు ఒక్క ఒట్టిమాట అన్నానురా! నిజమేన్రా – నాకు కూతురు లేదురా ! కోడలు విలువ తెలుసుకున్నానా లేదురా! ఎవరిలా ఆడిస్తున్నారో నాకు తెలీదా ? ఒక్క మాటమీగ నడిచినోడిని – నాకేంటి వీళ్ల ఖాతరు ?''

ఈ ఉద్రేకాలు ఒకసారి గుండెను యెగదోశి, యింకోసారి దిగదోసేవి. భూమ్మీద నడిచినా గాలిలో కదులుతున్నట్లు అనిపించేది. తల తిరిగి ఒకోసారి కూర్చుండబడిపోయేవాడు.

''ఏదో రోగం అనడానికి. మనిషిని తగ్గలేదుకదా — మనసు చిలికి నట్లు అవుతోంది. మజ్జిక చిలికినట్టే వున్నాదిగానీ శరీరానికి అపకారం యేమి జరగలేదని'' తన్నుతాను చూసుకుంటూ తమాయించుకున్నాడు.

పంతం హెచ్చయినకొద్దీ శరీంమీద దృష్టి హెచ్చవుతోంది. ఆస్థి మీద మమకారాలు పెంచుకుంటున్నాడు. వీటితోపాటు అనుమానాలు పెరుగుతున్నాయ్. అందరూ శత్రువుల్లానే కనిపిస్తున్నారు.

ఇదివరకులేని కంపేదో వేస్తోంది. చెరుకుగానుగుదగ్గర బెల్లంపిప్పి ముక్కిపోగా వేసే దుర్గంధమే వేస్తోంది. గాలివేస్తే గబ్బుకంపు కొడ్తోంది. కావాలని గొట్టాలతో యీకంపుగాలి యిటుప్రక్క వదులు తున్నాడన్న అమమానం వేసింది. గొట్టాలు లేవుగానీ తన భూమికి తూరుపుప్రక్క ఫేక్టరీజాగాలో తవ్విన కాలువ నల్లగా కనిపించింది. మడ్డినీరు మెల్లగా బారడానికి ప్రయత్నిస్తూ యిసుకలో సగం క్రుంగి పోతోంది. ఆ కచ్చాకాలవ నల్లనాగులా జారిపోతోంది. బుస్సన లేదుగానీ అంతపని చేసినట్లు దూరంగా ముక్కుమూసి పరుగెత్తించేటట్లు చేస్తోంది ఈగాలి విషం. ఈవిషం వారం రోజుల్లో ఒంటపట్టి నెమ్మదిగా చంపే స్తోందేమోనన్న అనుమానం హెచ్చయింది.

నర్సునాయుడుబృందం ఒకరోజు వుదయమే అగుపించారు. ఇంట్లో కెక్కడొస్తారవి వీధిలోకి వెళ్తే వాళ్లు అక్కడ నిల్చొనే కేకవేసినట్లు.

''ఆరోజే సెప్పేస్తే మాం యింకో చోటకెళ్లేవాళ్లంకదా !''

''ఏ విషయం...ఏం చోటు ?''

''నా మనుమడికి రాజరావుకు ఆ పెద్దబాబుతో సెప్పి యెయ్యించు కుంటానని...''

''నోటికొచ్చిన కూత కుయ్యకండి''

''నీ మనుమడు ఫేక్టరీలో చేరనట్లు సెపతన్నావ్''

''ముందు పోతారా...పోరా...''

వాళ్ళు వెళ్ళిపోయినా కోపంతో కొంతసేపటి వరకూ నాయుడు వణికిపోయాడు. పొద్దువాలినా, లోకమంతా మొండి మనుషులని లోలోన అరుచుకుంటున్నాడు. ఈ విషగాలులింకా వూరంతా ప్రాకిపోతాయి. ఐనా యీ మొరదులకు యీగాలేం చేస్తుంది ? ఎదుటోల పొలంలో యెద్దులను వదిలి, పిన్నల కర్రతో పొడుకొనే చవటలు—

ఇలా యెంత అనుకున్నా మనసు శాంతించలేదు. ఎదుటివాని యెత్తి పొడుపు మాటలు యింకా గుండెలో గుచ్చుకున్నట్లున్నయ్. అలాంటప్పుడు దాలిగాడ్ని చూడగానే గబగబ ముందుకెళ్ళి ''నీ కెవడు రమ్మన్నారురా— పోపో— '' అని కేకలేసాడు.

''ఏంటైపోనాదని అలాగ కూకలేస్తావు— ఊరుకో బాబూ—'' అంటూ కంచెదాటి లోపలకి వచ్చేస్తున్నాడు.

''నా యెదరగా కూర్చోనోడివి— నన్ను గసురుతున్నావురా ? నానంత తేలికైపోనానురా ?''

''ఏటీ అయిపోనేదు. శుభమని పెళ్లి పిలువుకొస్తే నామీద యేల అరుస్తావు ''

''ఎవరి పెళ్లిరా ?''

''నా కూతురు గంగి పెళ్లి.''

''అసలు సంగతి దాసీసినావా ?''

''దాసడమెందుకు ? ఆడే వుస్తె కడ్తుంటే !''

''నమ్మమంటావా ?''

''పెళ్లి కొస్తావు కదా— సూడవా ?''

''ఎలాగ లొంగాడురా ?''

''యాదో అరుస్తావు తీరుస్తావని నీ యెదర మొరెట్టుకుంటే నివ్వు యిన్నావు కాదు. ఆ నాడే నీ మనుమడు విని మెల్లగా ఆడి ఆట కట్టించేసినాడు.''

''విజం ?''

''నీ మనువడి దగ్గర నాయం వున్నాది. మనిషి యెలాటోడవనీ గార్నం యిస్తాడు. నా మాట నమ్మకం నేకపోతే—ఒకపాలి పేక్టరీ లోపలకి రా—ఎవరేలుతున్నారో నీకు తెలుస్తాది.''

''వీడు యజమాని అయిపోయినట్టు మాటాడతన్నావు ?''

''మాట సెల్లించుకోడానికి యజమానే అవ్వాలా బాబూ ! యజ మానే మీమనుమడి యెదరగా గడగడ లాడిపోతంటే ...''

''షచ్చకం కబుర్లాడకురా — ఈ మాటవిజం కాదురా ''

''అవునో కాదో వచ్చి సూడమంటున్నానా ?''

''మరి ఆరెడ్డి. మునసబు...?''

''ఈలుఆలు అనకు. అనక్కలన్నీపారో! అందరి ఆటకట్టించేసాడు.''

''మరి వాళ్లమాటకి విలువ లేదంటావా ?''

''ఆ పెద్దబాబు నీమనుమడి మాటే యింటాడు. మరి యినక పోతే యిలాగ యీపెళ్లి జరుగునా ?''

''ఏమైందో వివరంగా సెప్పు''

''నన్నుపిలిపించినాడు. నా కూతుర్ని పిలిపించినాడు. ఆడ్నీ నీమను మడ్ని పిలిపించినాడు. నాపిర్యాదు యిన్నాడు. జడ్జీగారి లాగ తీర్పు యిచ్చేసి నాడు. కొత్తగా కట్టిన రామమందిరంలో మొదటి పెళ్లి యిది. ఎల్లుండి రాతిరి పదిగంటలకి. వచ్చి నాలుగుఅచ్చింతా లెయ్యండి బాబో''

అని వెలిపోతుంటే వెంట వెళ్లి.

''ఆ జీవనరావు నా మనుమడ్ని లోబరుచుకుని యీ జాగా లాగేసు కుందామనికదా...ఇదంతా వేషం కదరా!''

''ఎల్లండి బాబో — మీబాగా యెవరిక్కావాలా ?''

''ఏమిటెరా ఆ మాట?''

''సూడండి అటు...''

''ఎటు ''

''ఆ అటు మామిడిసెట్టు. సువర్ణరేక సెట్టుకదా ఆ సిగురు సూడండి...''

## వసంతోదయం

తరువు తరువున చివురులు తళుకు లీన
పువ్వు పువ్వున రంగులు పొంగువార
కొమ్మ కొమ్మను పిందెలు కొసరిపూయ
పండు పండున రుచులెన్నొ పలకమార

ప్రకృతియే నవోదయ కిన్నెరలను మీట
వింత సొంపులతోడ వాసంతి వచ్చె
శిశిర బ్రతుకులు కొం(గొత్త జీవమొంద
చైత్రమాసన్నమై జైత్రయాత్ర చేసె

భ్రమర ప్రియుని మరుమల్లె సుమము పిల్చె
మేటి చిలుక శ్రేణిని మావితోట పిల్చె
నీలిమేఘము కబురంప నెమలియాడె
అంత ఆమనిన్ గని కోయిలమ్మ పాడె

తూర్పు తీరాన నవయుగ మార్పు తోడ
స్వాగతించిన జీవనరాగ సుధలు
తొలుత నిచ్చిన కాంతుల తోరణాలు
జాతి సమత మమతల సంకేతికాలు

చేదు జీవిత లోయలు స్వాదుజేసి
బండ బ్రతుకుల కొండలు మెండుజేసి
హెచ్చు తగ్గులు కనరాని పచ్చదనము
తెచ్చె నవ వసంతోదయం యిచ్చెయిలకు

**— తమ్మిశెట్టి రామారావు**

''అవ్వ(నోయ్ — ఎండిపోనాది. ఎలాగెండి పోనాది...ఎవడు యేర్లు తవ్వేసినాడో ?''

''ఎవరు తవ్వనేదు. ఇక్కడే వ్యవసాయం కాయ''

''నాకన్నా వ్యవసాయం బాగా తెలిసినట్లు మాటాడేస్తున్నావ్ ?''

''ఆ తూరుపుపక్క తవ్విసూడండి. ఈ మద్ది న ఫేక్టరీలో గలాటాయినలేబా ?''

''ఏం గలాటారా ?''

''అంత కళ్లుమూసుకుంటే యెలాగా ? సెవులు మూసుకుంటే నీకే నష్టం కదా !''

''ఏం గలాటారా ?''

''ఫేక్టరీ స్ట్రయిక్. మీ మనుమడు సెయ్యించినాడు. దాంతోనే కదా నీ మనుమడి సత్తువ ఆ పెద్దబాబుకి తెలిసిపోయి గజగజలాడిపోయి బతిమాలినాడు..'

''నమ్మమంటావురా ?''

''ఒకప్పుడు ఏదిసెప్పినా నమ్మినోడివి. నీ మనసెందుకిలా మారి పోనాది,''

''ఆ జీవనరావు పాలన సరంటావు''

''మీ మనుమడు యిప్పుడు పాలిస్తున్నాడియ్యా. రాజారావు అలా అలా నిల్చుంటే సరి అందరూ సలాంలు కొట్టారు. జీననబాబుకి లెక్కే సెయ్యరు''

''లెక్క సెయ్యక పోతే వూరుకుంటాడా ?''

''ఏం సెయ్యగలడు ? మనోడికి ప్రజల బలం వున్నది. మనోడి మాట యిని స్ట్రయికు సెయ్యబట్టే జీతాలు పెరిగినాయా ? నీ మనుమడి వలన — నా కొడుకు వచ్చే సోమవారంనించి ఫేక్టరీలో పని కెల్తాడు ఈ యిల్లూ, వాకిలీ యేది మిగిలిపోదుగానీ — ఊరూరా ఫలానా వాడి మనుమడని నీకూ నీ వంశానికీ పేరూ గొర్వం తెచ్చినాడు సాలదా ?''

అంటూ వెళ్ళిపోయాడు దాలిగాడు. వీడికిప్పుడు దాలిగాడు అని పిలడానికే సంశయం పుట్టొంది. ఇంత చల్లని కబురు తెచ్చిన దాలిగాడిని సగౌరవంగా దాలయ్య బాబూ అని పిలవాలనిపించింది. నిముష నిముషానికి వుత్సాహం వునికి .వుద్రేకం వువిళ్ళూరింది. అపలేని ఆవేశంతో వీధిలో పడ్డాడు. ఎన్నాళ్ళనించో కాంక్షించిన కుటుంబ గౌరవం అనే రత్నకిరీటం నెత్తికెక్కినట్లు, అలా నెత్తినపెట్టినవాడు తన మనుమడే అన్న గర్వం. వీడు వీరాభిమన్యుడే అనుకున్నాడు. ఆ అభిమన్యుడు పద్మవ్యూహం బయట నించి రాలేకపోయాడు. వీడు ఛేదించుక వచ్చాడు. రెడ్డి మునసబు లాంటి సైంధవులను, శకునులను హతమార్చేశాడు. పైవారికి బానిసలైన వూరి వాళ్ళను వుద్ధరించి ఒక ఆత్మగౌరవాన్ని ఆర్జించి పెట్టిన మహా నాయకునిలా మనుమడు కనిపించాడు.

ఇంట్లో మనుమడున్నాడు. కోడలుకూడా కూర్చుంది. మామగారిని చూడగానే లేచి చాపవేసింది.

''కాదనకు. గంపెడాశతో వచ్చాను.''

మనుమడు వింటున్నాడు.

''నీ యింటి నించి నివ్వు పాలిస్తే చూడాలని వుంది మనుమడా?''

''ఆ యింటిమీద మీకున్న మమకారం నాకులేదు''

''పూర్వీకులు కట్టిన యిల్లురా అది. అందులో యెప్పుడూ మంచి జరిగిందికానీ చెడుగు జరగలేదు. సిరైనయిల్లు. వంశం వృద్ధిపొందుతుంది.''

''మీకా వుద్దేశమే వుంటే నన్ను పట్నం, చదువుకు పంపక పోవలసింది.''

''ఏం?''

''చదువు నా గురించే కాక యెదుటి వాని గురించి కూడ ఆలోచింప జేస్తుంది. నాయిల్లు నావాళ్ల గురించే కాక నేనున్న సంఘం క్షేమం గురించి కూడా తాపత్రయ పడనిస్తుంది.''

''చదువు కోని మీ ముత్తాత ప్రజలకు ఉపకారం చెయ్యలేదా ? మీ తాత చెయ్యలేదా ? కళంకం లేని వంశం రా మాది''

''మన గురించి మనం చెప్పుకుంటే ప్రజ నవ్విపోతారు.''

''నేనేం లేనిదే వున్నట్లు చెప్పితే కదా ! ఇంతకీ నీ యింటకి యెప్పుడొస్తానంటావు ?''

''ఆ యిల్లా ! ఆ మట్టి గోడల యిల్లా...వురిల్లు...ఎందరినో మూగ మనుషులను చేసిన యిల్లు దాన్ని ఆ ఫేక్టరీ బాబు కోరినట్లు మీరిచ్చేస్తే నేను సంతోషిస్తాను.''

''వాడికా ? ఈ వూరిని చౌగ్గా కొన్నవాడికా ? ఈ వూరినిబానిస చేసిన వాడికా ? ఈ వూర్లో యీ ఫేక్టరీ పెట్టి దోచిన వాడికా ?''

''మీరేం చేసారు ? మీ తాత తండ్రులేం చేసారు ?''

''మేం ఎవర్నీ బానిస చెయ్యలేదురా ? దోచలేదురా ?''

''ఉన్న నిజాన్ని కప్పకండి. ఆ యింటో పెట్టి చాకరీ చేయ్యించు కున్నారు. కష్టానికి తగిన కూలీ యిచ్చారా ?''

''ఇవన్నీ చూసినట్లు చెవ్వున్నావురా !''

''ఒకటి మాత్రం చూసాను. మా అమ్మను మూగ చేసి ఒక బానిసకన్నా అధ్వానంగా చెయ్యటం చూసాను. మీ ప్రతిమాటకు తల వూపి నవ్వే డూ డూ బసవన్నగా మా నాన్నను తయారు చేసారు. స్వంత మనుషుల్నే యిలా దయా దాక్షిణ్యాలు లేకుండా మూగ జీవుల్లా చేసిన మీరు — ఈ గ్రామాన్నేం వుద్ధరిస్తారు ? మిమ్మల్ని మీరే పాత గొప్పలతో అక్కర్లేని ఆవేశాలతో, వెర్రి వెర్రి ఆత్మాభిమానాలతో అటమటించి ఆలోచించలేక పోతున్నారు.''

''ఏమిరా ? అంత మంకన చేసేసావు ? ఇంకేం వుపకారం చెయ్యాలిరా ?''

''మీరున్న జాగా ఫేక్టరికి యిచ్చేస్తే ఆ జాగాలో మరింతమంది బతికేవారు. ఇంతకన్నా రెండింతలు ఉత్పత్తి అయ్యేది. మీ సౌఖ్యమే

చూసుకుంటే యివ్వరు. ఈ వూరినీ సంఘాన్నీ బాగుచెయ్యాలంటే యిస్తారు.''

''ఇదే నా చివరి మాట.''

''ఆఁ''

''అయితే నీ యింటికి నివ్వు రావన్నమాట.''

''రాను.''

అప్పటికే బాగా చీకటి పడిపోయింది. మెల్లగా కాళ్లీడ్చుకుంటూ నాయుడు యింటివేపు కదిలాడు.

## 8

ఇంటికి వెళ్లేసరికి కొడుకు నవ్వుతో ప్రత్యక్షమయ్యాడు. ఆ నవ్వులో నిరీక్షణవుంది. ఆవేదనవుంది. అన్ని హావభావాలు ఆ నవ్వులో చూపించినా. నాయుడు దిగజారినగుండె మరింత దిగజారిపోయింది. తిండి సహించలేదు. గ్లాసుడు నీరు గడగడ తాగినా కంపే. ఫేక్టరీలైట్ల వెలుతురు పడ్తోంది. ఎదరగా ఫెన్సింగుదగ్గరలో యెండిన వెదుళ్లకుప్పలు యీవేళే పోసినట్లున్నారు. అంతదూరంలో యెండుగడ్డి కుప్పలుచూసాడు సాధారణంగా వాగుతున్న తండ్రి నోటమాటలు రాకపోగానే కొడుకు నవ్వు కెరటాల్లా వదిలాడు. లాభంలేక కొడుకు గదిలో తనమంచంమీద ఒంటరిగా నిద్దరపోవటం అలవాటైపోయినట్లు అప్పుడే గుర్తుతీసుకున్నాడు.

అర్థరాత్రి అయిపోయినా నాయుడు కంటిరెప్పలు పడలేదు. బొరిగ పట్టుకుని ఒళ్లు అలుస్తుందని గబగబ సువర్ణరేఖ చెట్టుదగ్గర తవ్వడం మొదలుపెట్టాడు. తవ్వుతుంటే నల్లనిమట్టి. తడిమట్టి. చేతికి తగిలిన మట్టి వాసనచూస్తే కంపు భరింపరానికంపు. కాలవలో యింకిన నీరు తన జాగాను చూపకిందనీరులా చేరింది. ఈ యింటిచుట్టూ యెక్కడ తవ్వినా యీకంపే. ఈ పచ్చనిచెట్లన్నీ యింకెన్నాళ్లో బతకవు. మల్లె పువ్వులాంటి యీ యిల్లూ యిక కంపుకొట్టే పువ్వయి మాడిపోతుంది. నిల్చున్నా సరిగ్గా నిల్చోలేకపోయాడు. తన నెలవుతప్పిన వస్తువులా వింత పరిసరాల్లో మెసలుతున్నాననుకున్నాడు. కొండమీదినించి దొర్లిపోయిన రాయిలా గడగడా జారిపోతున్నాడు.

''ఎక్కడివాడో వీడు? వీడెవడోవచ్చి ఈ చెట్లను నరికేసాడు. పిట్టలను మాయంచేసాడు. పచ్చదనాన్ని పళ్లనూహరించేసాడు. పీల్చేగాలిలోనూ బంగారం పండే మట్టిలో, చేపలు పండే నీటినీ - ఒకటేమి—? ఈ వూరు వూరంతా యీ విషంతో నింపేసినాడు...''

లేచాడు. నాలుగడుగులు వేసి

''ఇటు దటు తిప్పేసాడు. నాలాంటోల పీకమీద అడుగువేసి నొక్కేసినాడు.''

తలెత్తి చూస్తే చీకటి రాత్రులైనా చుక్కలు కనపడలేదు. ఫేక్టరీ లైట్ల వెలుగు బేటరీ లైటు ఫోకస్‌లా కళ్లమీద పడుతున్నాయ్. ఒక్కసారి కళ్లు చింతనిప్పులైనాయి. గబగబ గదిలోనికి వెళ్లాడు. కొడుకు నిద్రలోకూడా నవ్వుతున్నాడు. సీసాతో కిరసనూనె తెచ్చాడు. చెవి సందులో చుట్టవుంది. ఖద్దరు బనియాను జేబులో నిత్యం వుండే అగ్గిపెట్టెవుంది. కాస్త ముందుకు వెళ్లాడు.

''ఈ వూర్లో తరతరాలై సాధించిన కలిసి మెలిసి బతికిన బతుకులను, ఒకరి కష్టాలకు యింకొకరు ఆదుకోడాలను, మంచి మర్యాద కులం, సాంప్రదాయం—నీతి నియమం అన్నిటినీ యీ ఫేక్టరీ పొట్టను పెట్టుకుంది. ఉత్పత్తి చేస్తూ, విషాన్ని నాలుగు మూలల కక్కి చంపుతున్న యీ మహమ్మారిని—కాల్చేస్తాను. ఈ రాకాసిని సంపితే గానీ యీ వూరు బాగుపడదు.''

నాలుగు అడుగులు ముందుకు వేసి ఫెన్సింగ్ దగ్గరకు వెళ్ళాడు. అంతదూరంలో వెలుగులో యెవరో నిల్చున్నట్లుంది.

''వాడెవడు? తన మనుమడా? ఆ మునసబా?''

ఆనలేని కళ్లల్లో కన్నీరుబికింది.

ఈ ఫేక్టరీ మనిషికీ మనిషికీమధ్యనున్న సంబంధాలనే తెంపేసింది. ఏనాడు మనుమడు యిల్లువదలి వెళ్తాడనుకున్నానా ? కోడలు నిల్చున్న పాటున చెట్టువదలిన కోతిలా పరుగెత్తిపోయిందే !''

ఉబికిన కన్నీరు బొలబొలా కారిపోయింది. అగ్గిపెట్టెను మళ్లీ జేబులో వేసేసాడు. కిరసనూనె సీసాను పట్టుకుని వెనుకకు తిరిగిపోతూ

''ఎందరో బతికిన బతుకులు, వాళ్ల కన్నిటి సుక్కలూ యిలాంటివే. కాల్చాడని యే కాపలా కాస్తున్నోడి పీకో కోస్తారు. ఒక అమాయకుడులేని నేరం మోస్తుంటే. తనెలా చూస్తూ వుండగలడు గిన్నేళ్లూ నేరం చెయ్యకుండా నీతిగా బతుకుతున్న తన కిప్పుడేల యీ కావరం ?''

నడుస్తున్నవాడు చప్పున ఆవేశంతో ఆగిపోయాడు. ఇంటిముందు బండరాయి చుట్టూ పచ్చగడ్డి పరకైనాలేదు.

''నాబతుకు యిప్పుడు యీ బండరాయే''

''నేను మనిషిని కాన్రో'' ఒకే ఒక గావుకేక వేసి. ఆ కిరసనాయిలు తన మీద పోసుకుని నిప్పంటించుకున్నాడు.

*[అ యి పో యిం ది]* ●

# జీ వి తం

— యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

జీవితమే కలలు
ఎన్నెన్నో రంగుల వలలు
మధురమైనది వయస్సు
గడచిపోయింది ఉషస్సు

అల్లేను బంగారు భావన
బ్రతుకే శృంగార కామన
మిగిలింది చితికి కరుణ
గతంలోకి పరికిస్తే శూన్యం
వర్తమానంలో తోచని మాలిన్యం
భవిష్యత్తు ఆశలకు శరణ్యం
ఎందుకీ బ్రతుకు ?

అర్థంకోసం వెతకినాను
శాంతిలేని బ్రతుకున
గమ్యమెరుగని బాటసారిని
ఎడారిలో తోటమాలిని
నేను నిరాశావాదిని కానంటే
వినలేదా శంకరుడు
నా మెదడు నిండా కింకరులే

వికసించిన పుష్పానికి
పొదచాటున సర్పానికి
ఆకాశాన చందురునకు
నడి రోడ్డున అథితునకు

కడుపులోన విస్కీకి
కలంపట్టిన డాక్టర్ విస్కీకి
దానయ్య కౌగిలిలోని దాసికి
మార్వాడి దగ్గరున్న ధనరాసికి
సన్యాసి చిలుం గొట్టంలోని గంజాయికి
బిక్షగాడి పాత్రలోని గంజికి
అర్థముంది

కాని

నా బ్రతుక్కి అర్థమేది ?
పరమార్థమేది ?

# "బ్లూ స్టార్ మద్దతు ఉన్నదంటే ఇక లేనార్డ్‌కు తిరుగులేదని నాకు ముందే తెలుసు!"






**అవును మరి. ఏర్‌కండిషనింగ్‌లోనూ, రిఫ్రిజిరేషన్‌లోనూ వారిది అగ్రగణ్య కంపెనీ కదా!**

నిజమండీ! వారి పేరేకాదు వారి పని కూడా గొప్పదే. 35 అంతస్తుల ఫైవ్ స్టార్ హోటలొక దానికి వారు చేసిన పూర్తి ఏర్‌కండీషనింగూ, బ్రహ్మాండమైన 20 కూలింగ్ రూములకు రిఫ్రిజిరేషనూ నేను స్వయంగా చూశాను. అంతెందుకు, లేనార్డ్ మీద ఈసారి నా టెస్ట్‌మ్యాచిని కూడా పందెం కాయడానికి నేను సిద్ధం!

**లేనార్డ్‌లోని కంప్రెసర్ కూడా జగజ్జెట్టీయే!**

అంతా ఆ కంప్రెసర్ మీదే ఆధారపడి ఉంది మరి. చెడిపోవడాలూ, చికాకులూ ఊహూఁ, అసలుండవు. దాని గట్టితనమూ, నమ్మకమైన పనీ చూస్తే యిక దిగులనేమాటే ఉండదు. జగజ్జెట్టీ అంటే యిక తిరుగేముంటుంది. అందుకే, నాకూ, మా శ్రీమతికీ కూడా అదంటే అంత యిష్టం. ఇక ఫ్రెండ్సంతా వచ్చి, వంతులపై వంతులు నడుస్తూ ఉంటే మాత్రమేం, మా కంప్రెసర్ చల్లగా తోడు పలుకుతూనే ఉంటుంది.

**నిలవ భోజనమైనా నిమ్మళంగా, తాజాగా ఉంటుంది!**

భోజనం విషయంలో పట్టింపులన్నీ వదిలేశా. అందుకే శ్రీమతికి మరీ సంతోషం. అయినా, రుచులు సరిగ్గా ఉండి, కూరలన్నీ తాజా తాజాగా ఉంటే యిక నేను మాత్రం గొణగడందేనికి!



**థాంక్యూ బ్లూస్టార్!**

మా లేనార్డ్ ఎప్పుడేగాని ఇబ్బందనేది పెట్టి ఎరగదు. అయినా అవసరమంటూ వస్తే ఫోనెత్తి 'హలో' అంటే చాలదూ, సేవ హాజరు కావడానికి!




లేనార్డ్ 5 సైజుల్లో దొరుకుతుంది—ఆటోమాటిక్ డీఫ్రాస్టుతోటి 286, 165 లీటర్లు, 135, 90, 65 లీటర్లు. 165 లీటర్లలో డబుల్‌డోర్ మాడల్ కూడా లభిస్తుంది. వీటితో దేశవ్యాప్తంగా ఉన్న బ్లూస్టార్ సేవా సౌకర్యం.






బ్లూస్టార్-ఏర్‌కండిషనింగ్ మరియు రిఫ్రిజిరేషన్‌లో అగ్రగణ్యులు

SIMOES/BS/L/83A TEL

# ఒకమారు ఉపయోగించారంటే బిజ్ మీరు మరిమరి కొనే పని వుండదు ఇహ మీకు.




## ఎందుకంటారా?

సూపర్ బిజ్‌లోని ప్రత్యేకమైన ఫార్ములా అదనంగా శక్తివంతమైన ఒక డిటర్జెంట్ కల్గి వున్నది. ఇది జిడ్డు-జిగటు, మచ్చలు-మరకలు, మురికి-మైలను చిటికెలో తొలగించేస్తుంది. తళతళలాడే మెరుపు ఇస్తుంది. మరి అందులోనే వుంది—సాధారణ తోమే పౌడర్లలో లేని సూపర్ బిజ్ ఉత్కృష్టత. సూపర్ బిజ్‌లోని ప్రత్యేకమైన డిటర్జెంట్ త్వరగా నురుగు నిస్తుంది. కనుక మీరు త్వరగా, చక్కగా శుభ్రం చేసుకోగలరు. అందుకే ఎంతో ఎక్కువ జిడ్డు అయినవి ఏవి శుభ్రం చేయాలన్నా సరే, చౌక తోమే పౌడర్ల కన్నా దీనిని ఎంతో తక్కువగా ఉపయోగించుకోవచ్చు.

అందుచేతే మీరు బిజ్ వాడి నిజంగా ఎంతో ఆదా చేసుకోవచ్చు.

మేము చెప్పాముగా మరి....ఒకమారు ఉపయోగించారంటే బిజ్ మీరు మరి మరి కొనే పని వుండదు ఇహ మీకు. ఎందుకంటే....




**కాస్త బిజ్ ఎంతో ఎక్కువ తోముతుంది.**

గోద్రెజ్ ఉత్పాదన

CASGS-162-254 TEL






# ఈ యుగాదికి మీరో క్రొత్త అధ్యాయానికి నాంది పలకండి.

## నూతన రకాన్ని
## ఎచ్ఎంటితో ప్రారంభించండి.



వాచ్ డివిజన్




దేశానికి సమయాన్ని
సూచించువారు
ఫ్యాక్టరీలు
బెంగళూరు I & II
శ్రీనగర్, తుంకూరు.

**hmt చేతిగడియారాలు**
మీఅభిరుచికి అనుగుణంగా నూటికి
పైబడ్డ సరిక్రొత్త నమూనాల్లో లభిస్తున్నాయి.

సీరియల్

# కర్మయోగి

డా॥ కె.వి. కృష్ణకుమారి

మనసు చంచలమైనది. దాన్ని నిరోధించుట అసాధ్యం. ఐతే వింటిని తయారు చేయువాడు వెదురును తన ఇష్టానుసారం వంచుకొనునట్లే బుద్ధిమంతుడూ— తన మనసును తన కిష్టం వచ్చిన రీతిలో తిప్పుకోగలడు ...

కృష్ణారావు మేధస్సులో చలనం మొదలైంది —

పక్షుల కిలకిలరావం లీలగా చెవులను సోకుతోంది.

అంతర్వాణి బోధలు అస్పష్టంగా విన్పిస్తూనే వున్నాయి—

శాసిస్తూనే వున్నాయి ...

హృదయంలోనే స్థావరమేర్పచుకున్నట్టున్న శ్రీకృష్ణపరబ్రహ్మ — మరీ మరీ హెచ్చరిస్తున్నట్టుంది—

"నన్నాశ్రయించు. నాపైన భారముంచు. అన్ని కర్మలూ— ప్రతిఫలాపేక్ష లేక చెయ్యి. నన్నే పొందగలవు."

(గత సంచిక తరువాయి)

"నువ్వు చెయ్యనన్నా— నీ స్వభావం— నీచేత కర్మలు చేయించకమానదు—అప్పుడు నీ నిశ్చయం నిష్ఫలమైపోతుంది"

"నీవు కర్మబద్ధుడివై యుండి కూడా — అజ్ఞానము కప్పబడివుండటం చేత. స్వధర్మము చెయ్యనంటున్నావు. ఆ కర్మమునే —నువ్వు లోబడిన వాడివై చెయ్యగలవు."

"సందేహమెందుకు ?. పవిత్ర గీతను నా భక్తులకు చెప్పేవాడు— నన్ను పొందగలడనుటలో సందేహంలేదు."

"ఈ గీతాశాస్త్రమును ... ఇతరులకు బోధించువాడికన్నా— నాకు మరొకడు ఇష్టుడు వుండడు—"

ఆలోచన మాను. . అజ్ఞానం వదులు కర్మలు ఆచరించు. నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు. నీ కన్నతల్లి కన్నీటిని చిందనివ్వకు — ఆవిడ ఆత్మలోనూ— పరమాత్మను చూడు. ఆవిడ కోరికను నీ కోరికగా గ్రహించు. కర్మ చెయ్యి. పదిమందిచేత చేయించు. గీతను పారాయణ చెయ్యి. పదిమందికీ బోధించు. చివరికి చరితార్ధతను సాధించు. ఈ భావనలూ— ఆదేశాలూ — శాసనాలూ నావే. చేయించేవాడిని నేనే. నిమిత్తమాత్రుడవై చెయ్యి. ఫలాపేక్షను వదలు. బాధ్యత నాది. భారం నాది. నన్ను పొందగలుగు దారే నీది. ఆలోచన మాను. కర్తవ్యం తెల్సుకో. కర్తవ్యం నిర్వర్తించు— కర్తవ్యం సూచించు—"

అంతర్వాణి ఘోషతో—

పరమాత్ముని ఆదేశంతో-సరికొత్త వ్యక్తిగా కళ్ళు తెరిచాడు కృష్ణారావు. క్షణం స్తబ్దుగా వుండిపోయాడు--

రాత్రి నుంచీ ఇప్పటి దాకా జరిగిన సంఘటనలన్నీ అస్పష్టంగా—లీలగా—కన్పించటం మొదలు పెట్టాయి.

అపనమ్మకంతో—శరీరాన్ని చూసుకున్నాడు—

ఆత్మావలోకనం చేసుకున్నాడు—

ఆత్మ సాక్షిని ప్రశ్నించుకున్నాడు—

పరబ్రహ్మను చూడగలిగాడు—

పరమానందంతో వొళ్ళు మర్చిపోయాడు—

"ధన్యోస్మి, ధన్యోస్మి కృష్ణా! ధన్యోస్మి—"

రెండు చేతులూ జోడించిన కృష్ణారావు కళ్ళు అశ్రుధారలు వర్షిస్తున్నాయి పులకించిన శరీరం ధన్యత చెందినట్టు— ఉప్పొంగిపోతోంది— ధన్యత చెందిన అంతరంగం ఇంత అదృష్టాన్ని మించి మరేమీ కోరలేనంటోంది,

కర్తవ్యం మరోసారి గుర్తుకుతెచ్చుకున్నాడు.

వెన్ను తడుతున్న అనుజ్ఞను శిరసావహించటానికి నిశ్చయించుకున్నాడు.

మనసు తేలిగ్గా వుంది.

మనిషి క్రొత్తగా లేచాడు—

ఆత్మీయంగా కనిపిస్తున్నాయి. విచిత్రంగా— ప్రతీ అణువులోనూ— ప్రతీ వస్తువులోనూ — శ్రీకృష్ణుడే దర్శనం ఇస్తున్నాడు—

నవ్వుతూ పరకరిస్తున్నాడు—

చిరునవ్వును వీడవద్దని హెచ్చరిస్తున్నాడు.

కృష్ణారావు పెదాలమీద అందమైన దరహాసం విచిత్రంగా మెరిసింది ఆ కళ్లల్లో శాంతీ—నిశ్చలతా—క్షణాల మీద నిండిపోయాయి—

ఆ హృదయంలో సర్వాంతర్యామిని చూడగల శక్తి—వెయ్యేనుగుల బలాన్ని అందించింది.

నిష్కామ మార్గం నిష్కంటకంగా కన్పిస్తుంటే—

హుందాగా కిందకు నడిచాడు కృష్ణారావు.

"కృష్ణలాంటివాళ్ళు కోట్లల్లో ఒకళ్ళుంటారేమొ ..."

తులసమ్మ కళ్ళల్లో ఆశ మెరిసింది.

లక్ష్మి ఆత్రుతగా చూస్తోంది.

"చివరికి వాడేమన్నాడు ?"

**జరిగిన కథ — 6 :** తులసమ్మ కుమారులు రామకృష్ణయ్య, కృష్ణారావు. రామకృష్ణయ్య కృష్ణ భక్తుడు. భార్య కళ్లలోకూడ ఆయనకు నీలమేఘశ్యాముని దివ్యరూపమే కన్పిస్తుంది కృష్ణారావుకి సంగీతం అంటే ప్రాణం. వీరిద్దరి ప్రవర్తన చూసి తల్లి తులసమ్మ తనువారిపై పెంచుకొన్న ఆశలు తీరవేమో అని భయపడింది. తులసమ్మ కృష్ణారావుని వంశం నిలపమని వేడుకొంటుంది తల్లి కోరిక అన్నతోచెప్పి ఆయన సలహా అడుగుతాడు కృష్ణ. అడిగిన వాళ్లకు రాధ మాధవుల తత్వం బోధించమని కృష్ణను కోరుతాడు రామకృష్ణయ్య. అన్న పరిస్థితి బాగలేదని తల్లిని, వదినను వచ్చి చూడమంటాడు కృష్ణ. రామకృష్ణయ్య మరణిస్తాడు. లక్ష్మి తన శేష జీవితం అత్తగారింట్లోనే గడుపుతానని చెపుతుంది. కృష్ణారావుని పెళ్లి చేసుకొమ్మని తల్లి వేడుకొంటుంది. అత్తగారి కోరిక తీర్చమని కృష్ణకు చెపుతుంది లక్ష్మి. తల్లి ఆశను తీర్చాలా ! గృహస్త ఆశ్రమం స్వీకరించాలా వద్దా ! అనే సందిగ్ధంలో పడతాడు కృష్ణారావు. శ్రీహరి బాబాయికూడా తులశమ్మగారి కోరిక న్యాయమైనదని, పెళ్లి చేసుకోమని బోధిస్తాడు. కృష్ణారావు తను తన అన్నగారి, వివేకానందుని, తండ్రిగారి అడుగుజాడల్లో నడుచుకోవాలనుకుంటునట్లు బాబాయి శ్రీహరిగారితో చెపుతాడు. సంసారం సాగిస్తూనే ఈ దీక్ష కొనసాగించవచ్చని నచ్చచెప్ప చూస్తారు శ్రీహరి బాబాయి. కృష్ణ గొప్పతనం ఆయన గుర్తించినా తులశమ్మగారి కోరిక తీర్చటం తన బాధ్యతగా తలచి కృష్ణను పెళ్లి చేసుకోమని కోరుతాడు. కృష్ణ తన లక్ష్యానికి సన్యాసమే మేలైనదని శ్రీహరి బాబాయితో చెపుతాడు. అందుకాయన సంసారం చేస్తూనే నిష్కామ బుద్ధితో మనసు నిశ్చలంగా ఉంచుకొంటే భగవంతునికి ఆత్మీయుడవ వచ్చని కృష్ణతో చెపుతారు.



కడుపు తీపిని అర్థం చేసుకోగలరు శ్రీహరిగారు.

"చెప్పండి — మీ కృషి ఎంతవరకు ఫలించింది ?"

"........................"

"వాడేమైనా దార్లోకి వచ్చినట్టున్నాడా?"

తులసమ్మలో ఉత్కంఠత పెరిగిపోతోంది.

"ఏం చెప్పాలో అర్థం కావటం లేదు శ్రీహరిగార్కి

"చెప్పండీ ... పెళ్ళి కొప్పిస్తానన్నారు..."

"అన్నాను ..."

"అయితే ఏమన్నాడు ?"

"ఇంత భక్తురాలివి...ఈ ఇంటి కోడలివి— రామకృష్ణుల తల్లివి ... ఇంత సామాన్యురాల్లా అడుగుతావేమిటమ్మా — "

శ్రీహరి ఆనందమేమిటో అర్థం కావటం లేదు.

"లేకపోతే నాకృషా? నా కృషేమిటమ్మా... సాక్షాత్తు ఆ గీతాచార్యుడే ఈ ఇంట్లో కాపురం వుంటున్నాడు ... నాలాంటి సామాన్యుడి కృషీ పట్టుదలా ఏపాటివమ్మా ... "

తులసమ్మ కళ్ళల్లో నీటి పొరలు కమ్ముకున్నాయి.

"మీరు నమ్ముకున్న శ్రీకృష్ణపరమాత్మ అన్యాయం చేస్తాడంటావా ? అందులో కృష్ణకి. భక్తుల్ని కడుపులో పెట్టుకు కాపాడే ఆ పరమాత్మ తన కర్తవ్యం మర్చిపోతాడంటావా?"

తులసమ్మ విచిత్రంగా నవ్వింది

"ఆనాడు వారూ అలాగే అనేవారూ. భక్తి వుండవచ్చుకానీ — అదే లోకం — అదే స్వర్గంగా ఆ దేముడితోనే కాపురం చేస్తుంటే — ఇంక ఇల్లు ఇల్లాలు సంసారం ఎందుకూ ? బాధల్నీ బాధ్యతల్నీ పంచుకునే తోడు పూర్తిగా నా నెత్తినే బాధ్యతను వొదిలేసి తప్పుకున్నారు అప్పట్నుంచీ ఇప్పటివాకా — నాకు విశ్రాంతంటూ వుందా ?

మీకూ తెలుసు. నేనీ ఇంట్లో అడుగు పెట్టక ముందునుంచీ—నాలో దైవభక్తీ — పాప భీతీ — అందరికన్నా ఎక్కువగానే వుండేవి. నిత్యం పూజలతో, వ్రతాలతో—దాన ధర్మాలతో—నిత్యాగ్ని హోత్రం నట్టింట వెలుగుతుంటే— వైభవాన్ని మైమరపింపజేసే అత్తింట్లో అడుగుపెట్టాను. నిజానికి నేను చేయని వ్రతంలేదు. పట్టని నోము లేదు. దైవభక్తే వూపిరనుకునే నేను— వారినీ— వాని భక్తినీ చూసి తన్మయురాల్ని అయేదాన్ని. నా అంత అదృష్టవంతురాలు వుండదని మురిసిపోయేదాన్ని.

...—అన్ని విధాలా వారికి తగిన ఇల్లాల్ననిపించుకున్నాను. నేనూ నమ్ముకున్న దైవం. ఆ శ్రీకృష్ణ పరమాత్మే. ఆయన మమ్మల్నెప్పటికీ అన్యాయం చెయ్యడని మనసారా నమ్మేదాన్ని.

...మా వారి నిష్ఠ మీకు తెలుసు. ఆయన నియమాలు మీకు తెల్సు— పద్దెనిమిది పురాణాలనూ జీర్ణించుకున్న మనిషి. గీతనే నమ్ముకున్న వ్యక్తి... మొదట్లో నా కెంతో అపురూపంగా కన్పించేవారు. ఆయనకి సేవ చేసే అదృష్టం కోసమే నేను పుట్టానేమో అన్పించింది.

.. ఆయన నన్ను భార్యగా చూసేవారు కాదు.

ఐనా ఆయన మామూలు వ్యక్తి కాదు కనుక— ఆయన కనుసన్నల్లో వుండగలగటమే అదృష్టమనుకునేదాన్ని.

కన్నెత్తి పలకరించేవారు కాదు.

ఆయన దైవం సొత్తనుకునేదాన్ని...—

మా మధ్య భార్యాభర్తల సంబంధమనేది ఉండేది కాదు...—

అయినా సరిపెట్టుకునేదాన్ని...'

"ఏనాడూ తులశమ్మ ఇలా మాట్లాట్టం జరగలేదు. గతాన్నీ... గుండెల్లో దాచుకున్న

నిజాన్ని బైట పెట్టటమంటూ ఇదే మొదలు... తనని ఆత్మీయుడిగా--ఆత్మబంధువుగా తులశమ్మ అనుకుంటుందన్న విషయం స్పష్టం.

శ్రీహరిగారి కళ్ళు చెమర్చాయి.

"ఎక్కువగా మాట్లాడటం లేదుకదా...— తప్పుగా ఏమన్నా...—" ఆవిడ కళ్ళు తుడుచుకుంటున్న కొద్దీ నీళ్ళూరుతూనే వున్నాయి.

"లేదమ్మా... వీరరాఘవయ్య నా ప్రాణ స్నేహితుడు. ఆ చనువునూ ఆత్మీయతనూ గుర్తు పెట్టుకుని— మనసు విప్పి చెప్పకుంటున్నావు... స్వంత అన్నలా భావించి...—"

తులశమ్మ కళ్ళు తొణికాయి.

"చెప్పమ్మా...— నీ బాధ తీరుతుందనుకుంటే— చెప్పవల్సిందంతా చెప్పు— ఇందులో తప్పుపట్టటానికేముంది...—"

తులశమ్మ మనసు గతంలోకి తొంగి చూస్తోంది.

"... రామకృష్ణుడు నా కడుపున పడటం కూడా విచిత్రంగా జరిగిపోయింది — ఒక అర్ధరాత్రి నాకు మెలకువవచ్చి చూశాను... ఆయన కృష్ణమందిరంలో. పసిపిల్లవాడిలా భోరున ఏడుస్తున్నారు... తప్పు చేసినట్టు కుమిలిపోతున్నారు... నాకు కొంత అర్ధమైంది... మరి కొంత అర్ధంకాలేదు — అంతా అయోమయంగా అగమ్యగోచరంగా అన్పించింది —

"నన్నెందుకు మోహపరవశుడ్ని చేశావు కృష్ణా... నీ విహారంతో కొట్టుకుపోయే నాకెందుకింత అన్యాయం చేశావు? ఎందుకు నాలో కామాగ్ని రగిలించావు? ఏమాశించి చేశావు? ఎందుకు నన్నింత పతితుడ్ని చేశావు..."

సంధి వచ్చినట్లు ఆయన మాట్లాడిన ప్రతీ మాటనూ వినలేకపోయాను... ఐతే జరిగింది అర్ధమైంది —

... అప్పట్నుంచీ రామకృష్ణుడు పుట్టేదాకా — నావంక కన్నెత్తి చూడలేదు — తన్లో తనే కుమిలిపోయేవారు... ఆయన్ని పిచ్చివాడని ఎవరనుకుంటారోనన్న భయంతో — నా తరపు వాళ్ళనెవర్నీ ఇంటికి రానిచ్చేదాన్నికాదు. ఇరవై నాలుగ్గంటలూ — అయనకి అమర్చిపెట్టడంలోనే గడిపే నాతో కాలక్షేపం అవకే — ఇంట్లోవున్న నిశ్శబ్దాన్ని భరించలేక చాలామంది రావటంకూడా పూర్తిగా మానేశారు.

మీరొక్కరే చాలా తరచుగా వచ్చేవారు... నన్నూ — నా అదృష్టాన్నీ పొగిడేవారు. ఆయనతో పూర్తిగా ఆధ్యాత్మిక చింతనలో మునిగిపోయేవారు..."

క్షణం ఆగింది తులశమ్మ.

కట్టలు తెంచుకుంది ఆవేదన. బడబాగ్నిని దాచుకున్నట్టున్న ఆ గుండెకి ఇన్నాళ్ళకి వోదార్పు కావల్సి వచ్చింది.

గత స్మృతుల్లో పూర్తిగా లీనమైపోయిందావిడ, ప్రస్తుతం ఉన్మాదినిలా సందర్భం లేకుండా మాట్లాడే పిచ్చిదానిలా మాత్రం కన్పిస్తోంది.

ఐనా శ్రీహరిగారికి అర్ధమౌతోంది.

"...ఆరోజు మీకు గుర్తువుండి వుండదు. మీరిద్దరూ — కష్ణ తత్వ గోష్టిలో వున్నారు. అప్పుడే రాముడ్ని నిద్రవుచ్చి మడి కట్టుకున్నాను. పనిపిల్లారోజు ఎందుకో రాలేదు... పసివాడిని గమనిస్తూనే వంట చేస్తున్నాను... మధ్యలో వచ్చి చూస్తే... రాముడు కన్పించలేదు.

వీధి తలుపులు తీసి వున్నాయి — గుండె ఆగినంత పనైంది ... వాడిని పని పిల్లైనా చూడాలి... నేనైనా చూడాలి ... ఇద్దరూ లేకపోతే వాడ్ని చూసే మనిషే లేదు...ఆత్రంగా కృష్ణ మందిరాని కొచ్చాను.

ఆ దృశ్యం... ఆశ్చర్యంతో... ఆనందంతో నన్ను నేనే మర్చిపోయాను. ఎప్పుడూ చూడని సంఘటన అది. అందుకే అలా ప్రతిమలా నిలబడి పోయాను."

అదేమిటో గుర్తుకు తెచ్చుకోటానికి ప్రయత్నిస్తున్నారు శ్రీహరిగారు.

"...ఆ దృశ్యం చూస్తున్నప్పటి ఆనందం నేను జన్మలో మర్చిపోలేను. ఆయన... రాముడ్ని ఎత్తుకుని, గుండెలకి హత్తుకుని మనసారా ముద్దులు పెట్టుకుంటున్నారు ... వాడ్నాయన

## రక్తాక్షి

— అతిత

విక్కులతో ఇక్కట్లతో
అవమ్మలమైతి మేము
రక్తాక్షీ నీ చూపులు
మాపై ప్రసరించ వద్దు !

మాకుగాది హర్షదాయి
మా వేడుక చెడగొట్టకు
కనులు మూసి ధ్యానించుము
మాకు శుభం కలగాలని !

రక్తాక్షీ నువ్వెప్పుడు
రాగసుధా భరితాక్షివి
జనజీవన సుఖదాయివి
అరుణారుణ కిరణ్మయివి !

అలా చూట్టం... అదే కన్నకొడుకులా చూడటం అదే మొదటిసారి. రాముడు సంతోషం పట్ట నట్టు బోసి నవ్వులు నవ్వుతున్నాడు.

''అచ్చం గోపాల కృష్ణుడే కదూ'' అనటం విన్నాను... వారు వెళ్లటంతోనే శాశ్వత మౌతుం దనుకున్న ఆ ఆశా అదృశ్యమైపోయింది.

ఒకసారి తప్పటడుగులు వేస్తూ వాడు కాళ్లకడ్డంగా నిలబడితే— వాడి వంక ముచ్చటగా చూస్తూ అన్నారు.

''— వీడ్ని కృష్ణ చైతన్యుడంతవాడ్ని చెయ్యాలి.''

నా ఆనందంలో నేనుండగా ఆయన వెళ్లి పోయారు.''

ఎన్నో ఏళ్లనాటి అనుభూతుల్ని ... ఆవీ వ్రేళ్లతో లెక్క పెట్టదగ్గవి నిర్వేదంతో ఆవిడ చెప్తుంటే ఆ వాతావరణంలో భయంకర నిశ్శబ్దం పేరుకు పోయింది.

''... మీకు తెల్సుకదూ ఆయన రోజంతా చాలాభాగం కృష్ణ మందిరంలోనే గడిపేవారు. ఆయనకి సమస్తం అమర్చి— పూజ వేళక్కూడా కంటపడకుండా తప్పుకునేదాన్ని. కంటపడినా ఆయన కళ్లల్లో నాకేమీ దొరికేది కాదు. ఆ ఇంటి ఇల్లాలినని— ఆయన బిడ్డకు తల్లిననీ—ఒక ప్రాణిని ఆ ఇంట్లో వున్నాననీ—ఆయన కెప్పుడూ అన్పించేది కాదు... నా బాగోగులు తెలియనట్టే —ఆయన బాగోగుల్నీ ఆయన పట్టించుకునేవారు కాదు—అందుకే— వొంట్లో బావుండకపోయినా, కాన్పుకూడా పుట్టింటికి వెళ్లలేకపోయాను. మా వాళ్లే దగ్గరబంధువొకావిడ్ని నాకు తోడుగా పంపించారు.''

రాముడు పుట్టినా ఆయన్లో మార్పు లేదు. ఆయన దినచర్యలో మార్పులేదు...''

శ్రీహరిగారి కళ్లముందు వీరరాఘవయ్య నిలిచాడు.

... వీరరాఘవయ్యనీ అపురూపంగా పెంచారు తల్లిదండ్రులు. లక్షలకు వారసుడైన అతని కోసం— వెండి ఉయ్యాలలూ— బంగారు చిరుగంటలూ కోరితే చాలు బంగారు కంచాలూ— వెండి పీటలూ—దేన్నైనా తెచ్చివ్వగల స్థోమతా— ప్రేమా— ఆ తల్లిదండ్రులకున్నాయి. అష్టైశ్వర్యాల మధ్యన— గోపాలకృష్ణుడిలా పెరిగాడు వీరరాఘవయ్య. పరిసరాలూ— ఆ ఇంటి వాతావరణం అతన్లో ఆధ్యాత్మికతను విపరీతంగా పెంచివేశాయి. అంత చిన్నతనంలోనే— భగవంతు డంటే జిజ్ఞాసా— భక్తిమీద మమకారం...గంటల తరబడి కృష్ణమందిరంలోనే గడపటం పెద్ద వాళ్లలా కృష్ణతత్వ విచారణలూ — పాలుపంచు కోటం అందరికీ ఆశ్చర్యాన్ని కల్గించేది. అతన్లోని భక్తిభావానికి తల్లదండ్రులు నారు పోసి— నీరు పోసి పెంచారు.

... కానీ— వాళ్ళు కొడుకును తాము హించిన స్థితిలో చూడలేక పోయారు. కారణం— నెలల తేడాతో వాళ్ళిద్దరూ – శాశ్వతంగా దూరమైపోయారు. గంపెడాస్థీ— ఆస్థికత్వం తప్ప— ఇతరం ఎరుగని అమాయకుడు వీరరాఘవయ్య. ఎక్కడలేని బంధువులూ — అవకాశాన్ని వెదుక్కుంటూ రాబందుల్లా వచ్చి పడ్డారు. తట్టుకోలేకపోయాడు. ఆ స్థితిలో దైవంలా ఆదుకున్నాడు మేనమామ అనంత రామయ్య.

ఆస్థి రక్షణ భారాన్ని నెత్తిన వేసుకున్నాడు. వీరరాఘవయ్య ఆస్థికత్వాన్ని అఖండ జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంలోనూ—తన వార్ధక్యాన్ని దృష్టిలో పెట్టుకునీ—సమర్ధతగల తులశమ్మని— ఏరికోరి— వీరరాఘవయ్యకు కట్టబెట్టి నిశ్చింతగా బాధ్యతమూ— బంధాల్నీ వొదిలించుకున్నాడు.

మేనమామ మీదున్న కృతజ్ఞతా— వత్తిడీ, పరిస్థితులూ— నిస్సహాయస్థితీ— వీరరాఘవయ్యని పెళ్ళికి వొప్పుకునేలా చేసింది.

తులశమ్మను విధిగా చేసుకున్నందుకు — విధికే వదిలిపెట్టేశాడు.

''... ఎప్పుడూ లేనిది... ఎందుకో... ఇలా చెప్పుకోవాలన్పిస్తోంది...'' తులశమ్మని జాలిగా చూశారు శ్రీహరిగారు.

తనకన్నా ఎంతో చిన్నది. ఐనా అనుభవాలతో బాధలతో తలపండి వృద్ధురాల్లా కన్పిస్తోంది. మానసికంగా ఎంతో కృంగిపోయిన ఆవిడ ఇంకే వత్తిడినీ తట్టుకునే స్థితిలో లేదు. ఇంత కాలంగా ఆ ఇంటికి పెద్ద దిక్కు తన బాధల్ని మరొకరితో చెప్పుకోలేని పరిస్థితులు. ఈనాడు తట్టుకోలేని ఆవిడ మనస్థాపాన్ని తీర్చగల స్థోమత తనకు లేకపోయినా— కనీసం చెప్పుకోగల అర్హతైనా ఆవిడ దృష్టిలో తనకుంది ...

''చెప్పమ్మా ... నన్ను పరాయివాడుగా చూడద్దు. మీ కుటుంబం కోసం నేనేదైనా చెయ్యగలిగితే.. చెయ్యగలిగినంత చేస్తాను.

దృఢంగా అన్నాడు.

నడిసముద్రంలో గడ్డిపోచ దొరికినట్టైంది ఆవిడకి అనుకున్న అనుకోకపోయినా. కష్టాల్లో వున్నాననుకునే వాళ్లకి కొండంత ధైర్యంచెప్ప గల ఆత్మీయులుంటే చాలు.

రాముడి పుటకకు...ఏ, సంఘటన ఎటువంటి పరిస్థితుల్లో జరిగిందో... ఏం జరిగితే— అతి ఘోరమని — చెయ్యరాని నేరమని ఆయన ఇప్పటి దాకా బాధ పడుతూ వచ్చారో . కనీసం నా మొహం కుడా చూడటం మానేశారో—సరిగ్గా అటువంటి సంఘటనే... జరిగిపోయింది...—

అయితే ఆయన నాలో కృష్ణుడ్నిచూశారు— చిత్రంగా ఆయనే రాధిక అనుకుని...''

రాధామాధవ తత్వం పూర్తిగా అర్ధం చేసుకున్న శ్రీహరి గారికి పై సంఘటన వింతన్పించ లేదు.

ఎప్పట్నుంచి కూర్చున్నాడో— కృష్ణారావు నెవరూ గమనించలేదు.



# ముక్తకాలు

## దిలావర్

వారి నవ్వులే పట్టు ! వారి నడకలే పట్టు !
వారి వాలు చూపులే కలల కుచ్చుపట్టు !
ఇన్ని పట్లూ తెలిసిన ఆడవారికి
పట్టుచీరల పేరు చెబితే మాత్రం
అన్నీ మరచి పడతారు ఉడుం పట్టు !






కిలో బియ్యం రెండ్రూపాయల పథకం సక్సెస్ !
అందరికీ దొరికి చావక, నాల్రూపాయలక్కొంటే
అది మీ వీక్‌నెస్ !
ఔట్ పేషెంటుగా వీళ్లేదు – ఎక్కువాగ్దానాల బెడ్
ఆపరేషన్ సక్సెస్; పేషెంటీజ్ డెడ్ !

కిరోసిన్ క్యూ కొండవీటి చాంతాడని ఎందుకు కంగారు ?
'నో స్టాక్' బోర్డు కట్టి పుణ్యం కట్టుకుంటాడులే షావుకారు
లేకుంటే – యీ దేశంలో వుత్పత్తయ్యే కిర్సనాయిలంతా
కట్నం తేని ఆడబడుచులమీద పోసే కదా – తగలెడాతారు ?






వాగ్దానాల రొద చేస్తూ రాజకీయం దోమ మాటు వేసింది !
గుర్రుపెడుతున్న జాతిని అదను చూచి కాటు వేసింది !
ఇప్పుడు వులికిపడి లేచి కూచుంటే ఏముంది ?
ప్రజాస్వామ్యం బోదకాలై వాచింది !

పెన్ను పట్టాను మానవతా సందేశం వినిపించేందుకు
రసరాట్టుల హృదయాలు స్పందించేందుకు
అవసరమైతే గన్నుకూడా పడతాను
కానీ కాదు సుమా రక్తం చిందించేందుకు
నా జాతికి ఆలోచనల బులెట్లు అందించేందుకు !



మరో శ్రోత లక్ష్మి– తన అనుభవాలను నెమరు వేసుకుంటున్నట్టుంది.

"వాళ్లు తెల్సాక– ఆయన పడిన యాతనని వర్ణించలేను. పిచ్చిగా గోడకితలకొట్టుకునేవారు. జుట్టు పీక్కుని పిచ్చిగా ఏడ్చేవారు– 'నేను మామూలుగా ప్రవర్తించానా ? నీకు



# కర్మయోగి

మళ్లీ ద్రోహం చేశానా ?' కృష్ణ మందిరంలో కూర్చుని ఇరవైనాలుగ్గంటలు ఇదే పాట, ఇదే ద్యాస–ఆ తరువాత–ఏ కొద్ది రోజులు ఇంట్లో వున్నారో–'

వీరరాఘవయ్య ఇప్పుడే వెళ్ళిపోయినట్టు– తనకంటూ– అండా, దిక్కూ– ఏగిరిలేనట్టు– కుమిలిపోతున్న ఆవిడ్ని వోదార్చగల ధైర్యం ఎవరిలోనూ లేదు.

కొంతసేపటికి తులశమ్మే స్థిమిత పడింది.

ఎదురుగా–శ్రీహరిగారు; కృష్ణ–లక్ష్మి. సిగ్గుపడిందావిడ.

ఆవిడ బాధ అర్థమై, కృష్ణ, శ్రీహరి గారు ఒకర్నొకరు చూసుకున్నారు.

"రాఘవ నీకెంతో సహాయం చేశాడమ్మా. కానీ– వాడికి నేనే విధంగానూ కృతజ్ఞతను చెప్పుకోలేక పోయాను–ఏ రకంగానైనా నా వల్ల మీకు ఉపకారమంటూ జరిగితే–"

శ్రీహరిగారి వంక – నిర్భయంగా చూసిందావిడ.

"ఆ ధైర్యం నాకు చాలండీ ... అందరూ ఆయన్ని ఏవగించుకున్నా – బాధ్యతా రహితంగా ప్రవర్తించారని అసహ్యించుకున్నా . . ఒంటరిగానే పరిస్థితుల్ని ఎదుర్కోవాలనుకున్నాను. ఆయన ఆస్తిపాస్తుల్లో – పూచిక పుల్లకూడా–అవకాశం కోసం ఎదురు చూసే బంధువులకి అందకూడదనుకున్నా – పిల్లల్ని ప్రయోజకుల్ని చేసి – పెళ్ళీ పేరంటం చేసి కళ్ళముందు వాళ్ళ పిల్లా పాపలతో వుంటే – పడ్డ శ్రమంతా మర్చిపోవాలనుకున్నాను .. రామకృష్ణులమీదే పంచప్రాణాలూ పెట్టుకున్నాను .

చివరికేమైందో .. వాళ్ళెంత పెద్దవాళ్ళయారో మీరే చూశారుగా ... " కళ్ళ ముందే తల్లి .. తనవల్ల కూడా ... కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది . కృష్ణారావు కనుకొలకల్లో నీళ్ళు నిలిచాయి.

"పంచుకున్నది నా రక్తం మటుకే ..కానీ ఇద్దర్లో వున్నవి ఆయన భావాలే ... ఆ భక్తే."

"నువ్వు నూరిపోసింది కృష్ణ భక్తినే కదమ్మా – "

తల్లి ఏమంటుందో తెలుసు. పూర్తిగా విరక్తితో వున్న ఆవిడ ఏమంటుందో తెల్సు . . అందుకే తడబడుతూనే అన్నాడు కృష్ణారావు.

తులసమ్మ పేలవంగా నవ్వింది.

"అవును కృష్ణ .. నేను నూరిపోసిందీ– కృష్ణ భక్తినే. ఆ దైన్యంలో ఆ ఒంటరితనంలో ఆ కృష్ణుడే నన్ను ఆదుకుంటాడన్పించింది. గీతే కొండంత బలాన్నిచ్చేది. నాకెవ్వరూ లేరన్న భావాన్ని దూరం చేసేది. అందుకే–రాత్రనకా–పగలనకా – భగవద్గీత చదువుతూ వుండిపోయే దాన్ని ... నాతో సమానంగా – మీరూ వింటూ కూర్చునేవారు .. ఆ భగవంతుడు నాకు న్యాయం చేస్తాడనుకుని పొరబడ్డానేమో ... "

శ్రీహరిగారు కొద్దిగా నొచ్చుకున్నారు.

"అప్పుడు కాదమ్మా ... ఇప్పుడే నువ్వు నిజంగా పొరబడుతున్నావేమో ... "

"లేదు. పొరబడలేదు ... అవలే ఆ తాన్లో గుడ్డలు వీళ్ళు. అందర్లా మామూలుగా పెంచకుండా – నేనూ భక్తిని నూరిపోశాను. ఏ

# ప్రెస్టీజ్

# ప్రెషర్ పాన్

## దీనితో వండిన భోజనం తింటే ఎంత సంతృప్తికలుగుతుందో దీనితో వండడం కూడా అంత సంతృప్తికరంగాను వుంటుంది!



**వేపుడు**



**హెచ్చు వేపుడు**



**సాచ్**



**ప్రెషర్‌కుక్**



బిర్యానీని చాకచక్యంతో వండండి. లేదా గ్రుడ్డును వేగంగా వేపండి. లేదా పూరీని చక్కగా పొంగించండి. మరి కూరను చకచక తయారుచేయండి. అన్నీ నిమిషాలమీద. ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ అంతటి బహుళ ప్రయోజనకారి అన్నమాట అది అంత వాటంగా, వసతిగా వుంటుంది. దీనిలో మీరు వేపుడు, హెచ్చు వేపుడు, దోరవేపుడు మరియు ప్రెషర్ కుకింగ్ చేయవచ్చు.

ఒక్క ప్రెస్టీజ్ ప్రెషర్ పాన్ మాత్రమే నూటికి నూరు పాళ్ళ భద్రతను సమకూర్చగల అద్వితీయమైన గాస్కెట్ రిలీక్ సిస్టంను కలిగియున్నది.

ఇప్పటికే ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్ మీవద్ద వుండివుంటే, మూత లేకుండా దీనిని కొని ఎక్కువగా సొమ్ము ఆదాచేసుకోండి. లేదా సొంత మూత కలదానిని కొనండి ఈ ప్రెషర్ పాన్ మీకోసమే మరి.

**Prestige**
**PRESSURE**
**PAN**

TTK తయారి.

MAA(S) PP 1B TEL 84

మాత్రం మామూలు పిల్లలుగా పెంచలేదు నేను. దైవభక్తి, పాపభీతీ పెరిగి. మరో రకంగా మారతారనుకొన్నానేగాని ..

ఇలా ... సన్యాసులై — నా కడుపులో చిచ్చు పెడతారనుకోలేదు ... ''

రామకృష్ణయ్య గర్భశోకం కలిగించాడు.

కృష్ణయ్య మనశ్శాంతిని దూరం చేస్తున్నాడు...—

''చూడమ్మా... నువ్వెందర్లాంటిదానివా. కాస్త ధైర్యం తెచ్చుకోవాలి...—''

ఇంకేమనాలో శ్రీహరి గారికి తోచలేదు.

''నే నందర్లాంటి దాన్ని కానా ?— ఏం ? నాకేమైనా ప్రత్యేకత వుందా ? ధైర్యం తెచ్చుకు బ్రతకటానికి నాకేం మిగిలిందండీ... నావాళ్ళేం మిగిల్చారు ?... మీరే చెప్పండి...- మహాను భావుడు అర్జునుడు.. — తన కొడుకు కోసం సామాన్యుడిలా కుమిలిపోలేదా ?... ముక్కు పచ్చలారని అభిమన్యుడు అన్యాయంగా పడిపోతే— ఆ తండ్రి దుఃఖాన్ని ఆపుకోలేక అగ్ని ప్రవేశం కూడా చేస్తానన్నాడే...—సర్వం తెల్సిన పాండవులే ఆ పసివాడికోసం మతులు పోగొట్టుకున్నారే...—

అటువంటిది... నే నెంత ?...

నా బ్రతుకెంత ?...—''

తులశమ్మ ఆయాసంతో రొప్పుతుంటే లక్ష్మి చటుక్కున పట్టుకుంది.

''అత్తయ్యా... డాక్టరేం చెప్పారు ?'' మీరేం చేస్తున్నారు ?—'' మందలిస్తూనే మంచంమీద పడుకోబెట్టబోయింది.

''ఎక్కువ మాట్లాడద్దన్నారు...— నేనిప్పు డెక్కువగా మాట్లాడానా లక్ష్మి—''

''చాలా—''

ముక్తసరిగా అంటున్న కోడలివంక దీనంగా చూసిందావిడ.

''నే నెప్పుడైనా ఇంత ఎక్కువగా మాట్లాడానా ?—''

''లేదత్తయ్యా...— ఎప్పుడూ లేంది ఇప్పుడుమటు కెందుకంటున్నాను. అసలే వొంట్లో సరిగ్గాలేదు. మీలో మీరు లోపల్లోపలే కుళ్ళిపోతూ చివరికీ స్థితికి వచ్చారు. ఎందుకు? ఎవరికోసము ? మీ మాటలు ఎవరు పట్టించు కున్నారని ?— మీ బాధ ఇక్కడెవరికి అర్థమౌ తుందని ?.. అత్తయ్యా... ఈ ఇంట్లో నేమ బ్రతుకుతోందే మీ కోసం... మీ రున్నారనే... ఈ మాత్రం బ్రతగ్గలుగుతున్నాను...

...నన్ను అన్యాయం చెయ్యాలనుకున్నారా? మీరూ నన్నన్యాయం చేస్తారా అత్తయ్యా'' కృష్ణారావు చలించాడు.

**(ఇంకా వుంది)**

# అంతరించిన ఆనంద సంస్థ

తెలుగు గ్రంధాల ముద్రణ, తెలుగు లిపిలో సంస్కృత గ్రంధాల ముద్రణ గత శతాబ్ది మధ్యభాగంలోనే ప్రారంభమయింది. దానికి చెన్నపట్టణమే కేంద్రంగా ఉండినది. గ్రంధ ముద్రాపకులలోనూ, ప్రకాశకులలోనూ వావిళ్ల వారే ప్రముఖ స్థానాన్ని ఆక్రమించి ఉండేవారు. పుస్తక వ్యాపారం లాభసాటిగా ఉండగలదనే అభిప్రాయంతో కొందరు వైశ్యప్రముఖులు చవక రకం పీచుకాగితాల పయి పుస్తకాలు అచ్చు వేయించి తక్కువ ధరలకు అమ్ముతూ కొంత లాభం గడించేవారు. అట్టి వారిలో భువనగిరి రంగయ్యసెట్టిగారు వంకాయల కృష్ణస్వామి సెట్టిగారు మున్నగువారు పేరు పడ్డారు. క్రమక్రమంగా ముద్రణ వ్యవస్థ మెరుగు పడడంతో వైశ్యోత్తములు, శ్రీమంతులు అయిన వేమూరివారు పెద్ద అచ్చు యంత్రాలను స్థాపించి, మేలురకం కాగితంపై చక్కగా గ్రంధ ముద్రణ సాగించారు. వారే ఆనంద ముద్రణాలయ స్థాపకులు. వారి అచ్చుయంత్రాలు ఆవిరి మూలంగా పనిచెయ్యడంవల్ల ఆ ముద్రణాలయానికి "ఆనంద స్టీమ్ ప్రెస్" అనే పేరు వుండేది. క్రమంగా అచ్చు యంత్రాలు విద్యుచ్ఛక్తి వల్ల నడవడం వల్ల "స్టీమ్" పదం తొలగించబడి "ఆనంద ముద్రణాలయం" అనే పేరే వాడుకలోనికి వచ్చింది. గత శతాబ్ది చివరి పాదంలో ప్రారంభమైన యీ సంస్థ యీ శతాబ్ది మధ్యభాగం వరకూ చక్కగా పని చేసి, చేతులు మారి, నిర్వాహకుల అశ్రద్ధవల్ల నామ మాత్రావశిష్టం కావడం మిక్కిలి దురదృష్టకరం.

ఆనంద ముద్రణాలయం పెక్కు భాషలలో ఉత్తమ గ్రంధ ప్రకటనకు పేరు పడింది. అంతే కాక. పేరుపడిన ముద్రణాలయాలలో అగ్ర స్థానాన్ని అలంకరించినది. ముద్రణ ఎంతో చక్కగా ఉన్నందున పెద్దపెద్ద సంస్థలు తమ అచ్చు పనులను ఆనంద ప్రెస్సునకే అప్పగించేవి.

మనకు స్వాతంత్ర్యం రాకపూర్వం రైల్వేలను వేర్వేరు కంపెనీలే నడుపుతూ వుండేవి. మద్రాసు నుండి వాల్తేరు వరకూ, అట్లే బెంగళూరు వరకూ, వాయువ్య మార్గంలో రాయచూరు వరకూ, తూర్పు తీరంలోని బందరు నుంచి పడమటి తీరంలోని మార్మగోవా వరకూ ఎం. ఎస్. ఎం. రైల్వే (మదరాస్ అండ్ సదరన్ మరాటా) కంపెనీ, మిగిలిన దక్షిణ దేశంలో ఎస్. ఐ. ఆర్. (సౌతిండియన్ రైల్వే) కంపెనీ రైలుబండ్లను నడుపుతూ వుండేవి. వాటికి అప్పుడు సొంతంగా ప్రెస్సులు లేవు. హో అండ్‌కో వారి ప్రీమియర్ ప్రెస్‌లో ఎస్. ఐ. ఆర్. కంపెనీకి కావలసిన అచ్చు పనులు జరుగగా, ఆనంద ప్రెస్‌లో ఎం. ఎస్. అచ్చు పనులు జరిగేవి. మద్రాసు యూనివర్సిటీ కూడా తన అచ్చు పనులను ఆనంద ప్రెస్సుననే అప్పగించేది, దీనిని బట్టే దాని శ్రేష్ఠతను గమనించవచ్చును.

అచ్చుపనులలో ప్రీమియర్ ప్రెస్సుతో పోటీపడుతున్న యీ సంస్థ గ్రంధ ప్రకటనలో వావిళ్లవారితో పోటీపడుతూ ఉత్తమ గ్రంథాలను ముచ్చటగా ముద్రించి ప్రకటిస్తూ ఉండేది. కొమాండూరి — అనంతాచార్యులు గారి విపుల వ్యాఖ్యాతోను చరిత్రను, తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య (దేవరాజసుధి) గారి అమూల్య వ్యాఖ్యలతో వసు చరిత్రను ప్రకటించినది. "ఆనంద" వారి వసుచరిత్ర వ్యాఖ్య అత్యుత్తమమైనది. తంజనగరం వారు చాలాకాలం ఆనంద ప్రెస్సులో ప్రధాన పండితులుగా పని చేశారు. ఆయన గొప్ప సంస్కృతాంధ్ర విద్వాంసులు. ఆయన వాల్మీకి రామాయణాన్ని యథామూలంగా తెలుగులో వచనంగా వ్రాయగా, ఆనంద ప్రెస్సు వారే కొన్ని సంపుటాలలో ప్రకటించారు. ఈ శతాబ్దిలో వచ్చిన వచన రామాయణాలలో అదే మొదటిదని అనుకుంటాను. సుప్రసిద్ధ విద్వాంసులు కేతవరపు — వేంకటశాస్త్రిగారి వ్యాఖ్యతో శృంగార నైషధం, విపుల వ్యాఖ్యతో రాఘవ పాండవీయం, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు పరిష్కరించిన పాపరాజుగారి ఉత్తర రామాయణం, సవ్యాఖ్యగా సీతారామాంజనేయం, విశ్వ గుణాదర్శానికి పద్యానువాదం "ఆనంద" వారి ప్రచురణలలో కొన్ని, ఆనాడు వీరు ప్రకటించిన పోతన భాగవతమే మిక్కిలి వ్యాప్తిలో ఉండినది. రామాయణంతోపాటు భారత, భాగవత వచన రచనకు ప్రోత్సహిస్తూ కొన్ని సంపుటాలు ప్రకటించినట్లు కూడా తెలుస్తున్నది.

ఆనంద ప్రెస్సు 1906వ సంవత్సరంలో సుప్రసిద్ధ విద్వాంసులు కుమార తాతాచార్యుల వారు భవభూతి ఉత్తర రామ చరిత్ర నాటకానికి వ్రాసిన విపుల వ్యాఖ్యను మూలంతోసహా తెలుగు లిపిలోనే ముద్రించి ప్రకటించినది. ఆ నాటకానికి గల వ్యాఖ్యలన్నింటిలోనూ ఈ వ్యాఖ్యయే అత్యుత్తమమైనదనే ప్రఖ్యాతి లభించినది.

అన్నింటికంటె ముఖ్యమైనది వీరి ఆంధ్ర భారత ప్రకటన. తేవప్పెరుమాళ్లయ్యగారు సంస్కరించిన వీరి భారతమే ప్రామాణికమని పండితులందరూ ప్రశంసించేవారు.

వావిళ్లవారు సంస్కృతాంధ్రాలలోని ఉత్తమ గ్రంథాలనేకాక, వైదిక వాఙ్మయాన్ని, ఇతర గ్రంథాలనూ అసంఖ్యాకంగా ప్రకటించారు. వారితో పోటీ పడుతున్నట్లున్న ఆనంద ప్రెస్సును చూచి ఒకప్పుడు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు "ఆనంద ప్రెస్సువారు వావిళ్లవారిని మించిపోతారేమో! అనే సందేహం కలిగింది." అని వీరిని అభినందించడం జరిగింది.

వీరు మొదట్లో తెలుగు లిపిలో గ్రంధ ముద్రణ ప్రారంభించినా, తర్వాత ఇంగ్లీషులోను, తర్వాత తమిళంలోనూ, కన్నడంలోనూ, దేవనాగిరి లిపిలోనూ గ్రంధాలు ప్రకటించేవారు. అన్ని లిపులలోనూ అచ్చు కూర్చగల కంపోజిటర్లు



## రుచులలో తేడా వున్నప్పటికీ ప్రజల అభిరుచి ఒక్కటే .... మరి ఆశ్చర్యంగా లేదూ ?



**పారో బిస్కట్స్** : సువాసన వస్తువుల మనుగడకే జీవం పోస్తాయి. ఉత్తరాదిలోని సర్దాజీని అడగండి. కరకరమని నమలాలని అనిపించినప్పుడల్లా ఆయన గుప్పెడు **'పారో స్వీటు సిక్సర్స్'** : నోటిలో వేసుకుంటాడు. మెలిదిరిగిన మీసాలు చాటునుంచి 'బహత్ బడియాన్' అంటూ వాటి రుచిని కళ్లతోనే మెచ్చుకుంటాడు.

**'Bahut Badiyan'**

గుజరాతి భాయి 'దోక్లా' తిని తిని విసుగెత్తి, మార్పుకోసం **'పారో ఫైన్ ఆపిల్, ఆరంజ్ క్రీమ్స్'** నోటినిండా కుక్కుకొని 'సారో చి' అంటూ లొట్టలు వేస్తాడు.

**'Nalla Iruku'**



దక్షిణాది తమిళమామి, ప్లేటునిండా **'పారో డిస్కో క్రాకర్స్'** అల్పాహారంగా సేవిస్తూ అబ్బ 'మురకుల్' కంటే "నల్లాయిర్కు" అంటూ మురిసిపోతుంది.

**'Saroo Che'**

**'పారోస్ గ్లూకోజ్'** బిస్కట్సు పుష్టినిస్తాయి. బెంగాలి సోదరులు ఛాయ్‌లో నంచుకొని తింటానికి మిక్కిలి యిష్టపడతారు.




ఆంధ్రులు ప్రీతికరమైన **'సారో డిస్కోసాల్ట్'** బిస్కెట్స్ బాగా వుంది అని మెచ్చు కుంటూ తింటారు.



**'Khoob Bhalo'**

**'Superb'**



**'Baga Undi'**



**PARO** Rediscover Biscuit — Magic with PARO

MEGHNA-2683

## మమతానురాగాలు సంకెళ్ళు కావు

మౌనంలో కూర్చున్నప్పుడు
నాకే వినిపించే ప్రళయఘోష, నాకే కనిపించే నా చిద్రూప విరాట్ స్వరూపం
అణువునుండి విశ్వచ్ఛేదనా శక్తి ఉద్భవించినట్టు
మనిషినుండి చిమ్ముకొచ్చే రసోజస్సు — పరివ్యాప్తమౌతున్నది ఆత్మ
చేరుకోవాల్సిన గమ్యాల పథకాలను గుండె బట్టీలో తయారించి
నా ప్రపంచంనుండి ప్రతి ఉదయం ఈ రోడ్డుపైకి అడుగు పెడ్తున్నప్పుడు
ఒక్క దీపంతో లక్షల దీపాలను వెలిగించాల్సిన బాధ్యత
నన్ను తల్లి అమృతహస్తంలా ఆశీర్వదిస్తూంటుంది —
వేయబోయే ప్రతి అడుగూ నాటుకునే బాణంలా ఖచ్చితమై
ఎదిరించి నినదిస్తే...,
ముందు బాధ్యత... ధర్మం కర్తవ్యం — తర్వాత హక్కు
ప్రశ్నను ముందు నీకోసం నీవే వేసుకో
తర్వాత ఎదుటివాణ్ణి ప్రశ్నించు
సుఖాకాంక్ష బాహువుల్లోనుండి విముక్తమై ఈ ముళ్ళ బాటలోకి,
అడవుల్లోకి,
నిరాధారతతో వీక్షించే కన్నుల్లోకి రా,
పాదానికి ముల్లు గుచ్చుకుంటే — గుండె ఎంత విలపిస్తుందో
విశ్వశరీరంలో అంగాలమైన మనం ఒకరికోసం ఒకరం ప్రతిస్పందించలేమా
మమతలు, అనురాగాలు తప్పకుండా ఊపిరై బ్రతికించే స్మృతులే
కాని వాటిని సంకెళ్ళను చేసుకుంటే
జడమై, స్తబ్దమైపోతావు —
జీవితాన్ని 'ఫిల్టర్' చేసుకుంటూ
ప్రతి ఒక్కొక్క ఘటనను జీవితాభరణంలో మెరిసే రాయిలా దాచుకుని
నెమరువేసుకోవాలి ఇంధనాన్ని కాల్చుకుని జీవి స్వయంచాలకం కావడానికి
పక్షిని చూస్తే నీకానందం, అందమైన జంతువుని చూస్తే నీకానందం,
దేవుణ్ణి చూచినా ఆనందమే
దేన్ని ఆధారం చేసుకుని రూపుదిద్దుకుంటున్నదీ ఆనందరేఖ
విశ్లేషణ — పరిశోధన... క్రోడీకరణ... సిద్ధాంతీకరణ
అప్పుడుద్భవించే నిర్మాణంలో
రా... నువ్వూ నేనూ ఒక్కో ఇటుక ఔదాం —

— రామా చంద్రమౌళి

## అంతరించిన ఆనంద సంస్థ

ఆ ప్రెస్సులో ఉండేవారు. కన్నడ భాషలోనూ, తమిళ భాషలోనూ రామాయణాలను రచింపజేసి ప్రకటించారు. ఆనంద ముద్రణాలయపు కన్నడ రామాయణం అప్పట్లో మిక్కిలి ప్రఖ్యాతమై ఉండేది.

వేమూరి వంశపు వైశ్యోత్తములు శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన వారు. వారికి తమ గురువుల యెడల భక్తితాత్పర్యాలు ఎక్కువ. ఆ గురువుల ప్రోత్సాహం వల్లనేమో వీరు చాలా విశిష్టాద్వైత మత గ్రంథాలను ప్రకటించారు. ఆ మతస్థులకు అత్యంత ప్రధానాలైన తిరువాయ్‌మొళ్లి, ముదలాయిరం, ఇయ్యప్పా మున్నగు గ్రంథాలు తెలుగు లిపిలో ప్రచురించారు. మేలు కాగితంపై చక్కగా ముద్రించబడి, కాలికో బైండు చెయ్యబడిన ఆ గ్రంథాలు తక్కువ ధరకే లభించేవి. తెలుగుదేశంలోని విశిష్టాద్వైతులు తమిళ లిపిలో ఉన్న గ్రంథాలను చదవలేరు కాబట్టి వారు ఈ గ్రంథాలనే కొనేవారు. "ఆనంద" వారు ప్రకటించకపోతే యివి తెలుగు లిపిలో లభ్యమయేవి కావు. ఇలా తమిళ గ్రంథాలను ప్రకటించినట్లే ముద్రణాలయాధినేతలు విశిష్టాద్వైత మతాచార్యులందరి జీవితచరిత్రలూ తెలుగులో పద్యకావ్యంగా రచించబడిన "ఆచార్య సూక్తిముక్తావళి"ని, సంస్కృతంలో ఉన్న స్తోత్రాలనూ బయటికి తెచ్చారు. ఆ స్తోత్రాలు స్తోత్రార్ణవ నామంతో మూడు భాగాలుగా వచ్చాయి. అవి బాగా అమ్ముడుపోయాయి.

ముద్రణాలయాధిపతులు దేవనాగరి లిపిలో శ్రీమద్రామానుజుల భగవద్గీతాభాష్యాన్ని, ప్రాకృత భాషలో ఉన్న అచ్యుత శతకాన్ని సవ్యాఖ్యానంగానూ ప్రకటించారు. ఇతరుల గ్రంథాలను తమ ముద్రణాలయంలో చక్కని దేవనాగరి లిపిలో ముద్రించి ఇచ్చేవారు. అప్పట్లో మద్రాసులో దేవనాగరి లిపిలో అచ్చు సౌకర్యం గల అచ్చుకూటం ఇది ఒక్కటే అని చెప్పినా చెప్పవచ్చునేమో !

కాలం మారడంతోపాటు యాజమాన్యం చేతులు మారుతూవచ్చాయి. వేర్వేరు వ్యక్తుల దృక్పథాలుకూడా విభిన్నంగా ఉండడం సహజం. ఇతరులకు చేసే అచ్చు పనులవల్ల లాభం రావడం, తమ గ్రంథముద్రణవల్ల అంత లాభం రాకపోవడం అధినేతలు గ్రహించారు. గ్రంథముద్రణపట్ల ఆసక్తి తగ్గింది. పాఠశాలలకు ఉపయోగించే పుస్తకాలను ప్రకటిస్తే లాభం రావచ్చుననే ఆలోచన వారికి తట్టింది. మొదట, వాచక పుస్తకాలను ప్రకటించాలని సంకల్పించారు

అంతవరకూ పాఠశాలల్లో చదివే పిల్లలకు తగిన వాచకాలను ప్రచురించే సంస్థలు మద్రాసులో రెండు మాత్రం ఉండేవి. అవి మాక్మిలన్ కంపెనీ, లాంగ్‌మన్స్ గ్రీన్ కంపెనీ అనేవి. రెండూ పాశ్చాత్యుల సంస్థలే ! మాక్మిలన్ కంపెనీవారి వాచకాలు మార్సడన్ రీడర్లుగా పేరుపొందాయి. విద్యాశాఖలో ఉన్నతోద్యోగి ఈ మార్సడన్ దొర, రావుబహద్దరు కందుకూరి—వీరేశలింగం పంతులు గార్లు వాటి సంయుక్త రచయితలు. చెన్న రాజధానిలోని తెలుగుబడులు అన్నిటిలోనూ అవే పాఠ్యపుస్తకాలు. ఆ కంపెనీకి వాటివల్ల ఎక్కువ లాభం రావడంచూచి లాంగ్‌మన్స్ గ్రీన్ కంపెనీ వారు కూడా వాచకాలు ప్రచురించడం ప్రారంభించారు. వానిని ఎవ్వరూ వ్రాసినదీ ముఖపత్రంలో తెలుపబడలేదు. వాటికి ఎక్కువ ప్రచారం కలగలేదు. అట్టి సమయంలోనే ఆనంద ముద్రణాలయాధిపతులు "ఆనంద వాచకము"ల ప్రచురణ ప్రారంభించారు. ఆ వాచకాలు "ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో" అనే ప్రచురణ సంస్థ పక్షాన వెలువడేవి అది వారి సంస్థయే. "ఆర్. వెంకటేశ్వర్" అనే వ్యక్తి పేర ఆ సంస్థ ఏర్పడినదని నేను తొలుత అనుకున్నాను. కాని, అలాటివ్యక్తికి ఆ సంస్థతో సంబంధంలేదనీ, ముద్రణాధిపతులే ఏదో పేరు పెట్టాలని, ఆ పేరు పెట్టారనీ తెలిసింది. యజమానులు పత్రాలపై సంతకాలు చేసేటప్పుడు "ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో" అనే వ్రాసేవారు. తమపేరు వాడలేదు.

ఆనందవాచకాల రచనకు ఆ సంస్థవారు తగినవారినే ఎన్నుకున్నారు. గొప్ప విద్యావేత్తలు, క్రమశిక్షణలో అందెవేసినచేయి, ఆదర్శప్రాయో

# అమృతాంజన్ లిమిటెడ్

## 80 సంవత్సరాల పైగా గృహౌషధాలు తయారుచేస్తున్నారు!

అమృతాంజనం బాధానివారిణి
తలనొప్పి, ఒళ్ళునొప్పులు, బెణుకులు, జలుబు, దగ్గు, కండరాల నొప్పులకు.

అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
పసిబిడ్డల అజీర్ణానికి, పళ్ళు వచ్చేటప్పుడు కలిగే బాధలకు.

- అమృతాంజన్ డెర్మల్ ఆయింట్ మెంట్
  తామర, తీట, గజ్జి వగైరాలకు.
- అమృతాంజన్ సిటోమిక్స్
  దగ్గునుంచి వెంటనే ఉపశమనమునకు కాఫ్ మిక్చర్
- క్వాస్ మింట్ బిళ్లలు
  నోటినీ గొంతుకునీ శుభ్రంగా ఉంచేందుకు

- అమృతాంజన్ ఇన్హేలర్
  జలుబుచేసి ముక్కుదిబ్బడ, తుమ్ములు వగైరాలకు.

అనోలియమ్—కోల్డ్ రబ్
దగ్గు జలుబులను పారద్రోలే అమోఘమైన ఒక కొత్త శక్తి.

- శాలోఫెన్—బాధానివారిణి మాత్రలు
  తలనొప్పి, ఫ్లూ, ఒళ్ళు నొప్పులకు.
- అమృతాంజన్ కాస్టర్ ఆయిల్
  శుద్ధిచేసిన, వాసనలేని స్వచ్ఛమైన ఆముదం.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు-4

....ఇండియాలోను, ఇతర దేశాలలోను పేరుపొందినది.














భారతదేశంలో ఒక
ఫానుకి అరుగుదల గురించి శ్రద్ధ తీసుకునే ప్రీ-లోడెడ్
డబుల్-బాల్ బేరింగులు వున్నాయి.

# దాని పేరు ఖేతాన్

ఖేతాన్* ఫాన్‌లో చేరిన చిన్న చిన్న విషయాలే దాని ప్రత్యేకతకి కారణాలు ప్రీ-లోడింగ్ విధానంతో వున్న గ్రీస్-పాక్ చేసిన డబుల్-బాల్ బేరింగ్‌లు అరుగుదలని, శబ్దాన్ని అరికట్టి ఫాన్ దీర్ఘకాలం మన్నడానికి తోడ్పడతాయి

సెంట్రీఫ్యూగల్ విధానంతో డై-కాస్ట్ వేయబడిన రోటార్ యంత్ర సహాయంతో రాగితీగ చుట్టబడిన స్టేటర్ కలిసి అవరోధాలు నిరోధించి సమర్ధతని పెంచుతాయి.

అంతేకాక 127 మిమి వెడల్పయిన అల్యూమినియం బ్లేడ్ చివరిభాగాలు, శక్తివంతమైన 18 పోల్ మోటార్ కలిసి, 32% ఎక్కువ సమర్ధతని, ISI వివరణలకన్నా 10% ఎక్కువ గాలిని యిస్తూ 30% తక్కువ విద్యుత్‌ని వినియోగిస్తాయి ఆకర్షణీయమైన రూపకల్పన, సరిగా సరిపోయే రెగ్యులేటర్‌లతో సాటిలేని ఫాన్ ISI ముద్రతో

5 సంవత్సరాల
గ్యారంటీవున్న ఫాన్

* ఇవ్వబడిన వివరాలు ఖేతాన్ ప్రీమియమ్ 1200 మిమి (48") స్వీప్‌కి సంబంధించినవి

ఖేతాన్

# రక్తాక్షి - ఉగాది

వివిధ భూజములందు విరిసిన విరులను
తోరంపు కొప్పున తురుము కొనుచు

నెఱిమించు మొగమున నెత్తావి పుప్పొడుల్
చిగురాకు వేళుల చెలువు కొనుచు

మదకీరపిక కంఠ మాధుర్య నినదాలు
వాసంత రాగాలఁ బాడుకొనుచు

హరిత పీతారుణా భాచ్ఛ వస్త్రావృత
తిరముగ తెమ్మెర తేరుపైన

నల్ల నల్లన వచ్చితా పేల్లగాను
సాగరాంతాన నొప్పారు సర్వజనుల
నీ యుగాది రక్తాక్షి సర్వేక్షణాన
మనుముగావుత సౌఖ్యాల మహిని నేడు.

— ఓ. పరీక్షిత్ శర్మ

పాధ్యాయులు ఆయిన కూచి— నరసింహంపంతులు గారు. బహు నాటకకర్తలు, సాక్షి వ్యాస రచయితలు, హాస్యప్రియులు అయిన పానుగంటి — లక్ష్మీనరసింహారావుగారు ఆనంద వాచక రచయితలు! కూచివారి విజ్ఞానదాయక పాఠాలు, పానుగంటివారి కథలు పిల్లలనేకాక పెద్దలను కూడా ఆకర్షించేవి. చాలావీళ్ళ అదే పాఠశాలల్లో పఠనీయ పుస్తకాలుగా ఉండేవి. ఆ వాచకాలతో పాటు ఉపవాచకాలుకూడా ప్రకటించబడేవి. అంతతో తృప్తిపడక ఆ కంపెనీ వారు పిల్లలకు కావలసిన కాగితాలు, నోట్‌బుక్కులూ కలాలు, పెన్సిళ్లు మున్నగునాటిని "మద్రాస్ స్టేషనరీ మార్ట్" పేరుతో కొన్నేండ్లు విక్రయించారు. కొందరు వ్యక్తులు విద్యాశాఖలో పలుకుబడిని సంపాదించి, తమ పుస్తకాలను తప్పనిసరిగా పాఠశాలల్లో ప్రవేశపెట్టేవరకూ ఆనంద వాచకాల బావుటా ఎగిరింది. తమ వాచకాలకు గట్టిదెబ్బ తగిలినా సంస్థ యజమానులు నిరుత్సాహపడలేదు. నేమూరి వంశంలోని కడపటి ముద్రణాలయ నిర్వాహకులు, ఉదార హృదయులు అయిన కేశవచంద్రసెట్టిగారు కార్యకలాపాలను యథాపూర్వంగా జరిపించడానికి అన్నివిధాలా కృషిచేశారు. ఉపవాచకాలను ప్రకటించారు. వారు ప్రకటించిన గణితబోధిని తెలుగునాట ఎక్కువ ప్రచారం పొందింది. ఆర్థికంగా ఎక్కువ ప్రయోజనం లేకపోయినా — ఆయన ప్రకటించిన కువలయానందసారం విశ్వవిద్యాలయాలలోని ఉన్నత పరీక్షలకు పెక్కు సంవత్సరాలు పఠనీయంగా నిర్ణయించబడింది. ఆనంద వ్యాకరణాలు మంచిపేరు తెచ్చుకున్నాయి.

## అంతరించిన ఆనంద సంస్థ

క్రొత్త వ్యాఖ్యానంతో రాఘవ పాండవీయం ముద్రించబడింది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'నీలాసుందరీ పరిణయం, శ్రీనాథుని హర విలాసం ప్రకటించబడినవి. అంతకుపూర్వం ఆ రెండు గ్రంథాలూ తప్పుల తోనే చెలామణీ అవుతూ ఉండేవి.

తమకు హితులూ, సుజనరంజనీ ముద్రణాలయాధిపతులూ అయిన పోలాప్రగడ — శేషగిరి రావుగారి ప్రోత్సాహంవల్ల కేశవచంద్ర సెట్టి గారు 1934వ సం. జనవరిలో "చంద్రిక" అనే మాస పత్రికను త్రివర్ణ చిత్రంతో, ఇతర చిత్రాలతో "భారతి" పద్ధతిలో ప్రచురించడం ప్రారంభించారు. అది, శతావధాని దోమా వేంకటస్వామి గుప్త, బులుసు వేంకటరమణయ్య గార్ల సంయుక్త సంపాదకత్వాన వెలువడేది. కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కవితలూ, చలం గారి కథలూ, వ్యాసాలు, తిరుపతి వేంకటకవులు "మృత్యుంజయ శతకం, వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మత్తవిలాస ప్రహసనానువాదం, ప్రముఖ విద్యావేత్తల సందేశాలు తెలిపే లేఖల బ్లాకులు, ప్రముఖుల వ్యాసాలు, గ్రంథ విమర్శనలు, సంపాదకీయాలతోసహా ఆ పత్రికలో ప్రకటింపబడేవి. సాహిత్య పత్రికలు స్వశక్తిమీద ఆధారపడలేని కారణంమూలంగా ఆ పత్రిక రెండు సంవత్సరాలు మాత్రమే నడవగలిగింది.

కేశవ చంద్రసెట్టిగారి ఉదార భావం బలహీనతగా గ్రహించబడి కార్మికుల కార్యకలాపాలలో జాప్యం జరిగేది వాగ్దానం చేసిననాటికి ముద్రణ కార్యం ముగించలేనందున వచ్చే ఆర్డర్లు క్రమక్రమంగా క్షీణించసాగినవి

సంస్థను నిర్వహించడానికి ముద్రణాల యాధిపతులకు పైవారి అండదండలు అవసరమైనవి. తగిన సమయంలో శ్రీమంతులు బి. మాధవరావుగారు సెట్టిగారిని ఆదుకున్నారు. ఇద్దరూ జాయింట్ వాటాదార్లుగా కొంతకాలం సంస్థను నడిపారు.

నడివయస్సులోనే కేశవచంద్రసెట్టిగారు దివంగతులయినందున కార్యభారమంతా మాధవరావుగారి మీదనే పడింది అప్పులు తీరడంకోసం లోన్‌స్క్వేర్‌లోని పెద్ద భవనం, కొంత యంత్ర సామగ్రి అమ్మవలసి వచ్చింది. మాధవరావుగారు ముద్రణాలయాన్ని స్వాధీనం చేసుకుని తమ నివాసమైన మైలాపూరుకు మార్చవలసి వచ్చినది. అట్టి పరిస్థితిలో కూడా బృహద్గ్రంథమైన వసుచరిత్ర నిడుదవోలు — వేంకటరావుగారి పీఠికతో కూడా పునర్ముద్రితమయింది. ఆయన రచించిన ఉదాహరణ వాఙ్మయ చరిత్ర తొలిసారి ఆనంద ముద్రణాలయంలోనే ముద్రితమయింది. అభిషేక నాటకం మొదలైన పుస్తకాలు కూడా అక్కడే అచ్చయి ప్రచారానికి వచ్చాయి. ఈ యాజ్ఞీ — గోపాలకృష్ణమాచార్యులుగారూ, పోతుకుచ్చిసుబ్రహ్మణ్యశాస్త్రి గారు, ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పని చేసి రిటైరైన వెంకటసుబ్బా శాస్త్రిగారు క్రమంగా ఆ సంస్థలో పని చేశారు.

కాలగతిని మార్చడం కమలభవునికైనా సాధ్యంకాదని సామెత ఉండనే ఉన్నది. కాల పరిస్థితులను బట్టి మహాసంస్థానాలే మాసిపోతాయి. మహాసంస్థలు మరుగున పడిపోతాయి. అవి మాసిపోయినా, అవి చేసిన సేవ మాత్రం నిలిచిఉంటుంది. అది ఎన్నటికీ విస్మరింపరానిది.

అట్టి సంస్థలలో ఆనంద ముద్రణాలయ సంస్థ గణనీయమైనది.

— బులుసు వేంకటరమణయ్య★

## స్వయంకృతం

నెత్తిన చెయ్యిపెట్టే
నిలువునా కాల్చేసే వరాన్ని
రూపాయిబిళ్ళ భస్మాసురుడికి
పాపం ! అనాలోచితంగా ఇచ్చేశాడు
మానవుడనే శివుడు !
అందుకే ఇప్పుడది
తన నెత్తికే చేతులు తెస్తోంది
తననే దహించాలని చూస్తోంది
అడ్డుపడి — ఆదుకోడానికిప్పుడు
హరి ఎవ్వరూ లేరు — ఖ్ —

- వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్

మెత్తగా నేసిన ప్రియా * టెరీన్ చీరలు
ఆకర్షణీయమైన డిజైన్లలో, అందమైన రంగుల్లో
మీ వంటిపై మెరిసిపోయే చీరలు



# దావణగెరె

**అందంచిందే సమ్మేళనతో నూతన సరళి కల్పన !**

ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగెరె 577 002

షోరూములు
కావేరి భవన్, బెంగుళూరు 560 009
దాజీబాన్ పేట్, హుబ్లి 580 020
చిత్రదుర్గ రోడ్, దావణగెరె 577 002

*టెరిన్ — [illegible] వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్

THOMAS/8303 C/TEL

# వెలుగు-నీడ

సీరియల్

## ఇచ్ఛాపురపు రామచంద్రం

ఆమె కళ్ళు తెరిచే సరికి...

ముఖంలోకి చూస్తూ— నవ్వు తున్నాడు డాక్టర్.

"శుభోదయం — చంచలాదేవి !"

"నేనెక్కడున్నాను ?" కంగారుగా అడిగిం దామె.

"చాలా సురక్షిత మయిన- నర్సింగ్ హోమ్‌లో."

"నాకేమైంది ?"

"ప్రతి స్త్రీకీ అయ్యేదే." అతని పెదవుల మీద చిరునవ్వు. "ప్రత్యేకంగా ఏమీ కాలేదు-"

"అంటే...?"

"మీరు—ప్రెగ్నెంట్"

నిర్ఘాంతపోయింది చంచల. ఒక్క క్షణం ఆమె కంతా అయోమయంగా అనిపించింది.

"నో—" అరిచిందిపిచ్చిదానిలా. "వీల్లేదు" డాక్టరు జాలిగా చూశాడామె వేపు.

"మీరు కొంచెం విశ్రాంతి తీసుకోండి. తరువాత మాట్లాడదాం—"

ఇంతలో నర్స్‌వొచ్చి పళ్ళరసం అందించింది. తీసుకున్నాక—నీరసం తగ్గినట్లనిపించింది. ఐదు నిముషాలు ప్రశాంతంగా కూర్చుంది.

అప్పుడు వొచ్చాడు డాక్టర్ "ఇప్పుడెలా ఉంది ?"

"బాగానే ఉంది. డాక్టర్ ! ఈ విషయం అదే... నేను ప్రెగ్నెంట్ నన్న విషయం... ఎవరికేనా తెలుసా ?" ఆత్రంగా అడిగింది.

అతను నవ్వాడు. "నేను — సినిమా పరిశ్రమకి చాలా కాలం నుంచి డాక్టర్‌ని... మీరేమీ సందేహించనక్కరలేదు. ఈ విషయం— మీకూ నాకూ తప్ప ఎవరికీ తెలియదు—యిప్పుడు యిక ముందు కూడా..."

"థాంక్యూ వెరీ మచ్. దీనికి... యీ రహస్యం కాపాడడానికి మీ ఫీ జెంత ?" సూటిగా అడిగింది.

అతనూ అంత నిర్మొహమాటంగానేచెప్పాడు.

"మీరు టాప్‌మోస్ట్ స్టార్ కనుక — పదివేలు."

( గతసంచిక తరువాయి )

"సరే. రేపు చెక్కు పంపిస్తాను డాక్టర్! నాకీ గర్భం అక్కరలేదు. తీసెయ్యండి."

"బహుశా—కుదరదనుకుంటాను. మూడవ నెల కూడా దాటిపోయింది ..."

"ఫరవాలేదు."

"నో. చాలా రిస్క్. చంచలా !... మీ లైఫ్‌కే రిస్క్. ఇప్పుడు ... యీ అడ్వాన్స్‌డ్ స్టేజిలో... అబార్షన్ కూడదు."

"అంటే ...?" భయంగా చూసిందామె.

"మీరు— డెలివర్ చేయక తప్పదు—" తీర్పు చెప్పినట్లే అనేశాడు.

అమాటకు గజగజ వొణికిపోయిందామె. "అంతకంటె మరో మార్గమేమీ లేదా? డాక్టర్.. మీకు నా పరిస్థితి బాగానే తెలుసనుకుంటాను."

"ఓ... అందుకే.. మీమీద చాలా జాలిగా ఉంది. చంచలాదేవీ !... మీరు ఎంత బిజీగా ఉన్నా శరీరం గురించి కూడా శ్రద్ధ తీసుకుంటూండాలి. లేకపోతే యిటువంటి ప్రమాదాలే లభిస్తాయి. మీరు మొదట్లోనే వొస్తే ఏ బాధా లేకపోను."

"ఇంతకి మీరనేది— అబార్షన్ లాభం లేదంటారు."

"లాభంలేకపోడమేకాదు. అత్యంత ప్రమాదకరం కూడా. నా మాట వినండి. మీ అందమూ ఆరోగ్యమూ పాడవకుండా ఉండాలంటే — నార్మల్‌గా డెలివర్ చేయడమే గత్యంతరం."

"ఇందులో విచారించడానికేముంది ?"

అమాయకంగా అడిగింది జానకి. అప్పటికి కాని చంచల కర్థంకాలేదు, తను ఏదో లోకంలో ఉండి అన్నీ జానకికి చెప్పేసిందని. ఎంత పొరపాటు చేసింది ! ముక్కూ మొహమూ తెలియని యీమెకు తన రహస్యం చెప్పేసిందా !

"స్త్రీకి మాతృత్వంకంటె వరమేముంది?"

"నేను స్త్రీనే కాను. మహానటిని ... అందాల తారను. ఇప్పుడు నేను గర్భం దాలిస్తే అది నాకూ పరిశ్రమకీ కూడా ఎంత నష్టమో తెలుసా ? నేను షూటింగ్‌లకి హాజరవకపోతే — కొన్ని కోట్ల రూపాయల పెట్టుబడి స్తంభించి పోతుంది. వ్యక్తిగతంగా— నా కెరీర్ చాలా దెబ్బ తింటుంది. అమ్మ నయ్యానంటే గ్లామర్ పోతుంది. అదీకాక నాకు పెళ్ళి కాలేదు కదా ?

"దానిదేముంది ? ఆయనకీ విషయం చెప్పి... వెంటనే వివాహం చేసుకోమంటే ..."

ఫక్కున నవ్వింది చంచల. "ఎవరికి చెప్పేది ? "

"పుట్టబోయే బిడ్డకి తండ్రెవరో మీకు తెలియదూ ?"

అమాయకంగా చూసింది చంచల. ఎవరని చెపుతుంది ? జానకికి ఆమెను చూస్తే జాలి, కోపం రెండూ కలిగాయి.

"అమ్మా !"

"షటప్... అలా పిలవకు. ఎవరేనా వింటే కొంప మునుగుతుంది. చెల్లీ అని పిలువ్." కసిరింది.

జానకికి కోపంరాలేదు. నవ్వొచ్చింది. తన కంటే నిశ్చయంగా పెద్దదిలా కనిపించే చంచలను తను చెల్లీ అని పిలిస్తే ఎంత ఎబ్బెట్టుగా ఉంటుంది !

ఇదీ గ్లామర్‌కోసం తపనే ఏమో. సినీతార అనంగానే అక్కలూ అన్నలేతప్ప చెల్లెళ్ళూ తమ్ముళ్ళూ ఉండకూడదుకాబోలు. ఏం రంగమిది ! జీవితాన్ని యింత కుదవబెట్టాలా !

తను యిటువంటివి వినకపోలేదు. కాని— అవి నిజంగా నిజమనుకోలేదు. జీవితాన్ని సహజమైన వాంఛలనీ యింత త్యాగం చేసి— తారగా మనడం దేనికి ?

**జరిగిన కథ — 1:** ప్రఖ్యాత సినీతార చంచల దగ్గరకు తనూ నటినవుదామని వచ్చిన జానకి ఆశ నిరాశవుతుంది. చంచల షూటింగ్ చివరి షాట్‌లో పడిపోతుంది.

''అదే అర్థం కావటం లేదు.''

''ప్రాణానికే ఎసరుపెట్టే అబార్షన్— వొద్దు. మీరు డెలివరీ చేద్దురుగాని...'' ఆరిందాలా సలహా యిచ్చేసింది.

''నా పేరు... గ్లామర్...'' కంఠం రుద్ధమైంది.

''నాటికి ఏ మాత్రం భంగం కలగకుండా నేను చూస్తాను. కానీ... ఒక్క విషయం...''

''ఏమిటి ?''

''జాగ్రత్తగా ఆలోచించుకొండి. వివాహం చేసుకుని... గృహిణిగా... తల్లిగా... యిదికూడా తక్కువ వరమేమీ కాదు.''

''అవి— జీవితంలో ఎప్పుడయినా చెయ్యవొచ్చు. తలుచుకోవాలే కాని తల్లి కావడం ఎంతసేపు ? వివాహం సమస్యేమీ కాదు. కాని... గ్లామర్... ఒకసారి పోతే మరి రాదు.''

జాలేసిందామెమీద.

''నిన్ను... నా ఆంతరంగికురాలిగా తీసుకుంటున్నాను. నువ్వు నాతోనే ఉండు. జానకీ ! నువ్వింక నా సెక్రటరీవి.''

''అలాగే. కాని— నేను వంట కూడా చేస్తాను. కుక్ చాలా దారుణంగా వండుతున్నాడు.''

''నీ యిష్టం ఏం చేసినా సరే.''

''అలాగే. ఒక్క వాగ్దానం యివ్వండి. మీరు ప్రయత్నించి అబార్షన్ చేయించుకోకూడదు. ప్రాణానికి ముప్పు తెచ్చుకోకూడదు. మీరు అమ్మ అయిన విషయం ఎవరికీ తెలియకుండా... మీ గ్లామర్ చెడకుండా చూసుకునే పూచీ నాది. నా మాటమీద నమ్మకం ఉంచండి.''

''సరే.''

మెల్లమెల్లగా ఆమె మనసులోనూ ఆ యింట్లోనూ స్థానం సంపాదించుకుంది జానకి. చంచలకి సెక్రెటరీ అయ్యాక ఆమె పేరుని ''లతిక''గా మార్చేసిందామె. జానకి ఏమీ అనలేదు. నవ్వుకుంది.

చంచల ఆరోగ్యాన్నతి జాగ్రత్తగా కాపాడుతూ, యింటా బయటా సమర్ధవంతంగా అన్ని పనులూ నిర్వహించసాగిందామె.

తనని లతికా అనిపిలుస్తుంటే— తెరకెక్కపోయినా తెరపేరు లాటిది తగుల్చుకోక తప్పలేదనుకునేది.

లతిక వొచ్చాక చంచలకి యింట్లో చాలా మార్పు కనిపించసాగింది.

ఏ వేళకి వచ్చినా ఎదురుచూసే మనిషి ఉండడంలో ఆమెకు ఒక విధమయిన సంతృప్తీ భద్రతా భావమూ కలిగేవి. లతిక తనకి భోజనం వొడ్డిస్తే – ''లతికా ! నువ్వుకూడా కూర్చో. ఇద్దరమూ కలిసి తిందాం'' అనేది.

''నాతో తింటే – నాలాగ తిరాలి మరి.''

''అమ్మో! కడుపునిండా తింటే లావెక్కి... పొట్ట పెరిగి ... ఎందుకూ పనికిరాకుండా పోతాను.''

''కాని ... మీరు వొట్టి మనిషికారు...'' గుర్తుచేసేది.

చంచల ముఖంలోకి దిగులూ విచారమూ వొచ్చేసేవి.

''ఈ గండం ఎలా గడుస్తుందో !'' నిట్టూర్చేది భారంగా.

''మీరు బెంగపెట్టేసుకోకండి. ఆ భారం నా మీద వొదిలెయ్యమని చెప్పానుగా. నామీద నమ్మకం లేదూ ? అయితే యింకెందుకూ నేనుండి ? పోతాను.''

''అమ్మో ! నువ్వెళ్లిపోతే బతకలేను.
ఇప్పుడు నాకెన్నో నెల ?''

''ఏడు ...''

''ఇంతవరకూ ఎవరికీ తెలియదు నా రహస్యం. దీనికి కారణం నీ చాకచక్యమే.''

''కాని ... యింకా దాచడం అసాధ్యం. చీర ఎంత తెలివిగా కట్టినా యిక బయటపడకుండా దాచలేం ... ''



# పురుషసూక్తము

— డా. ధారా రామనాథశాస్త్రి

గ్రీష్మచండా తపోద్దీప్తమగు ఊష్మమున
 సుడివడుచు గిడిగిళ్ళు పెట్టినది పుడమి
పటు వర్షపాత సంప్లుతినందు వేళలో
బురదలుగ నురుగులుగ పొంగినది నేల
శారదాచ్ఛజ్యోత్స్న శర్వరుల వెలిగింప
తెలిమబ్బు తేటలో తేలిపోయినదవని
మంచుబిందువులొలసి మసక తెరలను వేయ
వలిపెంపు మాటున వధువాయె వసుమతి
శిశిర తీవ్రత పత్ర విసరములు పడిపోవ
తెరవడిన నాట్యమై ధర చిన్నవోయినది.
శిశిరమున అది చివరి రాతిరి
శీర్ణభావా కీర్ణ ధాత్రికి
కలిగినదొక కలవరింత మది
మెలిగినదొక పలవరింత
ఒక గగన శకలమ్ము ఒరిగి పరువును వీడి
కడలి కడుపున ఉప్పుటేటిలో కలిసినది.
ఒక మల్లె యెదలోన ఒదిగి నిదురించినది
తీపి తలుపుల తేనె దిక్కుదరి తోచకయె
ఒక రసాలపు గొమ్మ వంగి పుడమికి మ్రొక్కి
వ్రేళ్ళ పారాణికై వెదుకులాడినది
ఒకపికీ సామ్రాజ్ఞి మగతోడు కికురింప
సాగవలసిన గొంతు మూగవో నడిలినది
శిశిరమున అది చివరి రాతిరి
శీర్ణ భావాకీర్ణ ధాత్రికి
వెన్ను తట్టినట్టు యట్టు లెవరో
వేదగానము ముర్మురించిరి.
కాలరూపుడ నేను లోకాల రూపుల చేయువాడను.
పెంచి పెంచి యుగాంత వేళల త్రుంచు సేనకు మొదిలియారిని
భువనపవనపు దీక్షితుండను
సకల జన సంరక్షకుండను
నవ వసంతపు నవ్యరోచిర్మూర్తి
ఆజ్యము సవనమందున
గ్రీష్మమున ఈ సర్వసృష్టియు
ఇధ్మప్రాయము యజ్ఞ క్రమమున
శరదృతువున నీదు రోచిస్సు
దివ్యక్రతువున నాదు హవిస్సు
యజ్ఞార్థ కర్మమిది విజ్ఞాన మర్మమిది
నీదు బిడ్డలు నేర్చి కడతేరవలసినది
శిశిరమున ఆ చివరి వేకువ పురుషసూక్తము విన్న పుడమికి
సుప్తచేతన మేలుకొన్నది సప్తమారుత మండలమ్ముల.
రక్తాక్షీ ప్రతి పదుషో రక్తిమమ్ము లొలయు వేళ
పుడమితల్లి నావరించె పురుషుని చైతన్య హేల
వెలుగుపుంతల జిలుగు జలతారు పలుపించు
వేవెలుగు తొలితాకు వెచ్చదనములు నిండె
ఒక గగన శకలమ్ము ఓపినంతగ మెరిసి
కడలి యలలకు మణుల కాంతులను పులిమినది.
ఒక రసాలపుగొమ్మ ఒయ్యారముగ కులికి
అరుణాంగుళీలాస్య విన్యాసమొనరించె
ఒక పికీ సామ్రాజ్ఞి మగతోడుతో కలసి
సుఖపంచమ స్వరశ్రుతి మేళవించినది
ఒక మల్లె యెదలోన నొదిగి నిలువగలేక
తేనె సోనలు సాగి దెసలెల్ల ప్రాకినది
అమ్మనేల అంతరంగ రంగమ్మున మసలురుతము
మాటల బాటల కందని మధురోహల మధువ్రతము
కుమతుల రక్తాశ్రువుల ధారలతో నిండునది
సుమతుల సవనోద్గానపు శ్రుతియేళల పండునది
అది ఉగాది నవయుగాది
మరల మరల నవతరించు మానవతా కావ్యలహరి
ఈ యేటికి దానిపేరు రక్తాక్షి.

## వెలుగు నీడ

"మరేం చెయ్యాలిప్పుడు ?"

లతిక — ఆలోచనలోపడినట్లు మౌనంగా ఉండిపోయింది. చంచల లేచి — ఫ్రిజ్‌లోంచి విస్కీసీసా తెచ్చుకుని కూర్చుంది టేబులుముందు. గ్లాసులో విస్కీ, ఐసూవేసి సోడా పోస్తూంటే.

"వొద్దు చెల్లీ ! తాగకండి. ప్లీజ్..." భరించలేనట్లు... అర్థించింది లతిక.

"తాగక — నేనుండలేను. ఎన్ని సమస్యలు! వీటితో మెదడు పగిలిపోతుంది. నిద్ర వొచ్చే వరకూ తాగకపోతే — లాభంలేదు. రాత్రి నిద్ర పోతేనే రేపు పనిచెయ్యగలిగేది."

"మీకేం సమస్యలు ?"

జాలిపడుతున్నట్లు... ఒక అమాయకు రాలిని చూపినట్లు చూసింది చంచల ఆమెవేపు.

ఒక్కసారి భారంగా నవ్వి — గ్లాసెత్తి గటగట తాగేసింది. లతిక — ఓడిపోయిన దానిలా తల దించుకుంది.

"భయపడకు... నేను తాగే విధానం ఇదే..." అంటూ వరసగా రెండు గ్లాసుల విదేశీ విస్కీ తాగి — మంచం మీదకి వెళ్ళి కూర్చుంది.

ఐదు నిముషాలు...

"లతికా !"

అయిష్టంగానే ఆమెవద్దకు వెళ్ళిందామె.

"కూర్చో—"

దూరంగా కూర్చుంది.

"నా పక్కన... నన్ను తగులుతూ... నువ్వెవరివి ? ఫ్రెండ్... ఫిలాసఫర్... అండ్ గైడ్... సిగ్గు విడిచి నీకిప్పుడు చాలావిషయాలు చెబుతాను. మరో అరగంట వరకూ నాకు నిద్ర రాదు. ఇన్నాళ్ళూ నేను నా మనసులోని మాటలు చెప్పకుందుకు నేను నమ్మిన మనిషే దొరకలేదు. నువ్వు... నా ఫ్రెండ్‌వి... ఫిలాసఫర్‌వి... గైడ్‌వి..."

లతికేమీ అనలేదు.

ఆమె కంతా భయంగానూ ఆశ్చర్యంగానూ ఉంది.

"నీ స్పర్శ నా కెంత హాయిగా ఉందో తెలుసా ? ఆత్మీయత అనుభవానికందుతూంది. నా జీవితంలో యిలాగ నా కింత దగ్గరగా వొచ్చినదానవు నువ్వే."

"... ... ..."

"మాట్లాడవేం కోపమా ? నేను తాగుతున్నానని కదూ ? ఏం చేసేది తాగక ? నాకు భయమేస్తూంది."

"మీకు భయమా ! దేనికి ?" జాలిగానూ ఆశ్చర్యంగానూ అడిగింది లతిక ఆమె వీపు నిమురుతూ.

"మహానటికి భయాలుండవనుకున్నావా ? పిచ్చిదానా... ఈ రంగంలో పైకి వెళ్ళున్నకొద్దీ భయాలూ అశాంతీ పెరుగుతాయి. ఇవాళ— మా డిస్ట్రిబ్యూటర్ మరో అమ్మాయిని అభిమానిస్తున్నట్లుందని గాలివార్త తెలిసింది."

"గాలివార్తకీ నీలివార్తకీ భయపడడం అనవసరం."

"అలాకాదు. ఏదయినా మొలకప్పుడే త్రుంచెయ్యాలి."

"అందాలతారా, అసమాన నటీ ఐన మీకు..."

ఫక్కున నవ్వింది చంచల. "నిజంగా నీకేమీ తెలియదు. వొట్టి అమాయకురాలివి. అన్నీ చెప్పాలి. చూడు..నీకు ఇంగ్లీషు వొచ్చునా?"

"కొంచెం..."

"కాలిట్ ఎ బ్యాడ్ డాగ్ అండ్ దెన్ హాంగిట్ అనేది యీ రంగంలో అటూ యిటూ కూడా అస్తమానూ నిజమౌతూంటుంది."

"అంటే ?"

"చాలా డబ్బున్న పెద్ద డిస్ట్రిబ్యూటర్‌కి నేను నచ్చాను. అతను నన్ను అందాలతారన్నాడు. చెంచాలు మహానటి అనికూడా చేర్చారు యధాశక్తి డిస్ట్రిబ్యూటర్స్ చేతిలో నిర్మాతలు, దర్శకులు, నటీనటులు — అందరూ కీలుబొమ్మలే. డిస్ట్రిబ్యూటరే నన్నలా అన్నప్పుడిక తిరుగేముంది ?"

"మీరు అందమైనవారుకాదా ?"

"అందానికర్ధమేముందసలు? ఏది అందం? చందమామలాటి ముఖమూ అందమే, కోల ముఖమూ అందమే. అందానికి ప్రమాణం అంటూలేదు. నన్నతను గుడ్ డాగ్‌ని చేశాడు నేనలా చెలామణీ కాసాగాను."

"అందం సంగతి సరే. నటన ?"

నవ్వేసింది చంచల. "నువ్వు షూటింగ్స్ చూడలేదు కదూ ?"

"ఊహుఁ."

"సినిమా తయారీలో అతి చిన్న ముక్కవౌతుంది. విడిగా ఏ ముక్కకీ అర్ధమూ పర్ధమూ కనిపించదు. కథేమిటో—పాత్ర ఏమిటో పట్టించుకునే వ్యవధి ఉండదు నాలాటి బిజీ నటీమణులకి.

"ఏడవాలమ్మా ... బాగా ఏడవాలి ." అంటాడు డైరక్టరు. మేమేడుస్తాం. ఎందుకో తెలియకుండా వెక్కెక్కి ఏడుస్తాం. ఏవో మాట లనమంటాడు. చిలుక పలుకులు పలుకుతాం. నవ్వమంటే నవ్వి... ఏడ్వమంటే ఏడ్చి... గెంతమంటే గెంతుతాం. మేమేం చేస్తామో ఎందుకు చేస్తామో మాకే తెలియదు ..."

"కథకీ పాత్ర చిత్రణకీ అనుగుణంగా ..."

"అటువంటి పెద్ద మాటలు వాడకు. ఇప్పుడర్థమైందా మహానటి వెనుక పస ? అసలు సరుకులేకనే యితర ప్రతిభలనాధారం చేసుకుని రంగంలో రంగు పూసుకుంటూ నాలుక్కాలాలు నిలిచేందుకు నానాయాతనలూ పడడం. నిజమైన ప్రతిభకి స్థానంలేనందునే నత్తగుల్లలకి కీర్తి కిరీటాలు లభించడం. అందుకే యీ ఫీల్డులో యిన్ని రాజకీయాలు.. కుళ్ళు. కుతంత్రాలు కుట్రలు ..."

"ప్రేక్షకుల సంగతో ? బాగా చెయ్యని నటిని వాళ్ళు విమర్శించరూ ?"

మళ్లీ నవ్వింది చంచల. "తెరమీద కదిలే నీడలని చూసి — నిజమని భ్రమిస్తూ... వాటివెంట మతులు పోగొట్టుకునే అమాయకులే అధికం ప్రేక్షకులు. ఆడవాళ్లయితే ఫ్యాషన్లనీ... మగవాళ్లయితే తారల అందాన్నీ మాత్రమే పట్టించుకుంటారు. ఆ ఫ్యాషన్లూ, ఆ అందమూ కూడా అసత్యాలే. అందుకే వాటికంత ఆకర్షణ. మొత్తానికి సినిమా అంటే యిదే. మేమొకందుకు నవ్వుతాం. కామెరాలో అదొకందుకు ముద్రించబడుతుంది. ప్రేక్షకులకది యింకొకందుకు కనిపిస్తుంది. చీకటి గదిలో... గుడ్డివాడు... నల్లపిల్లిని వేటాడినట్లే..." విరగబడి నవ్వుతోంది.

"ఐతే మహామహా నటీనటులు..." తెల్లబోయింది లతిక. చంచల తాగిన మాట నిజమే కాని... ఎంత నిషాలో ఐనా మరీ యింత అన్యాయమా ?

"నటనంటే ఏమిటని అడుగు. చెప్పగలిగితే చూద్దాం." చంచల మాటలలో ఆట్టే అసత్యం లేదని త్వరలోనే తేలిపోయింది. ఆమె కోసం వొచ్చే నటీనటులని మెల్లగా అడిగేది లతిక. "నేనూ నటి నౌదామని... నటనంటే ఏమిటి ?"

"యాక్షన్." అన్నారు కొందరు, పిల్లి అంటే మార్జాల మన్నట్లు. మరి కొందరు కప్పదాటు వేసేశారు. ఒకరయితే డైరెక్టరు చేయమన్నట్లు చేయడం అన్నారు. ఆ జవాబులు విని మతి పోయింది లతికకి.

నటనంటే — మనసులోని భావాలను (శారీరక) అవయవాల ద్వారా ప్రకటించడం అన్న కనీస జ్ఞానమేనా లేని వీళ్లు ఎలా నటీమణులుగా చెలామణీ ఐపోతున్నారో అని ఆశ్చర్యం వేసింది.

ఆ రాత్రి...

షూటింగ్ నుంచి తొందరగా వొచ్చేసింది చంచల. ఆమె ముఖం చూస్తూంటే— ఏదో జరిగినట్లే ఉంది. వొస్తూనే— ఫ్రిజ్ దగ్గరికి వెళ్లి గబగబ మూడు గ్లాసులు విస్కీ తాగేసి మంచంమీద వాలిపోయింది.

"అక్కా !" అన్న పిలుపుకి లతిక అక్కడికి పరుగెత్తింది. ఆమె వెక్కి వెక్కి పడుతోంది.

వెళ్లి... ఆమె పక్కన కూర్చుని— వెన్ను నిమిరసాగింది.. "అయిపోయింది... సర్వ నాశనం ఐపోయింది... ఇంకేంతో లేదు..." బిగ్గరగా ఏడ్వసాగింది.

"ఏమైంది ?"

సర్వనాశనం... ఆ నీలివార్త— నీలివార్త కాదు. నిజమేలా ఉంది. ఆ కొత్త తారకి మా డిస్ట్రిబ్యూటర్ హీరోయిన్ వేషమిస్తాడేమో అని అనుమానంగా ఉంది..."

తెల్లబోయింది లతిక. ఆమె యిప్పుడిప్పుడే యీ కళారంగంలోని కుళ్లుకి అలవాటు పడుతోంది.

"ఇవాళ—సెట్‌లోకి వొచ్చిన డిస్ట్రిబ్యూటరేమన్నాడో తెలుసా ? '

"ఏమన్నాడు ? "

"చంచలా ... నీ పొట్ట ఎత్తుగా ఉన్నట్లుంది ? అసహ్యంగా కనిపించడంలేదూ అద్దంముందు నిలబడితే ? "



వచ్చేసిందిక!
భారతదేశపు మొట్టమొదటి
'మాయిశ్చర్ బ్యాలన్స్‌డ్' సబ్బు

చర్మ సంరక్షణ సబ్బు
ఆరబెట్టకుండా శుభ్రపరుస్తుంది
జిడ్డులేకుండా మృదువుగా చేస్తుంది

daCunha/CLS/6/84/TL

దీనికేగల
ప్రత్యేకమైన
ఫ్రెంచి
సుగంధంతో




క్లియర్-టోన్ సబ్బులో ప్రత్యేకమైన పదార్థాలున్నాయి–
అవి శాస్త్రీయంగా పరిసమానమైన రీతులో ఉన్నాయి–
దాంతో మీ చర్మంలోకి చొచ్చుకుపోయి శుభ్రపరిచి.
దాంతోటే మీ చర్మాన్ని మృదువుపరుస్తుంది.
క్లియర్-టోన్ సబ్బుయొక్క పేరన్నికగన్న
'మాయిశ్చరైజర్' చెమ్మదనాన్నిచ్చే పదార్థం, దానిలో
గల ముఖ్యమైన ద్రవ పదార్థాలతో మీ చర్మానికి
పోషణనిస్తుంది–మరి యిక దాంతోబాటే యీ
సబ్బులోని సౌందర్యం చిందే నురగ మీ చర్మాన్ని
శుభ్రపరుస్తూ, సున్నితపరుస్తుంది. క్లియర్-టోన్ తో
కడుక్కోవడంతో మీ చర్మానికి హిమబిందువు లాంటి
తాజాదనపు స్వచ్ఛత, సేవకంగా వుండే లక్షణమూను–
అంటే పొడి పొడిగా, జిడ్డుగా కాదు.
దాంతోబాటే క్లియర్-టోన్ సబ్బుకే ప్రత్యేకంగా
గల, అంటి పెట్టుకుని వీడని ఫ్రెంచి సుగంధం కూడాను.
క్లియర్-టోన్ సబ్బు మరియు క్లియర్-టోన్ క్రీమ్.
ఈ రెండూ నికోలస్ లేబరేటరీస్ వారు సంపూర్ణ
చర్మసంరక్షణ కోసం మీకిచ్చే సౌందర్యపు కానుక.
ఇక మీ చర్మం మరింత ఎర్రగా మెరుగ్గా, మరెంతో
తాజాగా, మృదువుగా, ఆరోగ్యవంతంగా రూపొందుతుంది.

# క్లియర్-టోన్
## చర్మ సంరక్షణ సబ్బు

లండన్ . ప్యారిస్ . న్యూయార్క్

* త్వరపడండి! సరుకు ఉన్నంతవరకే యీ కానుక.

జాలివేసింది లతికకామెమీద.

సినీనటి జీవితం యింత పరాధీనమా! ప్రకృతి సహజమయిన కోర్కెలను కూడా చంపుకుని– పంజరంలో చిలుకలా బండ బ్రతుకు బ్రతకాలా!

"అప్పుడు– నేను చెప్పినట్లు..."

"సరిగ్గా అంతే చేశాను. ఈ అవమానం భరించలేను. డైటింగ్...స్థలం మార్పు...అన్నీ పాటించి చాలా అందంగా తయారైతే తప్ప కామెరా ముందు మరి నిలుచోనని ప్రతిజ్ఞ చేసి వొచ్చేశాను సెట్ నుంచి."

"మంచి పని చేశారు. ఈ రాత్రికే మనం బయలుదేరుతున్నాం."

"ఎక్కడికి ?"

"రహస్యం." నవ్వింది లతిక.

సరిగ్గా రాత్రి ఒంటిగంటకు వీళ్లిద్దరూ యిల్లు వొదిలారు.

నిషా.. నిద్ర.. నీరసమూ మూడిటితోనూ చంచల బాధపడుతున్నట్లుంది. ఎవరూ గుర్తుపట్టలేనివిధంగా ఆమె పరదా వేసుకుంది.

ఆమెను చూస్తూంటే జాలే వేసింది లతికకి. ఎటువంటి దానికెటువంటి కష్టాలు వొచ్చాయి!

మారుపేర్లతో టికెట్లూ రిజర్వేషన్సూ... హోటల్ రూము రిజర్వేషన్సూ... ఒకటేమిటి.. అన్నీను.

"ఈ గర్భం నా ప్రాణానికి పీడలా దాపురించింది. ఈ గండం గడిచి... మళ్ళీ నేను మామూలుగా ఔతానంటావా ?" కన్నీళ్లతో అడిగేది మాటిమాటికీ.

"మీరేమీ చింత పెట్టుకోకండి. తప్పకుండా అన్నీ సవ్యంగా జరుగుతాయి. ఇప్పుడు మీరు నటిస్తున్న సినిమాలెన్ని ఉన్నాయి ? పన్నెండు కదూ ?"

"కాబోలు."

"అంతేలెండి. అవన్నీ సగంపైగా పూర్తయినవే. మీరు రావడానికి మహా అయితే మూడు నెలలు... ఊహు... రెండున్నర మాసాలు. ఈలోగా ప్రొడ్యూసర్లు సగం సగం సినిమాలనేం చేసుకోగలరు ? మీకు బదులు మరొకర్ని పెట్టుకుని పూర్తిచెయ్యడం అసాధ్యం. వాళ్లందరూ చచ్చినట్లు మీకోసం వేచి ఉండవలసిందే. మీరు – యినుమడించిన అందంతో వొస్తారు మళ్లీ మద్రాసుకి. ఈ పన్నెండు సినిమాలూ చక చక పూర్తిచేస్తారు. అవన్నీ రిలీజయ్యేసరికి మళ్ళీ మీ పేరు మ్రోగిపోతుంది. మీ టాప్ ప్లేస్ మీకొచ్చేస్తుంది..."

"అంతవరకూ ..."

"నేను మద్రాసులో ఉంటూ పరిస్థితులను చక్కదిద్దుతూంటాను."

"ఏమౌతుందో ఏమో ..." దిగులుగా నిట్టూర్చింది చంచల.

## కలల గోర్వంకలు

మనసులోని మధురోహకు
ఋతువేదిక వసంతము
చిత్రరధుని విహారాన
శబలరాగ భాస్వంతము...

వచ్చెనదిగో మధుమాసం
తెచ్చెనిదియె సుమహాసం
ఎదలోపలి తలపులన్ని
నవలెత్తిన ఋతులాసం...

నూనతతుల ప్రసూతమై
చైత్రమాస మరుదెంచెను
సుమరజమును పారాణిగ
ధరాపదమునందుంచెను...

చిగురించిన తరువులవియె
దిశల రంగు ముంచినవి
పూలతోడి పొదరిళ్లు
మధుపాత్రలు వంచినవి...

కలలె గోర్వంకలై
కనులగూడు వదిలిపోయి
అవని మీది ఆమనితో
ఆడుకొనుట కరగినని...

– "సాంధ్యశ్రీ"

## వెలుగు – నీడ

"నా సమర్థత మీద మీకు నమ్మకం లేదూ ?"

"నీమీదనే నమ్మకం లేకపోతే నాకింకెవరున్నారు నా అనేవాళ్ళు ?" బేలగా కన్నీరు పెట్టుకుంది.

"ఇంకెప్పుడూ మీకిటువంటి కష్టాలు రాకుండా నేను చూసుకుంటానుగా ..."

ఎవరికీ తెలియని చోట– చంచలను దింపి, ఆమెకు ఆశ్రయం ఏర్పరచింది. వైద్య సదుపాయమూ.. వసతీ అన్నీ భారీఎత్తున అమర్చింది.

రెండు రోజులామెతో గడిపి– మూడోనాడు, "నేను వెళ్లొస్తానమ్మా" అంది లతిక.

"అప్పుడే ? నన్నొదిలి వెళ్లిపోతావా ?" కన్నీరు పెట్టుకుంది చంచల చిన్నపిల్లలా.

"అక్కడ వ్యవహారాలు చూడాలని కాని, లేకపోతే మిమ్మల్ని వొంటరిగా విడచి వెళ్లేదాన్నా? మీరు లేని చోట నాకేముంది ? అక్కడ వీలు చూసుకుని సాధ్యమైనంత త్వరలో వొచ్చేస్తాను."

"వెళ్లేముందు ఒక్క మాట చెప్పనీ..."

"చెప్ప చెల్లీ..." అంటూ ఆమెను దగ్గరగా తీసుకుంది.

"సినీ రంగంలో – నటి స్థానం అతి చంచలమూ అశాశ్వతమూ. ఆ నీటిబుడగ ఎప్పుడు ఎందుకు ఎలాగ టప్‌న పేలిపోతుందో తెలియదు. చేప – నీటిలో తప్ప బ్రతకలేనట్లు నేనా రంగంలో తప్ప మనలేను. నా స్థానం నన్నెంత సంతోషపెట్టేదో అంత బాధపెడుతూ కూడా వొచ్చింది. ఏదయినా పిక్చరు ఫ్లాపయితే– గదిలో తలుపులు మూసుకుని గంటల తరబడి ఏడ్చేసేదాన్ని. రంగు పూసుకోని రోజున నాకు అన్నమే సహించదు..."

"అర్థమైంది. నేను మీ స్థానాన్ని పదిలంగా ఉంచేందుకు శాయశక్తులా పాటుపడతాను. ఏ త్యాగానికయినా వెనుకాడను. ఈ సమయంలో నన్నూ ఒక మాట చెప్పనీండి. నాకు – మీరుతప్ప ఎవరూలేరు. మీతోడిదే నా జీవితం."

చంచల ఆమెను కౌగలించుకుని – ఏడ్చింది. లతిక మద్రాసు బయలుదేరింది.

**(ఇంకా వుంది)**



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1983 సినిమా బాలట్ ఫలితాలు


ఉత్తమ నటుడు
అక్కినేని నాగేశ్వరరావు





ఉత్తమ దర్శకుడు
దాసరి నారాయణరావు


ఉత్తమ నటి
జయసుధ


ఉత్తమ సహాయ నటుడు
చంద్రమోహన్


ఉత్తమ సహాయ నటి
విజయశాంతి


ఉత్తమ హాస్యనటుడు
అల్లు రామలింగయ్య


ఉత్తమ హాస్యనటి
రమాప్రభ


ఉత్తమ సంగీత దర్శకుడు
చక్రవర్తి






ఆ మధ్యలో ప్రభుత్వం స్కూలు పాఠ్య పుస్తకాల ప్రచురణ స్వంతం చేసుకున్నప్పట్నించి, పరశురాం అండ్ కం. లో నవలలే ఎక్కువగా ప్రచురిస్తున్నారు.

ప్రస్తుతం పరశురాం ఊళ్ళోలేడు. నెల రోజులు టూర్ వేసుకుని వెళ్ళాడు నార్త్ ఇండియా అంతా చుట్టి రావాలని. రావు శక్తి సామర్థ్యాలమీద ఏర్పడిన గురి వల్ల, తనులేక పోయినా ఆఫీసులో రొటీన్ వర్క్ సాగుతుందనే ధైర్యంతోనే, అవసరమయిన ఏర్పాట్లు అన్నీ చేసి బయలుదేరాడు.

ఆ నెల రోజులు రావు తనకి అనుకూలించే విధంగా ఒక ప్రణాళిక వేసుకోటానికి అవకాశాన్నిచ్చాయి.

రావులపల్లి జయశ్రీ వ్రాసిన 'బొమ్మల కొలువు' అన్న నవల అచ్చు అవుతూ ఉంది ప్రెస్‌లో. దానికోసం పరశురాం ఓకే చేసిన కవర్ డిజైన్ రావుకి నచ్చలేదు. ఇంత బ్రహ్మాండమయిన రొమాంటిక్ స్టోరీకి, బొమ్మలకొలువు తీరుస్తున్న బుట్టబొమ్మలాంటి అమ్మాయి బొమ్మ చప్పగా ఉంది— అనుకున్నాడు.

*(గత సంచిక తరువాయి)*

మార్కెట్లో ప్రేమ కథలకీ, అందులోనూ జయశ్రీ వ్రాసిన నవలలకీ మంచి డిమాండ్ ఉంది. 'తెలుగు పాఠకులు పుస్తకాల్లో, కథల్లో అశ్లీలతనీ, అసభ్యతనీ సహించలేరు అన్నమాట నిజమే. వాళ్ళింకా చాలా వెనుకబడే ఉన్నారు. కాని కొంచెం సెక్సీగా అట్టబొమ్మ వేస్తే, వద్దు అంటారా ఎవరయినా! బొమ్మ చూసయినా మోజు పడి పుస్తకం కొనరూ కొనే అలవాటు లేనివారయినా' అనిపించింది అతనికి. అందుకే కొంచం ధైర్యంచేసి పరశురాం ఓకేచేసిందాన్ని కాదని, తను మరొక డిజైను తయారు చేయించాడు. అది ప్రింటింగ్‌కి కూడా వెళ్ళింది. సేల్స్ చూస్తే తను చేసిన మార్పుకి పరశురామే సంతోషించి, తన ఐడియాలు మార్చుకుంటాడేమో అనిపించింది. ఏమయితే అయిందని తెగించాడు. పుస్తకాలు తయారు అయినాయి. పాకింగ్ సెక్షన్‌కి పంపారు.

రావు పని కట్టేసి బయలుదేరదామనుకుంటూ ఉండగా టెలిగ్రాం వచ్చిందొకటి. విషయం చదవగానే రావుకి గుండె ఆగినంత పనయింది. ఈ పరిస్థితిలో పరశురాం రాక, ఎలాంటి పరిణామాలకి దారితీస్తుందో అని భయం వేసింది మొదట. పాకింగు పూర్తి అవటానికి సులభంగా మరొక రోజు పట్టవచ్చు. ఉదయం పరశురాం ఆఫీసుకి వచ్చేడంటే తను కవర్ డిజైన్ మార్చిన విషయం చూడకుండా ఉండడు. ఇంకా పదిరోజులకి గానీ రాడనుకున్న వ్యక్తి ఇంత తొందరగా ఊడిపడటం ఏమిటో? ఇంకో పదిరోజులయితే పుస్తకాలు మార్కెట్లోకి వెళ్ళిపోయేవి. అప్పుడిక తెలుసుకున్నా పరశురాం చేయగలిగేదేమీ ఉండదు, చూస్తూ ఊరుకోవటం తప్ప. ఏం చేయాలి? అని సీరియస్‌గా ఆలోచిస్తూ ఆఫీసు నుంచి బయటపడ్డాడు.

గదిచేరేసరికి ఐడియా తట్టింది. 'ఈ దెబ్బతో హరిగాడి పని ఆఖరు. పరశురాం దృష్టి మరోవయిపు తిప్పెయ్యవచ్చు' అనుకుని తన తెలివికి తానే సంతోషించాడు. ఆ సంతోషంలో అలమారాలో దాచుకున్న ట్రిబుల్ ఎక్స్ రమ్ బయటికి తీసి కొంచం కొంచంగా సోడా కలిపి తాగటం మొదలు పెట్టాడు.

రోజూ ఆవేళకి అరుణ తన గదికి వస్తుంది. ఇవాళ ఇంకా రాలేదేమిటీ అని ఎదురుచూస్తున్నాడు. నిముషాలు గడుస్తున్న కొద్దీ అరుణ రాకపోతే తన ప్లాను ఫలించదే అని భయం పట్టుకుంది. కొంతసేపు చూసి ఫోన్ చేద్దామా అనుకుని లేవబోయాడు. తలుపు తట్టిన చప్పుడయింది. గబగబా రమ్ సీసా అలమారాలో దాచేసి వచ్చి తలుపు తీసాడు.

ఎదురుగా అరుణ నిలుచుని ఉంది. ఈ మధ్య తండ్రి టూర్ వెళ్ళినప్పట్నించీ ఇక్కడికి అరుణ రాకపోకలు ఎక్కువయినాయి. ఒక్కరోజు అతన్ని చూడకుండా బ్రతకలేననే స్థితికి వచ్చింది ఆమె. దానికి తోడు తను మూడు నెలలు గర్భిణి అని ఆవాళే తెలిసింది. ఆ సంగతి అతనికి చెప్పాలని ఆత్రుతగా వచ్చిందీ రోజు.

అరుణ ముఖం చూసే అనుమానించాడు ఏదో జరిగిందని. "హలో అరుణా దా" అని ఆహ్వానించి తలుపేసాడు.

తీసుకొచ్చి మంచం మీద పక్కనే కూర్చోబెట్టుకుని, "ఏమిటో డల్‌గా వున్నావు కద డార్లింగ్ ఏమయింది?" అడిగాడు అనునయంగా. ఇవాళ ఆమె మీద చెప్పలేనంత ప్రేమగా వుంది, అతనికి.

అరుణ ఏం మాట్లాడకుండా, కొంచెం సేపు అతని ఒడిలో ముఖం దాచుకుని ఏడుస్తూ వుండిపోయింది. మెల్లగా అసలు విషయం చెప్పింది. ముందు అదిరిపోయాడు రావు ఆ మాటవిని. కానీ అదేమీ బయటకన్పించకుండా జాగ్రత్త పడ్డాడు. 'చదువుకున్నదయితేనేం బుద్ధిలేనిది, అంత కేర్‌లెస్‌గా వుండి ఇలా చేసుకొంటుందని తనకేం తెలుసు?' అని లోలోపల చిరాకు పడ్డాడు.

**జరిగిన కథ — 18:** హరిప్రసాద్, రమణల పెళ్ళికి వచ్చిన రావును అతని కోరికపై అరుణకు పరిచయం చేస్తాడు హరి. 'గోరంత దీపం' పత్రిక ఎడిటర్ పదవి హరిప్రసాద్ చేతుల్లోకి వచ్చింది. రావు 'గోరంత దీపం' బిజినెస్ మేనేజరుగా చేరుతాడు. గర్భంతో ఉన్న రమణ కోరికపై రమణ, హరి ఊళ్ళు తిరిగిరాను వెళుతారు. అరుణకి ఫోన్ చేసి పార్కుకి రమ్మని కోరుతాడు రావు. అరుణ రావును పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటుంది. కర్నూల్లో త్రీ స్టార్ హోటల్ ప్రారంభోత్సవ సందర్భంలో ఆ హోటల్ యజమానిని ఇంటర్వ్యూ చేస్తాడు హరి. విశ్వమూర్తికి గుండెపోటు వస్తే హాస్పిటల్లో చేరుస్తాడు హరి. హాస్పిటల్లో విశ్వనాథంగారు, రమణ ఒకే క్షణంలో కన్నుమూసారు. హరిప్రసాద్ కుప్పకూలిపోయాడు. పరశురాం కూడ ఈ సంఘటనతో కృశించిపోయారు. కర్నూలు సాఫ్ట్ డ్రింక్స్ ఫ్యాక్టరీవాళ్ళు తయారుచేస్తున్న 'జాలీకోలా'లో ఆల్కహాలు మిక్స్ చేస్తున్నారని ఆ విషయం 'గోరంత దీపం'లో పబ్లిష్ చేస్తానని హరి పరశురాంకు చెపుతాడు. ఆయన దానికి అంగీకరిస్తారు. ప్లాన్ ప్రకారం చేసిన ఇన్వెస్టిగేషన్‌లో 'జాలీకోలా'లో ఆల్కహాల్ ఉన్నట్లు ఋజువవుతుంది. 'గోరంత దీపం'లో జాలీకోలా మిస్టరీ ప్రచురింపబడుతుంది. హరికి, పరశురాంకు మనస్పర్థలు వచ్చేలా చేయాలని ఆలోచిస్తాడు రావు. అతనికి అరుణంటే మోజు తీరిపోయింది.

పయికి మాత్రం, "అంత మంచి వార్తని ఏడుస్తూ చెబుతావేం పిచ్చి!" అనడిగాడు నవ్వుతూ.

"మీరనేదేమిటి ? ఇది మంచి వార్తా మీకు? పెళ్లి అవకుంటే..."

"పెళ్లి అవదని ఎవరోయ్ చెప్పింది. మీ నాన్నని నేను అడిగినా ఒప్పుకోంటారని నమ్మకం లేదు. మనం హాయిగా ఇక్కణ్ణించీ ఎక్కడయినా దూరంగా వెళ్లిపోదాం."

"నిజంగా అంటున్నారా ?" తను ఇన్నాళ్ళుగా పోరినా పట్టించుకోని మనిషి ఇవాళ ఎక్కడికయినా పోదాం అని ధైర్యంగా చెబుతూంటే నమ్మలేకుండా ఉంది అరుణ.

"నిజంగానే. నేను మాత్రం ఎప్పటికీ ఇలాగే నీకు దూరంగా ఉండి పోవాలనుకుంటానా? మళ్లీ మీ నాన్న ఎప్పుడొచ్చి దిగుతాడో చెప్పటం కష్టం. అందుకని తొందరగా వెళ్లిపోదాం. అయితే నువ్వొక పని చేయాలి. ఓ ఇరవయి వేలున్నాయేమో తీసుకొస్తావా ?"

"ఇరవయి వేలు !... అమ్మో అంత డబ్బు నేనెక్కడ తేగలను ! నా బాంకు అకౌంటులో ఓ అయిదుకి మించి ఉండదు."

"ఏం చేద్దాం మరి నా దగ్గర పాతికవేలు పైనే ఉంది. మొత్తం ఏభయి అయినా ఉంటే ఏ మద్రాసో వెళ్లి ఏదయినా వ్యాపారం చేసుకో వచ్చు స్వంతంగా ... పోనీ నువ్వొక పని చెయ్యి... ఇప్పుడు మీ నాన్న లేడుగా .. చెక్స్ అన్నీ సంతకం పెట్టేది హరిప్రసాదే ... అన్ని కీసు అతని దగ్గిరే ఉన్నాయి. నువ్వెళ్ళి అతన్ని అడిగే సావంటే దొరుకుతుంది డబ్బు."

"అతను అంత సులభంగా ఇచ్చేస్తాడా అని."

"ఇరవయివేలు, పాతికవేలు అడిగిన వెంటనే, ఎందుకు ఏమిటి అని అడక్కుండా ఊరికే ఎవరిస్తారోయ్ డబ్బు ... అక్కడే నీ తెలివి ఉపయోగించాలి మరి ... ఏమంటావ్ ?"

రావు వెంట వెళ్ళగల ఈ అవకాశాన్ని ఆమె వదులుకోదలచలేదు. ఎలాగయినా ప్రయత్నించు దామని అనుకుని, 'సరే' అన్నట్లు తల ఊపింది.

"అలా అయితే బయల్దేరుమరి. నేను అటు వచ్చి నెహ్రూనగర్‌లో నిన్ను దింపి వెళతాను. నాక్కొంచం పనుంది అటు వయివు."

"ఇప్పుడా ? ..." ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"అవును. ఏం ? ఇప్పుడు తొమ్మిదేగా అయింది. నేనుండగా నీకేం భయం ? పద, వెళదాం. మళ్ళీ నేనొచ్చి నిన్ను ఇంటి దగ్గిర దిగబెడతానుగా ?" అంటూ తొందర పెట్టాడు, టయిం చూసుకుంటూ. పరశురాం వచ్చే టయిం అవుతోంది. తనీమెని త్వరగా వదిలించుకుని, వాళ్ళింటికి వెళ్ళి కారు తీసుకుని స్టేషనుకి వెళ్ళాలి మళ్ళీ. కావాలనే డ్రైవర్‌కి చెప్పలేదు.

# గోరంత దీపం

హరిప్రసాద్ ఉంటున్న విశ్వమూర్తిగారింటి నుంచీ రెండిళ్ళ అవతల స్కూటర్ ఆపి దిగమన్నాడు. అరుణని. "భయం లేదు. వెళ్ళు నేను మళ్ళీ అరగంటలో వస్తాను. సరిగ్గా ఇక్కడే నిలుచుని హారన్ మోగిస్తాను మూడుసార్లు నువ్వొచ్చేసెయి. ఏదోలాగ పని సాధించుకుని రావాలి," అనేసి తను వెళ్ళి పోయాడు.

రావు రైల్వే స్టేషను చేరేసరికి పది గంటలకి అయిదు నిముషాలే ఉందింకా.

కారు పార్క్ చేసి, ప్లాట్‌ఫారమ్ మీదికి వెళ్ళి నిలుచున్నాడు. పరశురాంతో ఏం మాట్లాడాలా అని మనసులోనే రిహార్సల్ వేసుకుంటున్నాడు.

దడదడమని వచ్చిన ఎక్స్‌ప్రెస్ రైలు ఫస్ట్‌క్లాస్ కంపార్ట్‌మెంట్‌లోంచి కిందికి దిగాడు పరశురాం. రావు నవ్వుముఖంతో ఎదురుగా వచ్చాడు. గబగబా రెండు సూట్‌కేస్‌లూ అందుకుని, ముందుకు నడిచాడు.

"డ్రైవర్ రాలేదా?" అడిగాడు పరశురాం అతని వెంటే నడుస్తూ.

"లేదు సార్. మీ టెలిగ్రాం అందటం ఆలస్యం అయింది" అని జవాబిచ్చాడు రావు.

"ప్రయాణం బాగా సాగిందాండి. ఏం ఇబ్బందులు కలుగలేదుకద !"

"నో. అలాంటిదేం లేదు. ఆఫీసులో అంతా సవ్యంగా జరుగుతోంది కదూ ?" కారులో రావు



పక్కనే ముందు సీట్‌లో కూచుంటూ అడిగాడు పరశురాం.

"బ్రహ్మాండంగా జరుగుతోంది. అన్నీ మీరు చెప్పిన ప్రకారమే చేస్తున్నాను." కార్ స్టార్ట్ చేశాడు రావు.

కొంతసేపు ఇద్దరూ మవునంగా వుండి పోయారు. రావు కావాలనే కారుని మెల్లిగా పోనిస్తున్నాడు.

"హరిప్రసాద్‌కి అంతా చూసుకోమ్మని చెప్పి వెళ్ళాను నేను. అప్పుడప్పుడూ వస్తున్నాడు కదూ ఇటువయిపు? అయినా మీరిద్దరూ స్నేహితులే గద! నేను ప్రత్యేకించి చెప్పటమూ అనవసరమే!"

"ఏమోనండి! మీరు వెళ్ళిన రోజునుంచీ ఇటువయిపు రానేలేదు, తన ఆఫీస్ వదిలి."

"ఈజిట్!... బహుశా అక్కడే బిజీగా ఉన్నాడేమో! అయినా అందువల్ల నీకేం కష్టం కాలేదు గద!"

"కష్టం అంటే ఏమీ అవలేదనుకోండి... కానీ అతను నాకీమధ్యలో మొహం చాటుచేస్తున్నాడు. చూసినా పలకరించటంలేదు."

"ఎందుకు? ఏదయినా అభిప్రాయభేదం వచ్చిందా?" పెద్దమనిషిగా తను పరిష్కరిద్దాం అన్న ఉద్దేశ్యంతో అడిగాడు పరశురాం.

అతనేదో చెప్పాలని, వెనుక ముందాడుతున్నట్లనిపించింది ఆయనకి.

"ఫరవాలేదు. చెప్పు రావ్!" అని ప్రోత్సహించాడు.

"అసలీ విషయం మీకెలా చెప్పాలో తెలీకుండా ఉంది ... హరి ప్రవర్తన ఏమీ బాగుండటంలేదు... ఈ మధ్యలో ... అతను, మీ అమ్మాయి కలిసి తిరగటం ఎన్నిసార్లో చూశాను. ఆఫీస్‌లో కూడా అందరూ నానా రకాలుగా చెప్పుకుంటున్నారు."

"ఏమిటోయ్ మవ్వంటున్నది? అతను ఒకప్పుడు మా కరుణకి ట్యూషను మాస్టారు. ఆ చనువుతో కొంచెం స్నేహంగా వుంటారు. అంతే. అయినా ఆ విషయం ఆఫీస్‌లోనూ తెలుసు!"

"సారీసర్! మీరు పొరబడుతున్నారు. నేను అంటున్నది మీ పెద్దమ్మాయి గురించి."

"నిజమా..."అని గొణగటం తప్ప గట్టిగా మాట్లాడలేకపోయాడు పరశురాం.

"ఇంత ఘోరం జరుగుతోంటే చూస్తూ ఊరుకోలేక చెప్పాను. అసలు నా కళ్లతో నేను చూసి ఉండకపోతే నేను నమ్మేవాణ్ణేకాదు. ఇంతెందుకు, మీరు వెళ్లినప్పట్నించీ, ప్రతీరోజూ మీ అమ్మాయిని తన ఇంటికి రప్పించుకుంటున్నాడు హరిప్రసాద్. మనం ఇప్పుడు నేరుగా అక్కడికే వెళితే మీ కళ్లతో మీరే చూడచ్చు."

* * *

# గోరంత దీపం

సోఫా మీద జారగిలబడి, 'ది మైండ్ ఆఫ్ వివేకానంద' చదువుతూ కూర్చుని వున్నాడు హరిప్రసాద్. ఆవేళ ఆఫీసులో పని ఎక్కువగా లేదు. ఏడుగంటలకే ఇల్లు చేరాడు. వంటచేసే మాణిక్యం ఎనిమిదిగంటలకి భోజనం టేబిల్ మీద సర్ది వెళ్లిపోయాడు. ఇప్పటికీ పూర్తిగా చల్లారిపోయి ఉంటుంది కూడా. కానీ భోజనం చేయాలనిగానీ, ఆకలిగా కానీ అన్పించటంలేదు.

డోర్ బెల్ మోగింది. చేతిలో పుస్తకం మూసి పక్కన పెట్టి, తలుపు తీసేందుకు లేచాడు. వరండా అంతా చీకటి ఎవరు నిలుచున్నదీ తెలియలేదు. వరండా లైటు వేశాడు. ఎదురుగా అరుణ నిలుచుని బెరుకుగా చూస్తూంది. "అరుణా! మీరా?" ఆశ్చర్యంగా అన్నాడు హరి.

'ఒంటరిగా ఈ చీకటిలో నా కోసం ఎందుకొచ్చింది ఈమె!' అనుకున్నాడు.

ఆమెని లోపలికి రమ్మనకుండా నిలుచుని చూస్తున్నానని గుర్తొచ్చి, "రండి లోపలికి" అని ఆహ్వానించాడు.

ఆమెని లోపలికి రానిచ్చి తలుపులు దగ్గరగా వేసాడు.

"అలా కూర్చోండి" అని ఆమెకి కుర్చీ చూపించి, "కాఫీ తెస్తానుండండి" అంటూ లోపలికి వెళ్ళాడు,

ఎలా మొదలు పెట్టాలా అని ఆలోచిస్తున్న అరుణ, అతను ఇచ్చిన కాఫీ త్వరత్వరగా రెండు గుక్కల్లో తాగేసింది.

"మీతో కొంచం పని ఉండి వచ్చాను."

"చెప్పండి."

"నాకు ఇరవయివేలు కావాలి..."

"ఓహో! నాన్నగారు లేరుకదూ? ... అయినా అంత పెద్దమొత్తం ఎందుకో చెబితే... చెక్ రాసి ఇస్తాను... అలాంటి అవసరమేదీ ఉన్నట్టు నాకాయన చెప్పలేదే వెళ్ళే ముందు."

"ఆయనకి తెలీదు. నాకే స్వంత అవసరాలకి కావాలి.

"మీరంత అస్పష్టంగా చెబితే కష్టం. మళ్ళీ నేను ఎకౌంట్స్ చూపించాలి కదా?"

ఇతను చెప్పనిదే సులభంగా వదిలేలాలేదు అనిపించింది అరుణకి. చెబితే మాత్రం ఏం పోతుంది? రేపు వెళ్ళబోయే వాళ్ళని ఏం చేయగలడు? అనుకుని తెగించి, చెప్పటానికే నిశ్చయించుకుంది.

"నేను, రావుగారూ రేపు మద్రాసు వెళుతున్నాం. అందుకని..."

ఓహో! ప్రోగ్రాం నిర్ణయం చేసుకున్నారా? మద్రాసుకి వెళ్ళి ఏదయినా వ్యాపారం చేసుకుందాం; డబ్బు తీసుకురమ్మని పంపించేడా రావు మిమ్మల్ని!"

'ఇతనికెలా తెలుసు?' అన్నట్లు చూసింది అరుణ ఆశ్చర్యంగా.

"రావు నాకు పదేళ్ళక్రితం నుంచీ తెలునని మీరు మరచిపోతున్నారు. వాడి సంగతి మీకంటే బాగా తెలుసు నాకు."

"ఇన్ని మాటలెందుకు... అడిగిన డబ్బు ఇస్తారో ఇవ్వరో ..."

"చెప్పమంటారు. మీ విషయంలో కల్పించుకునే అధికారం నాకేం ఉంది అంటారు. అవునా?"

తల వంచుకుంది అరుణ.

"మీరలా అంటారనే రావు గురించి మీకు చెప్పాలని అనిపించినా ధైర్యం చేయలేదు. ఇవాళ తప్పదు కమక చెబుతున్నాను. రావు పెళ్ళిచేసుకుని సెటిల్ అయ్యే రకం కాదు. అతనికి జీవితం ఒక ఆట. తన దగ్గరగా వచ్చిన వాళ్ళని ఎలా బొమ్మలుగా మార్చి ఆడుకోవాలో వాడికి బాగా తెలుసు ... నామాట వినండి అరుణా... వాడి మాటలు నమ్మి వెళ్ళద్దు ..."

"..........." అరుణకి కోపం వస్తోంది. హరి మాటలు అవమానంగా అన్పిస్తున్నాయి.

## ఎలావచ్చావు ?

వచ్చావా ఎర్రకన్నులదానా
రక్తాక్షీ ఎలావచ్చావు ?
ఎలా మాదేశం, రాష్ట్రం
జిల్లా, గ్రామం కనుక్కున్నావు
కరణాలు మునసబులు లేరుగా
అన్న పాలన అయస్మయం
అమ్మ పాలన అధ్వాన్నం.

రక్తాక్షీ, క్రోధన, క్షయ
అన్నీ అన్నీగానే ఉన్నాయి.
అయితే అన్నీ చెడురోజులు కావుగా
అతిక్రాంత సుఖఃకాలాః
గతకాలము మేలు
వచ్చుకాలము కంటెన్

రుధిరోద్గారిలో
పోలీసులు లాయర్లన్ని
టీచర్లని, పత్రికల వాళ్లనీ
అందర్నీ కొట్టారు.
ప్రజాపాలకులు
కొట్టుకొంటున్నారు.
రక్తాక్షీ నీవు
ఏ హోటలులో దిగావు.
అన్న భోజనం ఎలాఉంది.
వేపవూ పచ్చడికి
ధర నిర్ణయం కాలేదు.
ఒక కమిషన్ వేస్తాడేమో!

— ఎం. ఎస్. ఎం.

# వసంతరాగం

గడచిన వత్సరపు ప్రౌఢ
లేత వన్నెల చీర
గోరంచుల రాపిడితో
గతపులోగిలి గడపదాటి
కాల గ్రంధిలో ఒక మెలిక తిరిగి
వీడ్కోలు చూపులతో
విడిచిన నిట్టూర్పుతో
జగతిని స్పృశించాయి
ప్రత్యూష పవనాలు.
నిశీధిని బ్రద్దలు చేస్తున్న
వేగుచుక్కతో తొంగి చూశాయి
తూరుపున పసిడి వెలుగులు.
బాల భానుని కిరణాల గిలిగింతకు
పుడమి నవ్వుతోంది పూవులతో.
వెలుగు వాకిటి తలుపులు
భళ్ళున తెఱచుకొని
మల్లెసుగంధాలతో అడుగిడింది
నవ యౌవ్వన జవ్వని
జిలుగు వెలుగుల సోయగాల
"నవయుగాది"
"నేను లేని సందడి ఎక్కడిద"ని
గారాలు పోతున్నది కోయిల.
"ఈ సంబరాలెందుకా" అని
కొండదారి మలుపులో
క్షణమాగి చూస్తున్నది చిట్టేరు
భవితవ్యంలోకి
సందేహంగా చూస్తున్న కనులకు
సమాధాన మిస్తున్నాయి
లేలేత చిగురుల కొమ్మలు.
ఈ వసంతాగమన శుభవేళ
నిశ్శబ్ద స్వాగతగీతిని ఆలపించటానికి
ప్రకృతి శ్రుతులు సరిచూసుకుంటున్నది.

— దుర్గ

# గోరంత దీపం

'రావుకి నేనంటే ఎంత ప్రేమో!. ఇతవికేం తెలుసు ?' అనుకుంటోంది.

"మీకు అంతగా అతడ్నే పెళ్ళి చేసుకోవాలని ఇష్టం అవుతే, చెప్పండి. నేను నాన్నగారితో మాట్లాడి ఒప్పిస్తాను ..."

దభీమని దగ్గరగా వేసి ఉన్న తలుపు తెరుచుకోవటంతో, ఉలిక్కిపడి మాటలు ఆపి లేచి నిలుచున్నాడు హరి.

ఎదురుగా పరశురాం కళ్ళలోంచి నిప్పులు కక్కుతూ నిలుచుని ఉన్నాడు. అతను ఏదయితే అబద్ధం అవుతే బావుణ్ను అనుకుంటూ వచ్చాడో అదే కళ్ళకు కట్టినట్లుగా చూడవలసి రావటంతో ఒక్క క్షణం మెదడు మొద్దుబారినట్లయి పోయింది.

పిచ్చిదానిలా తండ్రి వయిపు చూస్తున్న అరుణ, ఆయన "అరుణా," అని ఒక్కసారి అరిచేసరికి, ఒక్క పరుగున వచ్చేసింది.

"ఛీ! ఇంత సిగ్గులేకుండా ప్రవర్తించేందుకు నీకేం తక్కువ చేశాను ? నా కడుపున ఎందుకు పుట్టావే నువ్వు? పద ఇంటికి" అని అరుణ చేయి పట్టుకుని లాక్కువెళ్ళబోయాడు పరశురాం.




నిందిస్తే కుంగిపోవడం, పొగిడితే పొంగిపోవడం సాధారణంగా కానవస్తుంది. కొందరు తమ్మ నిందిస్తే తుడిచివేసుకొని, పొగడ్తకు ఆనందిస్తారు. ప్రఖ్యాతులు చిన్న వాళ్లవల్ల తమ పనిని జరుపుకోడానికి వాళ్లను మిక్కిలి అభినందిస్తారు. అదిగ్రహించక, పెద్ద వాళ్లు మెచ్చుకుంటున్నారనే ఉత్సాహంతో వారి పొగడ్తలకు పొంగిపోయి, వాగ్దానమిచ్చి, తమకు రానున్న ఆపదను కూడా తెలుసుకోక పెద్దల పనికి పూనుకుంటారు. మానవులకే కాదు; దేవతలకు కూడా ఇది సహజంగా కానవస్తున్నది.

యుగయుగాలమాట తారకుడనేరాక్షసుడు పెట్టే హింసలను సహించలేక దేవతలు తమ్మ కాపాడాలని బ్రహ్మతో మొర పెట్టుకొన్నారు. బ్రహ్మ బాగుగా ఆలోచించి "పార్వతీ పరమేశ్వరులకు కలిగిన కుమారుడు తప్ప మరెవ్వరూ ఆ రాక్షసుణ్ణి చంపలే"రని చెప్పాడు. అప్పటికి ఇంకా శివుడు పార్వతిని వివాహమాడలేదు. సతీదేవి వియోగం వల్ల విరక్తుడై తపస్సు చేసుకుంటున్నాడు. తండ్రి ఆజ్ఞ ననుసరించి పార్వతీదేవి చెలికత్తెలతో ఆతనికి సేవ చేస్తూ ఉండినది. శివుడు వైరాగ్యం విడిచి, పార్వతిని ప్రేమించి వివాహమాడేటట్లు చూడవలెనని బ్రహ్మ సలహా యిచ్చి, తన్ను ప్రార్థించిన ఇంద్రాది దేవతలను పంపివేశాడు.

మన్మథుడివల్లనే యీ పని జరగగలదని ఇంద్రుడు గ్రహించి, అతనిని రప్పించి మిక్కిలి పొగిడాడు. ఆ పొగడ్తకు పొంగి మన్మథుడు "నీకు ఏమి కావాలో చెప్పు. నేను శివుణ్ణి కూడ లొంగదీసుకోగలను" అని అన్నాడు. "శివుణ్ణి లొంగదీసుకోవడమే ఇప్పుడు నాకు కావలసిన పని. అతనికి పార్వతిపై మోహం కలిగేటట్లు చెయ్యి. శివుడామెను వివాహమాడితే— ఆ దంపతులకు కలిగే పుత్రుడే తారకుణ్ణి సంహరించగలడు. దేవతల బాధలు నశిస్తాయి" అని అన్నాడు. ఇంద్రునివంటి వాడు తన్ను కోరినందున మన్మథుడు పొంగిపోయి, తన బలగంతో శివుడు తపస్సు చేస్తున్న చోటికి వెళ్లి పార్వతి శివునికి శుశ్రూష చేస్తున్నప్పుడు అతని మనస్సు ఆమెపై వ్యాపింపచేటట్లు చేశాడు. వెంటనే శివుడు తన మనస్సును ఆమెపై నుండి మళ్లించి, తన మనశ్చాంచల్యానికి మన్మథుడే కారణమని తెలుసుకొని, కొద్ది దూరంలో ఉండి తనపై పుష్ప బాణాలను ప్రయోగిస్తున్న మదనుణ్ణి మూడవ కన్నుతో చూచి భస్మం చేశాడు. నాటి నుండి మన్మథుడికి రూపం లేకుండా పోయింది. 

## గోరంత దీపం

హరికి ఏం చేయాలో, ఏం చెప్పాలో అర్థం కాలేదు. ఎలాగో నోరు పెగుల్చుకుని, "ఒక్క నిముషం ఆగండి. మీరు తొందరపడుతున్నారు ..." అన్నాడు.

"షటప్. ఏమిటి నువ్వు చెప్పేది. నిన్ను నమ్మి ఇంతవాణ్ణి చేసినందుకు నాకు మంచి శాస్తి చేశావు. పెళ్ళాం పోయినవాడివి, కావాలని ఒక్క మాట అడిగుంటే, నేనే తగిన అమ్మాయిని చూసి పెళ్ళి చేసుండేవాణ్ణి. ఎమీ ఎరగనివాడిలా ఉంటూ, నా బిడ్డ బ్రతుకు పాడుచేయటం ఎందుకు!? ఛీ! నీతో మాటలెందుకు ?" అని పెద్ద పెద్ద అంగల్లో మెట్లు దిగుతూ, అరుణని వెంట ఈడ్చుకుని వెళ్ళాడు.

గుమ్మంలో అలాగే నిలుచుని, ఎదురుగా బాల్కనీ అవతల కనిపిస్తున్న చీకట్లోకి శూన్యంగా చూస్తూ అలా ఎంత సేపు నిలుచున్నాడో అతనికే తెలీదు.

పరశురాం అంత కోపంగా ఎందుకువచ్చాడో: తన మాట విన్పించుకోకుండా అంత విసురుగా ఎందుకు వెళ్లి పోయాడో ఏమీ అర్థం కాలేదు. అసలు ఆయన ఎప్పుడు వచ్చాడు ? ఇంకా వారం రోజుల తర్వాత రావలసింది, ఆయన ప్లాన్ ప్రకారం. మనిషి, చెదిరినతల, అలసిన ముఖమూ నలిగిన బట్టలు చూస్తే—ఇప్పుడే ట్రయిన్ దిగినట్లుగాకనిపిస్తున్నాడు. అయితే నేరుగాఇక్కడి కెందుకు వచ్చాడు... ఒక వేళ రావుగాడు కానీ...

ఆపైన ఆలోచించ లేకపోయాడు. ఛీ! వాడొక కుక్కవాడ్ని గురించి ఆలోచించటంకూడా టైము వేస్ట్ చేయటమే అనిపించింది హరికి.

రాత్రి అంతా కళ్లు తెరుచుకుని కొంచెం సేపు పడకలో దొర్లుతూ, కొంచెంసేపు ఏదో ఒక పుస్తకాన్ని చదువుతూ గడిపాడు హరి.

అతని మనసంతా ఏదో అశాంతిగా ఉంది. ఆలోచనలు ఎక్కడికో వెళుతున్నాయి.

తను రమణని ఎంతగా ప్రేమించాడు ? ఆమె లేనిదే ఏం జీవితం? అనుకున్నాడు. ఆమె తననిలా ఒంటరి వాణ్ణి చేసి వెళ్లిపోతుందని కలలో అయినా అనుకోలేదు. తల్లి పోయినప్పట్నించీ ఏకాకిగా ఉన్నాడు. మధ్యలో కొంత కాలమే రమణ సాహచర్యమూ, ఆనందమూ. మళ్లీ ఒంటరిగా మిగిలిపోయాడు. కానీ అప్పుడున్న ఉత్సాహం ఎక్కడుంది ?నిర్లిప్తంగా రోజులు గడవటమే.

### ఉగాది

తెలుగోళ్ల యుగాచి తెలుగు
పలుకుల తేనెకు పునాది పావనగోమా
తల రూపముతో పూజలు
తలపై దాల్చు సురభియయి తన్మయ పరమున్!

పుల్లని కమ్మని పచ్చడి
పిల్లలు పెద్దలు తిని నవ పీయూషంబా
మెల్లగ దిగుచున్న దనన్
యెల్లరి నాల్కలు వొసరుచు నింకొంచెమనున్!

మన తొలిపండుగ తీపి
మన భాషా మన మనసులు మన కథ తీపి
మన భారతమే తీపి
మన మొక్కటి యనెడి జాతి మాటే తీపీ!

— యండమూరి వరసింహమూర్తి

మామగారు, కూతుర్నీ, 'గోరంత దీపాన్నీ' ఒకేసారి తన చేతిలో పెట్టారు. కానీ ప్రాణంగా ప్రేమించిన భార్యతో కలిసి సంతోషంగా జీవించే అదృష్టం తనకి లేకపోయింది. కనీసం ఆయన తనచేత పెట్టిన రెండో బాధ్యత అయినా సక్రమంగా నిర్వర్తించాలని తన ప్రయత్నం అందులోనే తన ఒంటరితనాన్ని మరచిపోయి మామూలుగా బతకడం అలవాటు అవుతోంది ఆఫీసులో అడుగు పెట్టాడంటే, అదొక ప్రత్యేకమయిన ప్రపంచం. ఆకలీ, నిద్రా, అలసట, ఇల్లు, ఒళ్ళు ఏవీ గుర్తురావు. అదే తనకి దేవుడిచ్చిన వరం అనిపిస్తుం దొక్కొక్కసారి.

రమణ చనిపోయిన వెంటనే దిక్కుతోచని పరిస్థితిలో, అంతులేని దుఃఖంలో, ఏ స్లీపింగ్ పిల్సో మింగి మెలకువ రాని నిద్రలోకి జారుకుందామా అని ఒకసారీ, ఈ ఇల్లు, ఊరూ, ఉద్యోగమూ అన్నీ వదిలేసి, దూరంగా పారిపోదామా అని ఇంకోసారీ అనిపించేది. ఆ పిచ్చి ఆలోచనలనీ, బాధనీ మరచిపోయేందుకు మనసుకి మత్తు కావాల్సివచ్చింది. దాన్నే తాను పగలూ, రాత్రీ అని భేదం చూసుకోకుండా పనిచేయటంలో సంపాదించుకున్నాడు.

[ఇంకా వుంది]



# "తరతరాలుగా మా కుటుంబంలో అందరం అయొడెక్స్‌నే నమ్ముకున్నాం..." అంటున్నారు గుమ్మడి.

నొప్పా? బెణికిందా? కండరాలు పట్టాయా? కీళ్ళు పట్టాయా? వీటన్నిటినీ నయం చేసేది అయొడెక్స్ నొప్పిని తగ్గించడం అన్నది అయొడెక్స్ యొక్క లక్షణం. అయొడెక్స్‌ని రుద్దుతుండగానే నొప్పి నుంచి ఉపశమనం కలుగుతుంది, లోపల, దుగ్మతగల పొరలు నయం కావడానికి మందంతా లోపలికి చొచ్చుకు పోయేందుకు అయొడెక్స్‌ని బాగా రుద్దండి. బాధ తగ్గినా కూడా అదే విధంగా అయొడెక్స్‌ని పదేపదే రాస్తూ వుండండి.

| | అయొడెక్స్ |
|---|---|
| ధాతువు (లోపలి పొర) దెబ్బతినడం | ✓ |
| నొప్పులు | ✓ |
| బెణకడం | ✓ |
| కీళ్ళు పట్టడం | ✓ |
| కండరాలు పట్టడం | ✓ |
| నడుం నొప్పి | ✓ |

## అయొడెక్స్®
మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.




LINTAS IODEX 71 232 TL

# సహచర్యం అంటే... జతగా కలిసి పని చేయడం!



ఫోర్ హేన్స్ డబుల్ యాక్షన్ టూత్ బ్రష్ లాగా. పళ్లను శుభ్రం చేయడం మరియు చిగుళ్ల మాలిష్ జతగా చేసే ఏకైక బ్రష్!

## ఫోర్‌హేన్స్
టూ-ఇన్-వన్ టూత్ బ్రష్




323F 232 TL

# సన్‌రైజ్
# కాఫీ-బిస్కెట్‌ల సదుపాయం

**ఉచితం!**

ప్రతి 50 గ్రా.ల సన్‌రైజ్
రీఫిల్ ప్యాక్‌తోబాటు
ఒక పార్లే గ్లూకో బిస్కెట్ ప్యాకెట్




కొత్త
Nestlé
**సన్‌రైజ్**
ఇన్‌స్టెంట్

ప్రాతఃకాలపు ఆ తాజాతనాన్ని అనుభూతి చెందేందుకు

HTD-FSL-8212 TEL

# వ్యక్తిగతం



కులపతి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు మార్చి 17న తమ 68వ ఏట మరణించారు. ఈయన సుప్రసిద్ధ హోమియో వైద్యులు, వేద విజ్ఞాన విషయాలపై ఎన్నో గ్రంథాలు రాశారు, వరల్డ్ టీచర్స్ ట్రస్ట్ వ్యవస్థాపకులు శ్రీ కృష్ణమాచార్యులుగారికి దేశంలోనే కాక విదేశాలలో కూడా ఎంతో మంది శిష్యులు ఉన్నారు



సఫుర్ నిజామీ ఉర్దూ కవి పండిత జవహర్‌లాల్ నెహ్రూ స్నేహితుడు ఇటీవలే కొత్త ఢిల్లీలో మరణించారు ఆయన వయస్సు 78



తోషిరో మిఫూనె ఏయస్సు 63 126 సినిమాలలో వేశాడు వాటిలో ''రాషమోన్'' బాగా పేరు పొందింది ఇటీవలే ఈ జపాన్ నటుడికి అమెరికాలో సన్మానాలు జరిగాయి ఈయన విలువిద్య, జూడో, కెండోలలో నిపుణుడు ''నేను ఎప్పుడూ బాగా నటించనేమో గాని జపాన్ జాతీయ భావాలకి అనుగుణంగా నటిస్తాను!'' అంటాడు ఆయన.



ఫ్రెడ్‌కో అనే అతను అమెరికా సంయుక్త రాష్ట్రాల లోని వాషింగ్‌టన్ రాష్ట్రానికి చెందిన స్పోకేన్ ఊరువాడు —ఇతను అస్తులు కొని అమ్మే వ్యాపారం చేసేవాడు. కనీసం నాలుగు, బహుశా 15 రేప్‌లు చేసినందుకు శిక్షింపబడ్డాడు. చివరికి బయటపడే దాకా ఇతను చాలా మర్యాదస్తుడుగా చెలామణి అయ్యేవాడు




13-4-1984 శుక్రవారం మొదలు 19-4-1984 గురువారం వరకు

♈ మేషం 'ఏమో ఏం మేలు జరుగుతుందో, వారం వారం యిలాగుందే' అనుకోరాదు అనేక రీతుల మేలైన వారం అప్రయత్న ధనాదాయానికి నెలవైన వారం అప్పులు కూడా వసూలవుతాయి, యత్నించండి వ్యాపారం భారీదయితే లాభిస్తుంది స్త్రీలకు నూతన విధాన ధనాదాయం, గృహానందం

♉ వృషభం విద్యావైజ్ఞానికంగా మీకు పేరు ప్రతిష్ఠలు రానున్నవి ఆశ్రిత వర్గాన్ని, స్తోత్ర ప్రియులను దాపునకు రానీయకండి అప్పులివ్వటం మానుకోవటం మేలు డబ్బు యిచ్చి కూడా నిష్ఠూరాలకు గురికావటం అనవసరం స్త్రీలకు ధనలబ్ధి, శుభ ప్రస్తావనలు, గృహానందం గల వారం

♊ మిథునం ధనాదాయం గల వారం 'శుక్ర, శని వారాలు' మరీ లాభదాయకం అనుకూలదాయకం, గృహానందదాయకమైన వారం కళా రంగానుభవం గలవారికి అనుకూలమైన వాతావరణం ఏర్పడనున్నది ఆటలందు అనుభవం గలవారికి అనుకూలత గలవారం స్త్రీలకు గృహానందం, ఉద్యోగాభివృద్ధి

♋ కర్కాటకం ఎన్నో వారాలుగా, ఏ విధంగా ప్రయత్నించినా సానుకూలపడని ఒకానొక వ్యవహారం లాభదాయకంగా పరిణమించగలదు గమనించండి చాలకాలంగా చేతికి అందని ద్రవ్యం సహాయావంగా అందటం గమనించగలరు స్త్రీలకు నూతన వస్త్ర సేకరణ, ఉద్యోగావకాశాలు చెప్పదగిన అంశాలు

♌ సింహం శక్తి వంచన లేకుండా పాటుపడదగిన వారం 'సోమ మంగళ వారాలు' మరీ యోగదాయకమయినవి అప్రయత్నంగా లాభదాయకం చాలమంది గృహ నిర్మాణ బాధ్యతను పైన వేసికోగలరు స్త్రీలకు అనుకొనని రీతిగా ఉద్యోగాభివృద్ధి చేకూరుతుంది ఆరోగ్య లోపం లేదు

♍ కన్య గమనించండి విలాస వస్తువులు కొనుగోలు చేయగలరు వినోద కార్యక్రమంలో పాల్గొనగలరు కొందరు సభా కార్యక్రమమందు, సాంఘికంగా, రాజకీయంగా పాల్గొనుట గ్రహింపగలరు స్త్రీలకు బంధువర్గీయుల రాక, గృహ వ్యవహారాలలో సతమతం కాబోవటం చెప్పదగిన అంశాలు

♎ తుల మీ కొందరపాటు మీకు యిబ్బంది తెచ్చిపెట్టనున్నది పరులను సందేహించటం మీ ప్రవృత్తి అదేమంత మంచి పని గాదు మీరు పత్రికా ప్రకటనకర్తలయితే సామాన్యమైన ఆదాయానికి లోపం రానీయని వారం స్త్రీలకు గృహానందం, ఉద్యోగమందు ప్రగతి సూచకమైన వారం గమనించాలి -

♏ వృశ్చికం వస్తువులు సేకరించుటకు అవకాశమున్నది పదిమందిలో పేరు ప్రతిష్ఠలు రానున్నవి, నూతన మార్గాన ఆదాయం చేకూరగలదు దూర ప్రాంతాల నుండి బంధుమిత్రులు యింటికి రాగల అవకాశాలున్నాయి స్త్రీలకు బంధుప్రీతి, వస్త్ర సేకరణ, అధికారుల ఆదరణకు అవకాశం గల వారం

♐ ధనుస్సు మీకు గల వ్యవహార జ్ఞానం లాభదాయకమవుతుంది మీ ఆరోగ్యమందు అభివృద్ధి సూచక వారం ప్రజ్ఞాపాటవం రాణించనున్నది భిన్న మార్గాల మీకు ఆదాయం రానున్నది. సుఖశాంతులకు లోపం లేని వారం స్త్రీలకు వైజ్ఞానికంగా పెంపు, వృత్తియందు అభివృద్ధి, దైవకార్యాచరణయందు ఆసక్తి గలవారం

♑ మకరం కళా సాహిత్య రంగాలలో మీకు పదవకాశాలు లభ్యం కానున్నవి వృత్తియందు పెంపు కనిపించనున్నది రాజకీయ రంగాన మీకు మేలు సమకూడుటకు అవకాశమున్నది అవకాశవాదులను దరిచేరనీయకండి సుఖ శాంతులకు లోపం ఏర్పడుతుంది జాగ్రత్త! స్త్రీలకు చాలకాలంగా వేధించే ఒకానొక విషయం సుకరంగా నెరవేరుతుంది గమనించాలి

♒ కుంభం మీ వృత్తిలో పెంపు కనిపిస్తుంది ఉద్యోగమందు ప్రకాశమున్నది నాలుగు కొందరు చేసిన నూతనోద్యోగ ప్రయత్నాలు సుకరంగా నెరవేరుతాయి శుభకార్య ప్రస్తావనలకు కూడా అవకాశం గల వారం స్త్రీలకు బంధు విరోధం, చుట్టుప్రక్కల వారివలన యిబ్బందులు ఏర్పడుతవి

♓ మీనం జాగ్రత్తగా ఉండాలి ఏదో యిబ్బంది రానున్నది వ్యవహార వ్యాపార రంగాలలో యిబ్బందులు రానున్నవి కొందరు వృత్తి రీత్యా చేసే ప్రయత్నాలు రాణింపునకు రానున్నవి ఆదాయంలో చెప్పదగిన అభివృద్ధి లేదు స్త్రీలకు యత్న కార్యసిద్ధి, వృత్తియందు అభివృద్ధి గల వారం, గమనించాలి

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి★

# త్వరలో

## రంగురంగుల హంగులతో
## మీ చేతులనలంకరించబోతోంది

# పల్లకి

### సచిత్ర వార పత్రిక

పల్లకిలో మీరు కోరుకున్న విధంగానే నాలుగుసీరియల్స్ ఉంటాయి. అవి మీకిష్టమైన రచయిత, రచయిత్రులవే.

**1** శ్రీమతి............?

ఈమె స్త్రీ పక్షపాతి అని మగవారి ఆరోపణ ఏమన్నా ఆవిడకు కోపమే అని కొందరు స్త్రీలంటుంటారు. కానీ అందరికీ ఆమె అభిమాన రచయిత్రే! కథాంశంలో సామాజిక స్పృహ ఈమె ప్రత్యేకత.

**2** శ్రీ......?

ఇది నిజంగా నిజమే అనిపించే అద్భుత విషయాలతో మిమ్మల్ని మరో లోకంలోకి తీసుకుపోతుంటారు ఈ రచయిత. సైన్స్ రచనల్లో తనకు తానే సాటి అని మరోసారి రుజువు చేశారు.

**3** శ్రీ......?

కొత్త ఒరవడి, కొత్త పుంతలు, ఎవరూ ఎన్నడూ చేయని నూతన ప్రయోగాలు- ఇవన్నీ తనవిగా చేసుకొని యావత్పాఠక ప్రపంచాన్నీ వింత వింత అనుభవాల్లో తేలియాడిస్తున్న ఈ తరం రచయిత.

**4** శ్రీ..................?

మొదటి పేజీ నుంచే సస్పెన్సులో ముంచెయ్యడం, వారం వారం పత్రిక కోసం పాఠకుల కళ్ళు కాయలు కాయించడం ఈ రచయిత సహజలక్షణం నవలారంగంలో తిరుగులేని స్థానం సంపాదించారీయన

ప్రతి రచయిత, రచయిత్రికి తనదైన ఓ ప్రత్యేక శైలి, ఒరవడి వుంటాయి. మన పత్రికలో ఎవరెవరు రాస్తున్నారో తెలివిగల మీరు ఈ పాటికి గ్రహించే వుంటారు. లేదా కొస్త ఆలోచించి వచ్చేవారం చూడండి.



## చెయ్యని నేరానికి శిక్ష అనుభవించి, శిక్షానంతరం జైల్లోనుంచీ బయట పడినవాడి మనసెలా వుంటుందో చెప్పగలరా ? అది అనుభవైకవేద్యం.

ఆనాటి సాయంకాలం ఒగానొక సభలో నుంచీ ఈవలికి వచ్చేటప్పటికి నాకు కలిగిన అనుభూతి అలాంటిదే! బాహాటంగా లెంపలు వేసుకోక పోవడమొకటే కొదవ. ఏకోశాన్నయినా బుద్ధి అనేది వుంటే భవిష్యత్తులో యిట్టి పనికి పాల్పడగూడదని నాలోనేను చాలాసార్లు అనుకున్నాను. ఇంతకూ ఆ సభ సంగతేమిటో చెప్ప లేదు.దూ! అదొక సన్మాన సభ. చెబుతే మీరు నమ్మరేమో ' ఆ సన్మానం జరిగింది నాకే!

'లలితకళాసమితి' అనే పేరు తమరు వినే వుంటారు. ఇంచుమించు అదే పేరుతో ప్రతి పట్టణంలోనూ ఒక సంస్థ వుంటుంది. ఎందుకుంటుందని అడక్కండి! గాలి ఎందుకువీస్తుంది? నీరెందుకు ప్రవహిస్తుంది? కొన్ని కొన్ని సంఘాలందుకే వుంటాయి. చెప్పొచ్చిందేమిటంటే రంగరాజపురంలో అలాంటి కళాసమితి ఒకటుంది. ప్రతి సంవత్సరమూ వార్షికోత్సవంనాడు ఒక కవిని 'యథోచితం'గా సత్కరించడం వాళ్ళ ఆదినుంచీ పాటిస్తూ వస్తున్న సాంప్రదాయమట! 'ఈసారి వంతు మీదే' నంటూ వాళ్ళు నాకొక ఉత్తరం రాసి పోస్టు చేశారు. వాళ్ళ అభిమానానికి ఉప్పొంగి పోయినప్పటికీ. నేను నా అశక్తతను గూడా గుర్తించినవాడినై 'అయ్యా! మీరేమిటో పొరపాటుపడినట్టున్నారు, నేను కవిని గాను. ఛందస్సురాదు. కేవలం వచనం మాత్రమే రాస్తాను., దయచేసి మీ కార్యార్థం నిజమైన కవి నెవరినైనా చూచుకోండి' అంటూ నా ఆంతర్యాన్ని ప్రత్యుత్తరంద్వారా తెల్పుకున్నాను. కానీ అదంతా కుదరదని వాళ్ళు నిక్కచ్చిగా తేల్చి చెప్పేశారు. 'అబ్బే, మీరలా అనగూడదు సార్! మా సంకల్పం తిరుగులేనిదని మీరు గుర్తించాలి. మా వూరికి వందమైళ్ల పరిధిలో వున్న కవుల్ని మేము ఖాళీ చేసేశాము. వ్యాసార్థాన్ని కొంచెం హెచ్చించినందువల్ల మీరు మాకు దొరికి పోయారు. మిమ్మల్ని వదిలే ప్రసక్తి లేదు. మీరు రాకా తప్పదు. మా సన్మాన్ని స్వీకరించకా తప్పదు' అంటూ వాళ్ళు నన్ను ఒకటే మొగమాట పెట్టేశారు. ఇక గత్యంతరం లేక రెండు మూడు బస్సులు మారి, ఒక పగలంతా ప్రయాణంచేసి సభ జరిగే సమయానికి వేనాపూరు చేరుకున్నాను.

చనిపోయినవాడు గాయకుడని తెలిసేటప్పటికి వాడి శవాన్ని బాగా లోతుగా పాతిపెట్టండి, అన్నాడటగదండీ ఔరంగజేబు! మన సమాజంలో కళాకారుల స్థితిగతులు అంతకంటే మెరుగ్గా లేవేమోనని నా అనుమానం. ఉదర పోషణకోసం ఏ వృత్తినో, ఉద్యోగాన్నో ఆశ్రయించి అదొక ఉబలాటంగా కళకోసం పరిశ్ర





# సన్మానం

## మధురాంతకం రాజారాం

మించే వాళ్లే ఎక్కువ. కానీ రంగరాజపురంలోని పరిస్థితులు నా ఊహకు విరుద్ధంగా వున్నట్టు తోచింది. కాకపోతే ఒక కళాసమితి వార్షికోత్సవానికి బ్రహ్మాండమయిన షామియానాలా? పది పన్నెండు కార్లా? అత్యంత ఆధునికమైన ఆసన సదుపాయాలా? వెదురుగడ లన్నింటికీ విద్యుద్దీపాలా? ఈ రంగరాజపురం కళాకారులెవరోగానీ, వీళ్లు బాగా జరుగుబాటు గల వాళ్లయి వున్నారు—అనుకున్నాను.

అంతటి గొప్ప సభలో సన్మానాన్ని అందుకోబోతున్నానన్న భావం నాలో ఎనలేని ఉత్తేజాన్ని చేకూర్చింది. కాలరు సవరించుకున్నాను క్రాపింగు సర్దుకున్నాను. దుమ్మూ, ధూళీ పోయేటట్టుగా ముఖాన్ని అరచేతితో రుద్దుకున్నాను. కానీ, ఏదీ! నన్ను ఎవరూ పలకరించరే!

అంతలోనే నాపొరబాటు నాకు తెలిసొచ్చింది తొందరపాటుకు నొచ్చుకున్నాను కొండలుదాటి, కోనలుదాటి, పల్లెలూ పేటలూదాటి నా కీర్తి అయితే యింతదూరం ప్రాకి వచ్చేసిందిగానీ, నా మూర్తి వాళ్లకేంతెలుసు? పలకరించాలంటే నేనెవరినో తెలియాలిగదా! అందుకని నన్నునేను పరిచయం చేసుకోడం అప్పట్లో నా విద్యుక్త ధర్మమని గ్రహించాను.

సీట్లన్నీ నిండిపోవడంవల్ల పందిరిచుట్టూ అర్ధచంద్రాకారంగా నిల్చున్న, జనంలోనుంచీ చొచ్చుకుని వెళ్లి, కుర్చీలపద్మవ్యూహాన్నిగూడా దాటి, గుంపుగా నిల్చున్న కార్యకర్తల దగ్గరికి వెళ్లగలిగాను. ప్రముఖులు, దిగ్దంతులు, హేమాహేమీలు అంటూ తెలుగుభాషలో కొన్నిమాటలున్నాయి గదండీ! వాటిని సార్థకంచేస్తున్న ఆకారాలతో, వేషాలతో, హావభావాలతో ముందు వరుసలోకూర్చున్న పెద్దలతో కార్యకర్తలందరూ ఒక్కుమ్మడిగా సంభాషిస్తున్నారు. అందరిలోనూ కొంచెం సౌమ్యుడుగా కనిపించిన ఓ కార్యకర్తను సమీపించి 'అయ్యా! నేను ఫలానావాణ్ణి. ఇంతకుముందే బస్సుదిగాను. నేరుగా సభకే వచ్చేశాను' అని తెలియపరచుకున్నాను.

ఆ కార్యకర్త నావైపు అయోమయంగా ఎగాదిగా చూచాడు. ఆచూపువల్ల నావాలకం అతడికట్టే రుచించలేదని నాకు బోధపడింది. 'అలాగా! కవిగారు మీరేనా?' అన్నాడు. అను

# ఏది నిజం ?

ఈ స్వాస్థ్యం, ఈ నిలకడ,
ఈ సుఖానుభూతి సత్య
మని ఆనందించు వారు
ఘనతర మాయావృతులట !
రకరకాల సూక్ష్మ కణాల్
రకరకాల మేళవింప
రకరకాల పదార్థాలు
సుకరముగా సృష్టమయ్యె !
సూక్ష్మకణాలొక్కొక్కటి
అక్షంపై తిరుగుతునే
అన్యకణం చుట్టుతిరుగు
నన్యోన్య బలాల చిక్కి !
కణముల వ్యూహాలే పర
మాణువులై, అణువులునై
ఘనమును, ద్రవమును, వాయువు
లను ద్రవ్యస్థితులు కలిగె.
ద్రవ్యానికి మూలాధా
రాలైన కణాలు సతము
భ్రమణ పరిభ్రమణములకు
లోనై నర్తించుచుండు.
సూక్ష్మ లోకమట్లుండగ
స్థూల లోక మెట్లున్నది ?
అసంఖ్యాక తారాసము
దాయమ్మే గేలక్సీ;
అందులోని నక్షత్రా
లన్నీ తమ అక్షంపై
అహరహమును తిరుగుచుండు.
అక్షంపై గేలక్సీ
యావత్తు భ్రమించుచుండు.
అట్టి భ్రమణ ఫలితంగా
అహస్కరువితో భూమియు
సెకను కారు లక్షల మై
ళ్లు కాయెకిని పోవుచుండు
ఆకాశ పదాల చిమ్మ
చీకటి గల రోదసిలో !
స్థిరమెక్కడ భూమికి ? మరి
స్థిరమెక్కడ జీవుల ? క
స్థిర జీవనమే నిజమ్మ !
కణాలోకంలో భ్రమణం,
అణులోకంలో గమనం,
తారాలోకాలలోన
తరగని భ్రమణం గమనం.
ఇది సత్యము ! విజ్ఞానం
బీ విషయం ఘోషించును !
కాని, భ్రమణ గమన మసలు
అను భూతంకాదు మనకు !
అనుభవమే నిజమౌనా ?
విజ్ఞానం నిజమౌనా ?

— వసంతరావు వేంకటరావు

## సన్మానం...

మానమూ, నిరుత్సాహమూ సమపాళ్లలో కలసి వున్న ఆమాటలు నన్ను క్రుంగదీశాయి.

కవికి, రచయితకువున్న తేడా ఏమిటో ఆకార్యకర్తకు వివరించేపాటి ఓపిక నాకప్పుడు లేదు. ఎక్కడో ఒకచోట కొంచెం కవిత్వం కూడా వెలిగించి వుంటారు గనుక రచయితను కవి అనుకున్నా కొంప మునిగేదేమీ లేదు. ఎటొచ్చీ 'కవిగారు మీరేనా?' అనటం దగ్గరే చిక్కు. 'నాయనా! ఈ శరీరం నాది గావడంలో నా ప్రమేయమేమీ లేదు. ఇక దుస్తులంటావా ? అవసరాన్ని గడుపుకోవడానికని తప్పితే ఆడొక హంగుగా ముస్తాబు చేసుకునే ఆర్థిక స్తోమత నాకు లేదు' అని నోరు విడిచి చెప్పకోడానికీ మనస్కరించలేదు. ఇలాంటి విపత్కర పరిస్థితి ఎదురైనప్పుడు ఒక గెజెటెడ్ ఆఫీసరుచేత అటెస్టు చేయించుకున్న స్వంత ఛాయాచిత్రం ఒకటి జేబులో వుంటే ఎంత బాగుండేదని నాకప్పుడనిపించింది.

తుది నిర్ణయం తీసుకోడం ఆ కార్యకర్తకు యిష్టం లేదల్లే వుంది. టీచరుతో చాడీ చెప్పదలచుకున్న బడి కుర్రాడిలా 'ఉండండి. సెక్రెటరీ గారితో చెబుతాను' అంటూ వెళ్లి ఇంకొక ఆసామిని నావైపు తోలుకొచ్చేశాడు.

సెక్రెటరీ కాబోలు, పొడుగ్గా జుబ్బా తొడుక్కుని, పట్టుదుప్పటం ఒకటి వల్లెవాటుగా వేసుకొని, కళ్లద్దాలు తొడుక్కుని అసలుసిసలు బెంగాల్ బాబల్లే వున్నాడు.

''ఏమండీ! ఇప్పుడొస్తున్నారా ? మీకు మా ఇన్విటేషన్ చేరలేదేమిటి?''

ఇన్విటేషన్ చేరలేదనీ, ఉత్తరాలు మాత్రం అందాయనీ చెప్పకున్నాను. నా మాటలు నాకే క్షమాపణలాగా ధ్వనించాయి.

అంతటితో ,నా అవకతవక ప్రవర్తనంతా క్షమించేస్తున్నట్టుగా అతడు 'న ర్సిం హం ! కవిగారికో ఇన్విటేషనివ్వు' అని పురమాయించి 'మీరు కూచోండి సార్ ! పదినిమిషాల్లో కార్యక్రమం ప్రారంభమవుతుంది'అంటూ వేదికపైకి వెళ్ళిపోయాడు.

చీరకు తగ్గ పీటలా ఇన్విటేషనుగూడా ఆ సభకు తగ్గట్టే అమిరందని చెప్పాలి. ఎం. ఎల్. ఎ. లు, మున్సిపల్ చేర్మన్లు మొదలైన వాళ్ళు రాజకీయాల్లోనే వుండాలనుకోడం పొరపాటనీ, వాళ్ళప్పుడప్పుడూ కళారాధనకు గూడా పూనుకో వచ్చునని నేనా ఆహ్వానపత్రం ద్వారా గ్రహించాను సభకు అధ్యక్షత వహిస్తున్నది శ్రా వ ణం కనకయ్య, ఎం. ఎల్. ఎ. గారు. ముఖ్య అతిథిగా విచ్చేసింది కొప్పల సుబ్బారావు, మునిసిపల్ చేర్మనుగారు. బహుమతి ప్రదానం గావించేది కె. డి. యస్. మూర్తి, మెంబరు, ఎ. ఐ. ఎఫ్. ఎస్. సి. న్యూఢిల్లీగారు. కళాసమితి ఆవరణలో అంగళ్ల కోసం కట్టిన కొత్తగదులకు ప్రారంభోత్సవం గావించడం కోసం విచ్చేసినవారు డి. ఆర్. గూటాల, ఎం. ఎస్; ఆర్. ఎం. ఓ, పూనాగారు 'గారు' అనే గౌరవవాచకం కొన్నిచోట్ల ఆయా వ్యక్తుల్ని వరించిన పదవులకు, మరికొన్ని చోట్ల ఆ వ్యక్తులు నివసిస్తున్న పెద్ద పట్నాలకు జోడించివుండడం యిందులో గమనించదగ్గ విశేషం, ఉచితజ్ఞులైన కార్యనిర్వాహకులు నేను చేసే ఉద్యోగంగానీ, నివసించే ఊరుగానీ అంత ఘనమైనవేమీ కాదని యిట్టే తేల్చేశారు. ఇన్విటేషనులో నాపేరు లేకపోలేదుగానీ, దానికోసం నేను చాలాసేపు వెదుక్కోవలసి వచ్చింది.

సెక్రెటరీ గారన్నట్టుగా పది నిమిషాల్లోనే సభ ప్రారంభమైపోయింది. ప్రారంభమైన సభ కొనసాగింది, ముగిసింది. కానీ ఎట్లా జరిగిందని చెప్పవలసివస్తే, అదంతా పెద్దకథ. ప్రేక్షకుల్లో ఎక్కువమంది సభానంతరం జరిగే నాటక ప్రదర్శన కోసం వచ్చినవాళ్లు నాలుగ్గంటలకల్లా మేకప్పు పూర్తిచేసుకుని నటీనటులు గ్రీన్ రూములో వుండిపోతున్నారు.అప్రేక్షకులకున్నూ, ఈ నటీనటులకున్నూ నడుమ ఉపన్యాసకులు అదేపనిగా ఊకదంపుడు మొదలెట్టేశారు. గట్టి గింజ ఒకటి వుంటే ఒట్టు. ఒక్క 'కళ'ను గురించి తప్పితే మిగిలిన సర్వ విషయాలపైన వాళ్ల ప్రసంగాలు దొర్లిపోయాయి. 'నేను నిన్ను పొగడినంతమేరకు నువ్వు నన్ను పొగడాలి'అంటూ ఒక లోపాయికారీ ఒప్పందం వాళ్ల మధ్య కుదిరిందేమోనని సభికులు అనుమానించే పరిస్థితి ఏర్పడింది. ఫలానా విషయాన్ని గురించి మాట్లాడాలన్న అభిప్రాయమేమీ లేకపోవడం వల్ల వాళ్ల భావాలు అదుపు తప్పిన రాకెట్లూ, వాక్యాలు బ్రేకుల్లేని బస్సుల్లా ప్రేక్షకుల అవగాహనతో కుస్తీ పట్టసాగాయి. వేదికనలంకరించిన పెద్దలు సభలో చెలరేగుతున్న అలజడిని కూడా గొప్ప అప్రీసియేషన్‌గా భావించడంతో సభ రసాభాసమైపోయే పరిణామం కూడా నాలుగైదుసార్లు పొడసూపింది.

చల్లకొచ్చి ముంత దాచుకోడమెందుకు ? ముఖ్యంగా చెప్పవలసింది ఆ సభలో నాకు జరిగిన సన్మానం గురించి గదా ! ఆ విషయంలోకే వస్తున్నాను. సన్మాన చిత్రహింసకు ప్రధానంగా గురైంది నా పేరు. ఎన్నడూ విన్నది కాదేమో ! దాన్ని ఒక్కొక్కరూ ఒక్కొక్క విధంగా ఉచ్చరించారు. మాటవరసకు నా పేరు గంగవరం శంకరయ్య అనుకోండి. ఒకాయన శంకవరం గంగిరయ్య అన్నారు. ఇంకొకాయన వరశంకం కంకరయ్య అన్నారు. ఇంకొకాయన శంకర్రాం గంగారాం అన్నారు. (బహుశా ఆయన పూనా వారై వుండాలి) జరాసంధుణ్ణి భీమసేనుడు కూడా అంత నిర్దాక్షిణ్యంగా చీల్చి పారవేసి వుండడు. అన్నట్టు సభికులకు నన్ను పరిచయంచేస్తూ, సెక్రెటరీబాబుచేసినప్రసంగం వుందే, అది నా సన్మానానికల్లా హైలైటు.,

# సన్మానం....

'అయ్యా! చూచారా!' అంటూ ఆయన గొంతు సవరించుకున్నాడు ... "ఈయన, గువ్వపిట్టలా ఈ కుర్చీలో ఒదిగి కూర్చున్న ఈయన, ఎవ్వరో ఎరుగుదురా? ప్రసిద్ధ కవీశ్వరుడు. మీరు పోతన్న, మల్లన్న, ఎర్రన్న, తిక్కన్న మొదలైన పేర్లు వినేవుంటారు. అలాంటి వాడన్నమాట! కానీ ఏం లాభం? మారుమూల కుగ్రామంలో ఈయన ఒక బడిపంతులుగా అఘోరిస్తున్నాడంటే అదెంత సిగ్గుచేటో నేను చెప్పలేను (?) ఇటువంటి వాళ్లని బహిరంగానికి తెచ్చి గౌరవించడం మనధర్మం. దుశ్శాలువతోను, మాట పదార్లతోను వీరిని సన్మానించవలసిందిగా అధ్యక్షులవారిని ప్రార్థిస్తున్నాను".

పూలదండ వేస్తుండగా ఒకటి. శాలువా కప్పుతుండగా ఒకటి. పెళ్లెం చేతికిస్తుండగా ఒకటి. ఆ ఫొటోల తతంగంమాత్రం ఎంతో నింపాదిగా జరిగింది. వార్షికోత్సవాల ప్రయోజనమంతా పత్రికల్లో ఫొటోపడడమే అయినప్పుడు, ఆవనిర్వైన నిర్వాహకులు ప్రత్యేకశ్రద్ధ వహించడంలో ఆశ్చర్యమేముంది? పత్రికలవాళ్లు ఎట్లాగైనా రచయితలకు సగోత్రీకులు. ఎవరికో ఒక రచయితకు ఎక్కడైనా సన్మానం జరిగిందంటే వాళ్లకు పరమానందం.

సదరు సన్మానవస్త్రాన్నీ, ద్రవ్యాన్నీ గూడా సంచీలోవుంచుకుని, యింకా మనిషి ముఖం మనిషికి కనిపించని మసకచీకట్లో మరునాటి ఉదయం నేను బస్సెక్కేశాను. రాత్రంతా వేడుకలతో గడిచిందేమో. వెచ్చని బస్సులో గాఢంగా నిద్రపట్టింది. తొమ్మిదింటికి కళ్లుతెరిచేసరికి కనిపించిన వూరు రాయచోటి. అక్కడ బస్సు మారాలి. దిగేటప్పటికి ఎక్కవలసిన బస్సు స్టాండులోనే ఉంది. ఎక్కి కూర్చున్నాను. టిఫెన్ చేయలేదన్న విషయం అప్పుడు జ్ఞప్తికి వచ్చింది. బస్సు బయల్దేరడానికి గూడా యింకా వ్యవధి వున్నట్టు ఎవరో అన్నారు. కానీ రాజకీయాల్లోలాగే బస్సుల్లోగూడా సీటు జారిపోతే మళ్ళీ దొరకడం కష్టం. ప్రక్కనే కూర్చున్న అబ్బాయితో సంచీ జాగ్రత్తగా చూచుకోమని చెప్పి, దిగి హోటల్లోకి వెళ్లాను.

పదినిమిషాల్లో తిరిగి వెళ్ళేసరికి రెండు సీట్లూ ఖాళీగా వున్నాయి.

"బాబ్బాబూ ! నా బ్యాగేమైంది ?" అంటూ గొంతు చించుకున్నాను.

"ఇందాకా అక్కడ కూచున్న అబ్బాయి ఎత్తుకు దిగేశాడే! అది మీబ్యాగా? అరరే, ఇట్టే బోల్తాకొట్టించేశాడే! పరుగెత్తండి సార్! వెళ్ళి చూడండి. వెదికిపట్టండి."

ప్రయాణీకుల సానుభూతికి ఇంధనంకాలేక బస్సులోనుంచి దిగేశాను. హఠాత్పరిణామం తాకిడికి బుద్ధి మొద్దుబారిపోయింది. ఏం చేయాలో తోచడంలేదు. ఏదైనా చేయాలన్న ఉద్దేశమూ లేదు. సంచీ తీసుకెళ్లిపోయిన వాడెవడో గానీ, వాడాపనిలో సిద్ధహస్తుడై వుంటాడు నాకు 'డిటెక్షన్'లో ఓనమాలైనా రావు. రోడ్డుపైన నిల్చుని అరిస్తే పదిమంది దృష్టినీ ఆకర్షించవచ్చు. కానీ అందువల్ల ఒరిగేదేముంది?

క్రితంరోజు సాయంకాలం కళాసమితి వాళ్ళిచ్చినవేగాక, నా దుస్తులు కొన్ని సంచిలో వుండిపోయాయి. చేతిఖర్చులకని తెచ్చుకున్న డబ్బుగూడా అందులోనే భద్రపరిచాను. గుప్పెడు చిల్లర డబ్బులు తప్పితే, నేనిప్పుడురిక్తహస్తుణ్ణి. బస్ ఛార్జీలకన్నా డబ్బు పుట్టించుకుంటే గానీ స్వగ్రామం చేరలేను. ఏది దారి?

బస్ స్టాండునుంచీ ట్రంకురోడ్డు దాకా నడిచాను. తెలిసిన ముఖమేదైనా కనిపిస్తుందేమోనని కాలేజి కాంపౌండులో ప్రవేశించాను. నా అదృష్టంకొద్దీ ఆ రోజు కాలేజికి సెలవు. చేసేదిలేక ఓ రావిచెట్టు నీడలో రాతిబెంచీపైన కూలబడ్డాను. దూరాన పిల్లలు కొందరు క్రికెట్టు ఆడుకుంటున్నారు. రోడ్డుపైన వాహనాలు సందడిచేస్తూ పరుగెడుతున్నాయి. కొమ్మలపైన పక్షులు కిచకిచలాడుతున్నాయి. ప్రపంచానికి సంబంధించినంతవరకూ అంతా బాగానే వుంది. ఒక వ్యక్తి నిస్సహాయతనుగురించి ఎవరికి కాబట్టింది. అక్కడే మధ్యాహ్నమైపోయింది. నాకు జ్ఞానోదయంమట్టుకూ కాలేదు.

నా పొరబాటేమిటో నాకప్పుడు తెలిసింది. ఇలా ఒక ఏకాంత ప్రదేశంలో గోళ్లుగిల్లుకుంటూ కూచోడంకంటే నేనా బస్స్టాండులోనే వుండి వుంటే బాగుండిపోయేది. అదైతే నాలుగువైపుల మంచీ మనుషులొచ్చి దిగేచోటు. ఉంటే గింటే పరిచితులెవరైనా కంటబడే అవకాశం అక్కడే వుంటుంది ...

చెట్టుచేమల పచ్చనిపట్లు బహు సకృత్తైపోవడంవల్ల తెలుగుదేశంలో కొన్ని పట్టణాలు ఎడారిలో వేసుకున్న గుడారాల్లా వుంటాయి. అలాంటివాటిలో రాయచోటి ఒకటి. బస్స్టాండు బూడిద దుమ్ములో కొంతసేపు తిరిగేసరికి నేను బాగా డస్సిపోయాను వేసుకున్న దుస్తులు మట్టిగొట్టుకపోయాయి, కాళ్లు పీకడం మొదలెట్టాయి.బొగ్గు వెయ్యకపోతే మానె, నీళ్లయినా పొయ్యకపోతే ఇంజను ,దారి దప్పే ప్రమాదం ఏర్పడినట్టు తోచింది. దగ్గర్లోవున్న ఓ కొట్టులోకి వెళ్లి కడుపునిండుకూ సోడానీళ్ళు పట్టించాను. కొట్టుముంగిట వున్న పందిరిగుంజ కానుకుని అప్పుడికచేయవలసిందేమిటో ఆలోచించసాగాను.

పరిసరాలను సర్వే చేస్తున్న శూన్య దృక్కులకు ఏ దృశ్యం కనిపించిందో మరి, ఉన్నట్టుండి నేను ఉలికిపడిపోయాను. గమనించి చూచాక బోధపడింది. బక్కపలచటివాడు, ఫుల్ యూనిఫాంలో వున్నాడు. వయసు పాతికేళ్లకన్నా ఎక్కువ వుండదేమో! ఎవరోగాని చాకులాంటి పోలీసు. కన్నార్పకుండా నావైపే చూస్తున్నాడు.

కంగారు పడిపోతూ నేను నావైపొకసారి చూచుకున్నాను. నా వేషము, వైఖరీ గూడా అనుమానించడానికి తగ్గట్టే వున్నాయి.

అపాయాన్ని శంకించిన ఉష్ట్రపక్షిలా పెడముఖం పెట్టుకుని నిల్చోడమొకటే నా కప్పుడు గత్యంతరమైపోయింది. ముళ్లపైన పాదాలు మోపినట్టుగా ఆ భంగిమలో కొద్ది నిమిషాలు మాత్రమే నిల్చుని వుంటాను. పొంచి పొంచి ఒక నీడ నాకు దగ్గరగా వస్తున్నట్టు తోచింది. ఒక దశలో తలపైన పెట్టుకున్న టోపీ గూడా నీడలో స్పష్టంగా కనిపించింది; వచ్చి వచ్చి అతడు నా ఎట్ట ఎదుట నిలబడిపోయాడు. "ఏమండీ! ఏ వూరు మీది? ఏ బస్సుకోసం వెయిట్ చేస్తున్నారు?" అన్నాడు.

ఆఖరు క్షణంలో నాలో మొండి తెగువ చోటు చేసుకుంది. "బస్సుకోసం గాదు. బస్సు టికెట్టుకు డబ్బు పుట్టించుకునే ఉపాయం కోసం



## ఇంటర్నేషనల్
## ఆటోమొబైల్స్

గవర్నమెంట్ హాస్పిటల్ రోడ్,
కడప - 516001 [ఆంధ్రప్రదేశ్].



**ఉగాది శుభాకాంక్షలతో**
**తెనుగు సంవత్సర శుభ సందర్భంగా**
**మా వినిమయదారులకు శుభవార్త!**

అశోక లేలాండ్, మహీంద్ర అండ్ మహీంద్ర లిమిటెడ్‌వారిచే జీపు మరియు లేలాండ్ విడిభాగములకు అధికారయుక్తమైన స్టాకిస్టులుగా నియమింపబడినామని తెలుపుటకు మేమెంతో సంతోషిస్తున్నాము

ఇట్లు
హార్దికాభినందనలతో

**ఇంటర్నేషనల్ ఆటోమొబైల్స్**

---

*With Best Compliments From*



Phone · 2066

## Pennar Paper Limited.,

*(Joint Venture with APIDC)*

**Manufacturers of All Varieties of Writing, Printing and Kraft Papers.**



**Factory :**

**Near Gandi Works,**
**CUDDAPHA** (Andhra Pradesh)

Registred Office .
**4/180, Kotireddy Street,**
CUDDAPAH-516001. (A. P.)

---

మా అభిమాన ప్రేక్షకులకు, డిస్ట్రిబ్యూటర్లకు
'ఉగాది' శుభ సందర్భంగా తెనుగు
నూతన సంవత్సర శుభాకాంక్షలు!





ఫోన్స్ : థియేటర్ : 2840 ★ నివాసం : 2002

## శ్రీనివాసపిక్చర్‌ప్యాలెస్

కడప - 516001 [ఆంధ్రప్రదేశ్]



ప్రొప్రైటర్ :
**ఎ. ఆనందకుమార్,**
మైన్ ఓనర్

---

తెనుగు నూతన వత్సర శుభ సందర్భంగా 'ఉగాది'కి
మా అభిమాన వినిమయదారులకు శుభాకాంక్షలు



**గంజికుంట రామమూర్తి మాన్యుఫాక్చరర్స్**




**గంజికుంట టెక్స్‌టైల్ ఇండస్ట్రియల్,**
6/454, సిద్దవరం రోడ్, కడప - 516002.

సరసమైన ధరల నిర్ణయమే సరైన వ్యాపార జీవనం!
అదే మా ఆదర్శం!!



చిన్న చిన్న చప్పరింపులలో
రుచులు పూర్తి అయినాయి

# ఓరియంట్ ఫ్యాన్స్ అలా నడూస్తూనే వున్నాయి

కొద్ది కాలాన్ని మిమ్మలను చల్లబెడతాయి కొన్ని వస్తువులు—వాటిలో వున్నాయి కొన్ని సంవత్సరాల పాటు నాణ్యతా ముద్రితమైన ఫ్యానులు.

ఒక ఫ్యాన్ జీవిత కాలమంతా పని చెయ్యాలనుకొనే నాంది పలుకుతోంది ఓరియంట్ ఫ్యాన్ అదే ఓరియండ్‌లో మొదటి నిర్ధారణ.

అందుకే జీవితాంతం పని చేసేలా మేం తయారు చేస్తున్నాం మా ఫ్యాన్స్ అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో అతి సున్నితమైన సామగ్రిని వాడి.

మా ఫ్యాన్స్ అన్నీ ఇలానే తయారు చేయబడినాయి. మీరు ఎంచుకొనేందుకు ఎన్నో మోడల్స్‌లో లభిస్తున్నాయి—సీలింగ్, టేబిల్, బ్రాకెట్ మరియు పెడస్టల్. వివిధ షేడ్స్‌లో, షేప్స్‌లో మరియు సైజులలో అత్యంత మేలిమైనవిగా మీకు అందుబాటులోనున్న సరసమైన ధరలకు లభిస్తున్నాయి.

ఎవరి వద్దయితే ఓరియంట్ ఫ్యాన్ ఎప్పుడూ ఉందో వారి సలహాను అడగమని మేం మీకు విన్నవించుకుంటున్నాం. వారు మీకు ఏం చెప్తారో తెలుసా. ఓరియంట్ ఎప్పుడూ ఇచ్చిన హామీని నిలుపుకుంటుంది

## ఓరియంట్

జీవితాంతం ఒక మేలిమైన హామీ



CC/OGI-8/84/TEL

“దేవుడు తనని దయ తల్చకపోతే, తనే దేవుడికి ఎదురుతిరగ దల్చుకున్నాడు. అందుకే ...అందుకేగా...”

తలగడ కిందే భద్రంగా దాచిన ప్లాస్టిక్ కవర్ని ఓసారి తడిమి చూసుకున్నాడు చిన్న పిల్లాడిలా!

గార్డినాల్ టాబ్లెట్లు వున్న కవర్ అది! పాతిక మాత్రలు వున్నాయి అందులో!

శిల్పని ఈ లోకంలో కల్సుకోలేదని తెలిస్తే, మనుక్షణం ఆ పాతిక మాత్రాలూ మింగేసి, పైలోకాల్లో ఆమెని కల్సుకోవాలని ఎప్పుడో నిర్ణయించుకున్నాడు. అందుకే గత రెండు నెలలుగా, అప్పుడప్పుడు కొని నిలవ వుంచిన స్టాకు ఆ మాత్రలు!

సత్యానికి తన నిర్ణయం తల్చుకోగానే కాస్తంత ధైర్యం, ఊరట కలిగాయి.

చెమట ఆరిపోయి ఒళ్ళు పొడిగా తయారైంది. కళ్ళూ పొడిగా...పొడిపొడిగా ... మండుతూ.

మళ్లీ పక్కమీద వాలాడు.

మండుతున్న కళ్లమీదికి నిద్ర రాలేదు.

మనసుని తవ్వి మళ్లీ పాత జ్ఞాపకాల్ని వెలికితీసి వాటిని తడమసాగాడు.

* * *

తోబుట్టువు కాకపోయినా, చిన్నతనంలోనే తల్లిదండ్రుల్ని పోగొట్టుకుని అనాథగా మిగిలిన సత్యం మీద సరస్వతికి జాలితో కూడిన ప్రేమ! భర్త కాదంటున్నా, మొండిగా వాదించి పెద్దమ్మ కొడుకైన అతణ్ణి తెచ్చి యింట్లో వుంచుకుంది భార్య పట్టుదల తెల్సిన ఈశ్వర్రావు పోనీలే, యింటి పనులకో కుర్రాడిగానైనా వుంటాడని వూరుకున్నాడు చివరికి.

అయితే, బావ తనని చిన్న చూపు చూస్తాడని సత్యానికి చాలాకష్టంగా వుండేది. బడిఎగ్గొట్టి తిరగటంతోనూ, చాటుగా సిగరెట్లు, సినిమాలు మరగటంలోనూ ఆయన మీది కక్ష తీర్చుకుంటున్నాననుకుని మురిసిపోతూ— స్కూల్ ఫైనల్‌కి వచ్చేసరికి వరసగా నాలుగేళ్లు తప్పాడు! అతడు తప్పినప్పుడల్లా ఈశ్వర్రావు అతణ్ణి దండించటానికి బదులు యీసడించుకుని వదిలేసేవాడు. సరస్వతి కన్నీళ్లతో అతణ్ణి బుజ్జగించేది.

అయినా చదువుమీద శ్రద్ధచూపని సత్యం తన కన్నా ఆరేళ్ల చిన్నదైన శిల్ప యస్సెల్సీ స్కూల్ ఫస్టున పాసయ్యేసరికి, అంతా, ‘ఏరా, నీకన్న నీ మేనగోడలే నయం’ అని వేళాకోళాలు చేసేసరికి పౌరుషపడ్డాడు!

ఈశ్వర్రావుకి కూడా చెప్పకుండా, పుట్టిన తేదీ మార్పించుకుని, మెట్రిక్‌కి కట్టి అహోరాత్రులూ చదవటం ప్రారంభించాడు— ఓ స్నేహితుడి గదిలో.

మెట్రిక్ ఫస్ట్‌క్లాసులో పాసయిననాడు ఆ మాట ఈశ్వర్రావుకి చెబితే, ఆయన హేళనగా నవ్వాడు!

# విరాగి

“ఏం— పంతం పట్టి మెట్రిక్ పాసయితే శిల్పని నీకిచ్చి చేస్తాననుకున్నావా?” అన్నాడు.

ఒళ్లెరగని ఆవేశం వచ్చింది సత్యానికి.

“శిల్పకి నాకన్నా మంచి మొగుడు దొరుకుతాడా?” అన్నాడు కోపంగా. విరసనగా నవ్వాడు ఈశ్వర్రావు.

“శిల్ప డాక్టరవుతుందిరా! దానికి డాక్టర్నే మొగుడిగా తెస్తాను” అన్నాడు

“నేను ఇంజనీర్నవుతాను! శిల్ప చేత అవుననిపించుకుని మరీ చేసుకుంటాను దాన్ని.” అన్నాడు సత్యం.

“ఇంజనీ రవ్వటం యస్సెల్సీ తప్పినంత తేలిక కాదు. బోడి మెట్రిక్ పాసు కాగానే దేశాన్ని ఏలే తెలివితేటలు సంపాదించావనుకోకు!” అన్నాడు ఈశ్వర్రావు.

పౌరుషంతోనూ, కోపంతోనూ సత్యం మనసు భగ్గున మండిపోయింది.

“సరిగ్గా ఆరేళ్ళు టైమివ్వు నాకు. నేను ఇంజనీర్ని కాలేకపోతే మళ్లీ నీ మోహం, అక్క మొహం, శిల్ప మొహం చూడను. మరి ఇంజనీర్ని అయితే, శిల్పని నాకిచ్చి చేస్తావా?” సూటిగా అడిగేశాడు.

“నిన్ను చదివించటానికి నాకేం అభ్యంతరం లేదు. అయితే, పి. యు. సి తప్పితే మాత్రం ఇంక నా నించి ఏ సహాయమూ అందదు” ఖండితంగా చెప్పాడు ఈశ్వర్రావు.

శిల్పమీద మనసు పెంచుకున్న సత్యం అన్నంత పనీ చేసి కష్టపడి బి. ఇ. పాసయ్యాడు అప్పటికే శిల్ప లిటరేచర్‌తో ఎమ్. ఏ చేసింది. ఈశ్వర్రావు సత్యాన్ని అల్లుడిగా చేసుకున్నాడు. లోకాని కంతటికీ చక్రవర్తి అయినంతగా పొంగిపోయాడు సత్యం. బొంబాయిలో ఓ పెద్ద ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం దొరికింది. వెంటనే శిల్పతో సహా బొంబాయి వచ్చేశాడు.

* * *

“ఏడాది కూడా కలిసి కాపురం చేయలేదు పూర్తిగా. కొత్త దంపతులన్నట్టుగానే వున్నాయి కోరికలు ఇంకా. ఇంతలోకే దేవుడికి కన్ను కుట్టిందా? ఎందుకు మమ్మల్ని విడదీశావ్ దేవుడా—ఏం చేస్తున్నావ్ మా భవిష్యత్ కల్ని?”

సత్యానికి చిన్నప్పటినించీ తనుపడ్డ కష్టాలు, ఎదుర్కొన్న అవమానాలు మళ్లీ మళ్లీ గుర్తుకు రాసాగాయి.

“అన్నిటినీ సహించి, శిల్పకోసమే కష్టపడి చదివి, శిల్పకోసమే భవిష్యత్తుని యింత సుందరంగా మలుచుకోవాలని తాపత్రయపడ్డాడు.

ఇప్పుడేం జరగబోతోంది? అన్నీ సవ్యంగా జరిగి, ఆనందాన్ని పంచుకోబోయేంతలో అదృష్టం తనకి ఎదురు తిరగబోతోందా?

డాక్టర్లు చెప్పిన రోజు... దగ్గరపడిపోయింది. తన శిల్ప క్షేమంగా బయటపడుతుందా? తనని మళ్లీ చేరుకుంటుందా?

ఒక్కరోజు బస్ ఆలస్యంగా అంది, యిల్లు చేరటం ఆలస్యమయేసరికి బలవంతం చేసి స్కూటర్ కొనిపించింది తనచేత. ఒక్కసారి చిన్న యాక్సిడెంట్ జరిగేసరికి, స్కూటర్ మళ్లీ బయటకు తియ్యనియ్యలేదు!

ప్రాణానికి ప్రాణంగా ప్రేమించే తన శిల్పకి తనిచ్చిన ప్రతిఫలం ఏమిటి? మరణవేదన! అంతేనా?

ఆమె ఆస్పత్రి పాలవబోతోందని తెలిసీ తను అక్కడికి వెళ్ళటానికి కూడా వెనుదీశాడు.

అవును... ఆమెకేదైనా జరిగితే... తను ఎదురుగా వుండి భరించలేడు.

అందుకే... అందుకే... దూరంగా ఇక్కడే వుండిపోయాడు. కానియ్... ఏం జరగాల్సివుంటే అదే జరుగుతుంది. తనకి విరుద్ధంగా దేవుడు తీర్పు యిస్తే తన నిర్ణయం తనకి వుండనే వుంది.

మళ్లీ శిల్ప ఉత్తరం గుర్తువచ్చిందతనికి—

“...నాకేమవుతుందోనన్న భయం నాకు



లేదండీ—నాకేమయినా అయితే మీరేమయిపోతారో నన్నదే నా భయం నేను లేకుండా మీరు వుండగలరా ? ఈ ఎడబాటుకే ఎంతో తల్లడిల్లి పోతున్నారే శాశ్వతంగా నేను లేకుండా పోతే. . మీరు పిచ్చివారై పోతారేమోననే నాకు బాధగా వుంది. మీ బాధ తల్చుకుంటేనే నాకు కళ్లనీళ్లు తిరుగుతున్నాయి. మనసు పిండుకు పోతోంది . .''

''ప్రాణాపాయంలో వున్నా తన గురించే దిగులు !'' మంచమ్మీదే దొర్లుతూ భగవంతుణ్ణి ప్రార్థించాడు సత్యం— ''భగవాన్, రక్షించు నా శిల్పని ! అంతకంటే మరేమీ కోరను నిన్ను !''

* * *

ఉదయం లేచి కార్యక్రమాల్ని కొనసాగిస్తున్నా గానీ సత్యం మనసు మనసులో లేదు. టిఫిన్ కోసం ఉప్మా కలియబెట్టుకున్నాడు. తినబోతుండగా వేడివేడి దోశలు, కొబ్బరి పచ్చడి ప్లేటుతో వచ్చి పక్కనే కూర్చుంది శిల్ప.

''నాకిప్పుడు టైం లేదంటుంటే ఇన్ని దోశలేమిటి ? తీసెయ్ ...''

''టైం లేకపోవటమేమిటమ్మా! బంగారం కదూ... నోరు తెరవండి. నేనే తినిపించేస్తా. మీ పనులు మీరు చేసుకుంటూ వుండండి. చెప్పినప్పుడల్లా నోరు తెరుస్తూ వుండండి చాలు !''

''తినిపించేబదులు నువ్వే తినెయ్ రాదూ.''

''పైకి ఎన్ని కబుర్లు చెప్పినా నేను తిన్నంత మాత్రాన మీ ఆకలి తీరదు కదా !''

''అసలు నాకు ఆకలే లేదంటుంటే ''

''ఇప్పుడుండదు నా ఎదురుగా ! ఫ్యాక్టరీకి వెళ్లగానే మొదలవుతుంది. అబ్బబ్బ ... అయినా నోట్లో పెట్టింది మింగటానిక్కూడా ఇంత అల్లరయితే ఎలా చెప్పండి .''

దృశ్యం చెదిరిపోగా టిఫెన్ ప్లేటు తీసుకు వెళ్లి సింక్‌లో పడేసి చెయ్యి కడుక్కున్నాడు సత్యం.

''మళ్లా అలాటి రోజులు వస్తాయా?

# విరాగి

లేక .. లేక . ఇహ శాశ్వతంగా తనకీ వంటరి బతుకేనా?

గబగబ బట్టలు వేసుకుని ఆలోచనల్ని పార ద్రోలాలన్నట్టుగా, ఎవరో తరుముతున్నంత వేగంగా ఇంటికి తాళం పెట్టి స్కూటర్ తీసుకు బయటపడ్డాడు.

''అదిగో ... మళ్లీ నేను లేను కదా అని స్కూటర్ బయటకు తీశారు కదూ...''

వెనకనించి శిల్ప అంటున్నట్టే వినిపించింది. తల విదిలించి, స్కూటర్ స్టార్ట్ చేశాడు.

కార్డ్ పంచ్ చేసి సెక్షన్లోకి నడుస్తుంటే, కొదండరామయ్యగారు కనిపించారు దూరంగా, ఆయన స్టోర్స్ సెక్షన్లో సీనియర్ ఆఫీసరు. పెళ్లికాకముందంతా సత్యం ప్రాణాలు తోడేశాడు తన కూతుర్ని చేసుకొమ్మని! సత్యం తనకి బంధం ఏనాడో ముడిపడి వుందని చెప్పినా, మనసు మారుతుందేమో నన్నట్టుగా చాలా తంటాలు పడ్డాడు. సత్యం శిల్ప మెళ్లో మూడుముళ్లూ వేసేదాకా ఆయననించి తప్పించుకోవటానికి అంత గానూ తంటాలు పడవల్సి వచ్చింది!

సీట్లోకి వెళ్లి కూచోగానే కోదండరామయ్య గారి రూపమే మళ్లా కళ్ల ముందు మెదిలింది సత్యానికి.

''చూడు బాబూ, నువ్వింకా చిన్నవాడివి. జీవితమంతా ముందరే వుంది. నీకు శిల్ప మీద వున్న ప్రేమని కాదనను. అయితే పోయినవాళ్లతో పాటు మనమూ పోలేం కదా! కనీసం బతుకు సవ్యంగా జరిగిపోవటానికయినా నువ్వు మళ్లీ పెళ్లి చేసుకోక తప్పదు.''

మా అమ్మాయికి ఇంకా పెళ్లి కాలేదు. దేవుడు మీ ఇద్దరికీ రాసిపెట్టి వుండబట్టే అది ఇంకా పెళ్లి కాకుండా మిగిలి వుందేమో ...

''స్టాపిట్ ...'' అరిచాడు సత్యం. ఆ గదిలో ఎవరూ లేనందున సరిపోయింది. చుట్టూ చూసి సిగ్గుపడి తలదించుకున్నాడు తనకి తనే గిల్టీగా ఫీలవుతూ.

''ఛ... ఛ .. ఏమిటీ వక్రపుటాలోచనలు ' ఎంత దూరం ఆలోచిస్తోందీ పాడుమనసు !

అయినా శిల్పకేమైనా జరిగితే మరుసటి రోజుకి తనూ ఈ భూమ్మీద వుండకూడదని నిర్ణయించుకున్నాక కూడా ఈ రెండో పెళ్లి ఆలోచనలూ అవీ ఏమిటి... నాన్సెన్స్... తనసలు ఈ ఆలోచనలన్నిటికీ మొత్తంగా ఫుల్‌స్టాప్ పెట్టెయ్యకపోతే ఇవాళే పిచ్చి ఎక్కేలా వుంది! అనుకున్నాడు. మనసుని అదుపులో వుంచుకొటానికి ప్రయత్నిస్తూ టేబిల్‌మీది ఫైళ్లని ముందుకు లాక్కున్నాడు.

పదకొండు గంటల ప్రాంతంలో ఫోన్ మోగింది. యధాలాపంగా ఎత్తిన సత్యం 'సార్ ట్రంకాల్ ఫ్రం హైదరాబాద్' అన్న ఆపరేటర్ కంఠం విని రక్తమంతా ఒక్కసారి మొహంలోకి పొంగగా,

''యస్ . . కనెక్ట్ ప్లీజ్'' అన్నాడు కంగారుగా...

''స్పీకాన్'' అంది ఆమె.

''హలో .హలో...'' శక్తినంతా గొంతులోకి తెచ్చుకుంటూ అరిచాడు సత్యం. అవతలి నుంచి వినబడే గొంతు మాత్రం నూతిలోంచి వస్తున్నట్టు వుంది ఎవరిదో మగ కంఠం. అంతకి మించి మరేం తెలియటం లేదు !

''హలో ..హలో...'' అంటూనే వున్నాడు లైన్ డిస్కనెక్ట్ అయిపోయింది.

వెంటనే ఆపరేటర్‌కి ఫోన్ చేశాడు. కాల్ డిస్‌కనెక్ట్ అయిందనీ, మళ్లా ప్రయత్నించమనీ చెప్పాడు.

''అది బావ గొంతే అయివుంటుంది వెధవ లైన్. .డిస్కనెక్ట్ అయిపోయింది! ఏం చెప్తున్నాడాయన? శిల్ప ఎలా వుందో !

తనంతట తనే ట్రంకాల్ చేస్తేనో ? పోనీ యస్‌టిడి. ఏదైనా మాత్రం ఏ నంబర్ కని చెయ్యటం? బావ ఇంటిచుట్టుపక్కల ఫోన్‌లేదు. వాళ్లు హాస్పటల్‌కి వెళ్లిపోయారేమో ననుకున్నా తనకి హాస్పటల్ పేరైనా తెలీదు !

ఏ హాస్పటల్‌లో జాయిన్ చేస్తారో తెల్సుకోని తన తెలివి తక్కువకి తననే తిట్టుకున్నాడు సత్యం

మళ్లా పిచ్చి మొదలయింది!

ఆలోచనలు...ఆలోచనలు...చావు...బతుకు ...రెండో పెళ్లి... 'ఎందుకీ కన్నీరు ? ఎందుకిలా వున్నారు ?''

''రింగ్...రింగ్...'' ఫోన్ మోగింది ఒక్క ఉదుటున అందుకున్నాడు.

''సర్. హైదరాబాద్ పార్టీ ఆన్ దిలైన్'' చెప్పింది ఆపరేటర్.

''హలో...హలో...నేను సత్యాన్ని బావా !'' గట్టిగా అరిచాడు.



# "ప్రతీక్ష"

ఎలి చూత బాలపల్లవ ఖాదనాత్తక
షాయకంఠాగ్ర భాసమ్మలయిన
మధురసోదయ నవ్యమందార పుష్పగే
హాంగణాతిథులయం దమృతమయిన
ఆమూల శిఖర రాగావతారములు—కిం
శుకవృక్ష తతులందు సొబగులయిన
వలలిత కుంద కుట్మల మనోహర పరీ
మళ వీచికల కెల్ల చెలువులయిన

నాటి నేనాటివో చైత్ర నవ్యరుచులు
తరలివచ్చి నా హృదయ కేదారమందు
కొలువుసేయునంచును కంటకొనల వ్రేటి
యాశలను నించిమాతు దిగంతములకు!

చిరకాలాంచిత మత్ప్రతీక్షను తపశ్శ్రీ
యంచు లోనెంచి భా
సురతేజోవధి రూపుగొన్నయటులై
సూక్ష్మాతి చైతన్య సుం
దరధారాతతిచే హృదంతరమును నుద్యత్
స్వాదు పూర్ణంబుగా
విరియం జేయగ రాగదే! సలలితోర్వీభూష.
చైత్రాగమా!!

ఆకుదూసిన మొక్కలందున నంతన్న
మాధిమగ్నంబైన మహిత రుచులు
చిగురు వైచెడు కొమ్మ చివరలో పొంచి
చూచెడు చైతన్య సూక్ష్మరుచులు
హరిత లావణ్యమౌ యామూల సౌందర్య
పత్రకోటులలోని ప్రథితరుచులు
మొగ్గ తొడిగెడు రెమ్మ మొదళులలో నిక్కి
వికసింప వేచెడి విధృతరుచులు

కలసి—మాతోట—దివ్యలోకముల గెలిచి
వేచియుండెడు పూవులర్పింప నీకు!
తృప్త్రద ధ్వనిలో జడత్వంబులిగిరి
యాంతరానంద వీచిక లావరింప!!

స్మృతుల విస్మృతులలో మతికి భాస భాస
గాఢోచుచుండు సంస్కార ధార
లౌకికార్యాగతలంపట జంబాల
పటలిలో వెలుగు చిత్ప్రథమహస్సు
బహుళ మిథ్యా సౌఖ్యభావనా కల్లోల
రాజి నూగాడు వైరాగ్యరేఖ
తతముహుర్ముహురావృత వ్యక్తమోహాంధ్య
సంఘంబులం జీల్చు జ్ఞాన కళిక

వరగ నేనాడు హృదయ దర్పణమునందు
ప్రతిఫలించి—యవిచ్ఛిన్న పథముం జూపు
నో—తలంపగానాడె విఖ్యాత నిత్య
నవ్యమధుమాస కాంతులు నాదు మదికి!!
పూచిన ప్రతి తరువును—మధు
వేచిన ప్రతికుసుమ లలిత హృదయముగని—నా
చూచెడు నిత్య హృదంత ర
మౌ చైతన్యము; వసంతమా!! యందీవే!!

—బులుసు వేంకటేశ్వర్లు

"హలో... నమస్తే సార్, నేను నందనా ఇంజనీరింగ్ నుంచి రాఘవరావుని మాట్లాడు తున్నాను...సార్, మా కొటేషన్ అందిందను కుంటాను..."

ఒక్కసారిగా గాలి తీసినట్లయిపోయింది సత్యానికి. మాట్లాడుతున్నది బావ కాదు!...

"చూడండి! కొటేషన్స్ చాలావచ్చాయి. అవన్నీ చూడాలి... మీరిలా ఫోన్లమీద హలో అయినంత మాత్రాన పనులు జరిగిపోవు. వెయిట్ ఫర్ అవర్ డెసిషన్."

ఒళ్లు మండి పోతుండగా, కరుగ్గా అనేసి, ఫోన్ క్రెడిల్ మీద పడేశాడు.

పనిమీద మనసు నిలువనంటోంది. శలవు పడేసి బయటికి పోయినా ఏం చెయ్యాలి? అంత కన్నా ఇక్కడ పడుండటమే నయం. ఏ ఫోనో వచ్చి విషయమన్నా తెలిసే అవకాశం వుంది.

చికాగ్గా ఫోనెత్తాడు— కాంటీన్‌కి కనెక్షన్ అడిగాడు.

'ఓ కాఫీ, ఓ పాకెట్ సిగరెట్లు పంపించు' చెప్పి, కుర్చీలో అనీజీగా జేరగిలబడ్డాడు.

కాఫీ తాగుతుండగా వర్క్‌షాపులోంచి ఫోన్ వచ్చింది— ఏదో ప్రాబ్లం!

ఆ తరువాత రెండుగంటలు పనిలోనే దొర్లి పోయాయి.

లంచ్ టైం కావటంతో మళ్లా ఆలోచనలు ముసురుకున్నాయి సత్యాన్ని. తోటి ఫ్రెండ్స్ మాటలు అతడి చెవుల్ని కూడా సోకడం లేదు. అన్యమనస్కంగానే రెండు ముద్దలు తిని లేచిపోయాడు.

మూడు గంటలకి జనరల్ మేనేజర్ ఛాంబర్లో మీటింగ్ వుంది. ఆ పేపర్స్ చూసుకోవటం, అందుకు సంబంధించిన సూపర్‌వైజర్లని పిలిచి ఇన్ఫర్మేషన్ తీసుకోవటంతో మూడు గంటలు ఇట్టే కొట్టేశాయి. హడావిడిగా ఫైలు తీసుకుని మీటింగ్‌కి వెళ్లిపోయాడు.

మీటింగ్ మధ్యలో వుండగా ఫోన్ వచ్చింది.

# విరాగి

జనరల్ మనేజర్ పి. ఏ. వచ్చి చెప్పింది మెల్లగా—

"సార్, మీకు ట్రంకాల్"

జి. యం. లో 'వన్ మినిట్ సార్' అని చెప్పేపాటి కర్టెసీ కూడా మర్చిపోయి కుర్చీని తన్నుకుంటూ లేచి పక్క గదిలోకి పరుగెత్తాడు సత్యం.

"హలో... హలో..." గొంతు చించు కున్నాడు.

"నేన్రా బావని!"

"చెప్పు బావా... నేనే సత్యాన్ని. ఎలా వుంది శిల్ప?

"అరగంట క్రితమే ఆపరేషన్ జరిగింది. మొదటి కాన్పుకి ఇలాటివన్నీ యీ రోజుల్లో మామూలేరా! అబ్బాయి పుట్టాడు. బంగారంలా వున్నాడు. శిల్ప కులాసా, ఇంకా బయటకి తీసుకు రాలేదుగానీ – ఇద్దరూ క్షేమమే! నీకు వెంటనే చెప్పాలని..."

"థాంక్యూ బావా! థాంక్యూ...థాంక్యూ" ఆనందతో గొంతు పూడుకుపోయింది సత్యానికి.

* * *

ఆ రాత్రి నిద్ర పట్టలేదు సత్యానికి.

ఆలోచించుకుంటుంటే ఆ సాయంత్రం దాకా తను పడ్డ ఎగొనీకి తనకే నవ్వొస్తోంది—

'డెలివరీ' కోసం కూడా తను ఎందుకు అంత చెడుగా ఆలోచించి అంత వైరాగ్యం చెందాడు?'

చేత్తో దిండు కింద తడిమి,- గార్డినాల్ మాత్రల పొట్లం తీసి దూరంగా విసిరేశాడు.

'శిల్ప మీద తనకున్న అవ్యాజానురాగమే తను ఇంతగా అప్‌సెట్ అవటానిక్కారణమా? లేక ప్రతి మగాడు భార్యని మొదటి డెలివరీకి పంపి ఇలాగే ఆలోచిస్తాడా?'

అర్థం కాలేదతనికి.

'ఏదేమైనా యీసారి డెలివరీకి ఇంతగా వర్రీ కాకూడదు' అనుకున్నాడు అప్పుడే!! ★

మీరు రేడియోలో పాడితేనే బాగుంటుంది ..
నిజమా
అవును రేడియో అయితే కట్టేసుకోవచ్చు
సీతామహాలక్ష్మి



# కరుణ కుమార కథలు

రెండవ తరం తెలుగు కథల్లో మొదటి వర్గానికి చెందిన వారిలో కరుణ కుమార ఒకరు. అసలు పేరు కందుకూరి అనంతం. పుట్టింది పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకా కాపవరం. ఉద్యోగ రీత్యా నెల్లూరు మండలంలో ఉండ వలసి వచ్చింది ఉన్న కుటుంబం కానందున మధ్యలోనే చదువును నిలిపి వేసి రెవిన్యూ శాఖలో ఉద్యోగంలో చేరి రాయలసీమ మాండలికాన్ని, పరిశుభ్రమైన తెలుగుని ఒంటబట్టించు కున్నవాడు కరుణ కుమార.

కరుణ కుమార గారు 1936 నుంచి 1957 వరకూ మొత్తం 25 కథలు రాసినట్టు మధురాంతకం రాజారాం గారు తెలుగు కథా రచయితలు అనే పుస్తకంలో భోగట్టా ఇచ్చారు. జాకీ, నమ్మిన బంటు కథలు అలభ్యాలని చెప్పారు ఇప్పటికి కరుణ కుమార గారి కథలు 2 సంపుటాలుగా వచ్చాయి. మొదట సంపుటం "కరుణ కుమార కథలు; అందులో ఆకలి మంటలు, కొత్త చెప్పులు, సన్మానం, వెంకన్న, పెండ్లి ముచ్చట, పోలయ్య అనే ఆరు కథలున్నాయి. రెండవ సంకలనం సన్న జీవాలు. దాంట్లో రిక్షావాలా. టార్చిలైటు నెం 512, పశువుల కొరం, కయ్యకాలువ, బిళ్ళల మొలతాడు అనే ఆరు కథలున్నాయి. ప్రస్తుత ఈ వ్యాసానికి సన్న జీవాలు సంకలనంతో పాటు తొలినాటి తెలుగు కథలు అనే కథాసంకలనంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు సంకలించిన అంటుజాడ్యం కథ ఆధారాలు.

ఈ ఏడు కథలు వరుసగా కయ్య — కాలువ భారతి ఆగస్టు 1936, పశువుల కొర్థం భారతి అక్టోబరు 1937. అంటు జాడ్యం భారతి ఏప్రిల్ 1938, టార్చలైట్ భారతి నవంబర్ 1939, నెం. 512 భారతి జూన్ 1943, రిక్షావాలా భారతి అక్టోబరు 1943 లో ప్రచురింపబడ్డాయి. బిళ్లల మొలతాడు భారతి డిశంబరు 1945 లో అచ్చయింది.

కవిత్వానికి అలంకారశాస్త్రాల మాదిరిగానే కథలకి కూడా కొన్ని నియమాలు ఏర్పరచారు. కాని ప్రసిద్ధమైన ఏ కవి, కథకుడూ ఈ నియమాలను ముందుంచుకొని రాసినట్లు కనబడదు. కథకుడు ముందుగా ఎంచుకొన్న విషయంలో బాగా పరిచయం కలవాడై ఉండటం కథా రచనలో ప్రధానమైన విషయం. వృత్తిరీత్యా అనేక వూళ్లు తిరగటం వల్లనేమో కరుణ కుమారగారు తన కథల్లో గ్రామీణ వాతావరణాన్ని, కక్షలను కార్పణ్యాలను, అమితమైన ప్రేమని— విపరీతమైన ద్వేషాన్ని, జాలిని— కాఠిన్యాన్ని, లేమిని ఐశ్వర్యాన్ని, వివిధ మనస్తత్వాలను, విభిన్న సన్నివేశాలను ఫొటోగ్రాఫక్‌గానే కాకుండా, కథనాత్మక కళా కౌశలంతో పాఠకుల ముందుంచారు.

స్వాతంత్ర్యానికి పూర్వం, ఆ తరువాత చాలా కాలం వరకూ కూడా తెలుగునేల అనేక మౌఢ్యాలకు, అత్యాచారాలకు నిలయమైంది. ఈ మౌఢ్యాలను, అత్యాచారాలను సంప్రదాయం పేరుతో సమర్థించే మేధావులూ, రచయితలూ ఒక ప్రక్కగా ఉండగా, వీటిని సంస్కరించి భిన్న వర్గాల మధ్య, భిన్న వర్ణాల మధ్య సామరస్యాన్ని మానవతను కలిగించాలని ప్రయత్నించిన మేధావులూ, రచయితలూ వేరొకప్రక్కన ఉన్నారు. ఈ రెండోరకం రచయిత 'కరుణకుమార.' కరుణకుమార అని కలంపేరు. ఎట్లా పెట్టుకొన్నారోగాని ఆయనకథలు చదివింతరువాత ఆ పేరు ఆయనకు అన్వర్థమయిందనే భావిస్తాం.

ఈ ఏడు కథల్లో పశువులకొరం. కయ్య—కాలువబిళ్ళల మొలతాడు గ్రామీణ వాతావరణంలో భూస్వాములకు బలైపోతున్న శ్రమజీవులకు సంబంధించినవి. రిక్షావాలా కథ జీవకారుణ్యానికి చెందినది. నెం 512 కథ అధికార దుర్వినియోగానికి, కర్తవ్యానికి చెందినది. టార్చిలైటు గ్రామీణ రాజకీయాలకు, మనుషుల్లో ఎక్కువ తక్కువలకు సంబంధించిన కథ. అంటుజాడ్యం ఒక మనస్తత్వాన్ని సూచించే కథ.

ఈ కథలను రాయడంలో కరుణకుమార చూపిన నేర్పు గొప్పది. కథల్లో ఎక్కడో తప్ప రచయిత కనబడడు. సాధారణంగా రచయితలయిన వాడు తను నమ్మిన విషయాన్ని ఏదో ఒకవిధంగా ఒకపాత్రద్వారా' ఒక సంభాషణద్వారా. ఒక సన్నివేశంద్వారా ఎక్కడో ఒకచోట చెప్పి తనకుతెలిసి గాని. తెలియక గాని కథలోకి ప్రవేశిస్తాడు.ఈ గుణం మంచిదా? చెడ్డదా? అనవసరంగాని కరుణకుమారలో ఈ లక్షణం అంతగాలేదు. ప్రధానంగా అతని ధ్యేయంకథను చెప్పటం. ఆ చెప్పటంలో ఒడుదుడుకులు లేవు;ఉద్రేకాలు ఉండవు. ఉపన్యాసాలుఉండవు. అయినా చదివే పాఠకులలో రచయిత ఆశించిన సంచలనాన్ని కలిగించగలగడం కరుణకుమారప్రతిభకు గీటురాయి.

అంటు జాడ్యం కథ ఉంది. దీంట్లో ఊరు తెలియని యానాది కూలికని వచ్చి కలరా రోగమొచ్చి ఊరి పొలిమేరల్లో చనిపోయాడని వదంతి. ఆ ఊరి మునసబు అయ్యవారప్ప. బహు కుటుంబీకుడు, వైదిక బ్రాహ్మణుడు, భయస్థుడు, ఆ వార్త విన్నప్పట్నుంచి మానసికంగా కృంగిపోతాడు అసలే కలరా అంటే భయం. తనకు కలరా వచ్చినట్లు అనుమానంతో రాత్రి తెల్లదాకా గందరగోళం చేస్తాడు తీరా తెల్లవారిం తరువాత వాడు చావలేదనేవార్త కరణం చెప్పినప్పుడు (కలరా కాదది) చచ్చినట్టు పడిఉన్న వాడల్లా ఎగిరి గంతేస్తాడు. అక్కడతోనే కథ ముగించేస్తాడు రచయిత. మామూలు సాదా రచయిత అయితే అక్కడ వ్యాధిని గురించి, అది దేవుళ్లకు ఎంతవరకూ సంబంధించినదనే అంశాన్నిగురించి చిన్నసైజు ఉపన్యాసం ఏ కరణంచేతనో ఇప్పిస్తాడు. ఎగిరి గంతేసి లేచాడని కథ ముగించడంలో కథకుని ఆంతర్యం పాఠకుడు అవగాహన చేసుకోవాలి. ఆ కథలో రచయిత మానవతావాదం తలారి మాటల్లో కనబడుతుంది. "ఇదెక్కడి చట్టమయ్యా—ఈ చట్టము? మనిషి బతికి ఉండగా వాడి గొంతుకలో ఊపిరి ఉన్నంత మట్టుకు వాడు చచ్చాడా, బతికాడా, తిన్నాడా పస్తుపండుకున్నాడా అనే యోచన ఏమారాజుకి కాబట్టదు. తీరా చచ్చిన తరువాత ఈ రిపోర్టులెందుకు? మనల్ని ఇట్లా ఏడిపించటం ఎందుకు? ఏది పట్టినా దిక్కూ దీమూ ఉన్నట్లె గోచరించదే." ఇట్లాంటి కొద్ది మాత్రమే రచయిత బయట పడుతూన్నట్టు కనబడుతుంది. కాని ఈ ఘట్టంకూడా కథాంశంలో లీనమై పాఠకుణ్ణి రచయితను మరచి పోయే టట్టు చేస్తుంది. స్వాతంత్ర్యానంతరం వచ్చిన కథేమో తలారి మాటల్లో బడుగు వర్గాలలో రాబోయే స్వేచ్ఛా పిపాస కనబడుతుంది.

గ్రామీణ రాజకీయాలల్లో కులాధిపత్యం, ధనాధిక్యత ఎంత దురహంకారానికి దారి తీస్తాయో, ప్రతిభకు మసిపూసి మారేడుకాయ చేస్తాయో చెప్పటానికి టార్చిలైటు కథ మంచి ఉదాహరణ. ఓట్లకోసం బడిపెట్టించింది, ఆ బళ్లో ఆటల పోటీలు పెట్టించిందీ ప్రెసిడెంటు గరటయ్యే: తీరా ఆ ఆటల పోటీల్లో బహుమతులు గెల్చుకున్న వారంతా చాకలి, మంగలి, వడ్డె, యానాది, సాలె, కుమ్మరి వాళ్ల పిల్లలు. బహు

మతులకు చందాలిచ్చింది అగ్రవర్ణాల గ్రామీణులు. వాళ్ల కళ్లల్లో ద్వేషాగ్నిని రగిలించింది ఈ సంఘటన. ఫలితం ప్రధానోపాధ్యాయుడి ఉద్యోగం ఊడిపోవటం. దానికి కారణం ప్రశాంతంగా ఉన్న గ్రామంలో ప్రధానోపాధ్యాయుడు రాజకీయాలు లేపాడని. అరిటాకు ముల్లు సామెత. పైగా హెడ్మాష్టరు క్రైస్తవుడవటం మరొక పాపం.

మూడు రోజుల్నుంచి పస్తులుండి బేరంపోతుందేమోననే భయంతో ఆరగాల బేరాన్ని మూడణాలకే కుదుర్చుకున్న రిక్షావాడిమీద చూపరులకు సానుభూతిలేదు. కళ్లు బైర్లుకమ్మి (రిక్షావాడికి) రిక్షాపడటంతో పండగపూటా పొట్టనిండా తిన్నతిండి కక్కుకున్న బ్రహ్మణుడి మీదే ప్రేక్షకుల సానుభూతి. ఈ కథలో కరుణకుమారగారి కరుణరసం పతాకస్థాయికి చేరింది. రిక్షావాడు ఆకలివేదనను, బ్రాహ్మణుడి తిండి అరగని వేదనను చిత్రించేటప్పుడు ఆయన ప్రదర్శించిన యధార్థస్థితి రచనకు ఎక్కడలేని బలం తెచ్చింది.

కయ్యా—కాలువలో లక్ష్మమ్మ — కొండడు. బిళ్ళలం మొలతాడులో రామిరెడ్డి —రమణి. పశువులకొఠంలో రాయుడు—పెంచలి ప్రతిద్వందులు.

కయ్య — కాలువలో లక్ష్మమ్మ భూస్వామ్య వ్యవస్థకు ప్రతీక. కొండడు కూలిజనానికి ప్రతిరూపం. బిళ్ళల మొలతాడులో రామిరెడ్డి, పశువులకొఠంలో రాయుడు ఒకే మనస్తత్వానికి ప్రతీకలు. రామిరెడ్డి తననే నమ్ముకున్న సుబ్బులును దగా చెయ్యటానికి పూనుకొని సుబ్బులు భార్య రమణిని అనుభవిద్దామని చూశాడు. అతనిదృష్టిలో డబ్బుకు అమ్ముడుపోని వస్తువేలేదు ఆఖరికి స్త్రీ మానంకూడా. పశువులకొఠంలో రాయుడు కేవలం ధనమదంతో పెంచలిని లొంగదీసుకోవాలని ప్రయత్నించి విఫలుడవుతాడు. పగ సాధించడానికి పెంచలిమీద కట్టుకథలు కల్పిస్తాడు. ఈ వ్యూహంలో నిజానిజాలు తెలుసుకోలేని రొబ్బడు పెంచలిని పెళ్ళిచేసుకోవాల్సిందిపోయి కొట్టి హింసపెడతాడు. వాడిలో లేమి, అజ్ఞానం వీరవిహారం చెయ్యటంవల్ల ప్రేమ ద్వేషంగా మారుతుంది. బిళ్ళల మొలతాడులో రమణి మారుతున్న కాలంలో మనుషుల విలువలను తను తెలుసుకున్న అతి తక్కువ చదువు ద్వారా గ్రహిస్తుంది. ఆమెకు మహాత్ముడు. మాలపల్లి నవల మహా ఇష్టాలు. ఇక్కడ రచయితకు గాంధీజీ సిద్ధాంతాల మీద, హరిజనోద్ధరణ మీదగల మమకారం కొద్దిగానో గొప్పగానో బయటపడుతుంది. రమణి తన నేర్పరి తనం ద్వారా సుబ్బులును రామిరెడ్డి నుంచి దూరం చేస్తుంది. కాని దొంగ కేసులో రామిరెడ్డి సుబ్బులును ఇరికించినా రామిరెడ్డి తల్లి లక్ష్మమ్మ సొంత కుమారుడల్లే పెంచిన సుబ్బుల తరపునే సాక్ష్యం చెబుతుంది. ఇది ఒక రకంగా రచయితలో ఉన్న జీవకారుణ్య దృక్పధమే ఇది కయ్య కాలువలో వంద యకరాల లక్ష్మమ్మ కొండడ అర ఎకరం నేల తన చెక్కలో కలవలేదని వాణ్ణి పెట్టిన బాధ ఆనాటి భూస్వామ్య వ్యవస్థలో కూలిజనం, చిన్న రైతులు నలిగిపోతున్న విధానానికి నిదర్శనం:

బస్సు కండక్టరుగా ఆరంభించి, కచ్చేరీ గుమాస్తా గిరి చేపట్టి తహసీల్దారు గిరితో తల మునకలై జీవితంలోని తీపిని చేదును లెస్స ఎరిగిన అనుభవశాలి'' అని కరుణ కుమార గారిని గురించి సన్నజీవాలు కథా సంకలనంలో ప్రకాశకులు బయోడేటాలో చెప్పారు.

ఈ కథలు చదివితే ఆనాటి జాతీయోద్యమానికి, సాంస్కృతిక పునరుజ్జీవనానికి ప్రభావితులైన రచయితలకున్న మానవతా విలువలపట్ల గాఢ అభినివేశం. దిగజారిపోతున్న మానవ సంబంధాలను గురించి వారికిగల వేదన స్పష్టంగా అవగాహన కొస్తుంది. నాటి గ్రామీణ వాతావరణంలోని కాలుష్యమూ, దాంతోపాటే అతి కొంచెంగానైనా కనిపించే మానవజీవితం పట్ల ప్రేమ ఈ కథల్లో సహజంగాను, స్వభావ సిద్ధంగాను దర్శనమిస్తాయి. ఈ తరం పాఠకులు ఆ తరం రచయితల్ని చదివితే సంఘం పట్లా, జీవితం పట్లా ఉండవలసిన దృక్పధం కొంతవరకైనా బోధపడుతుంది.

**— టి. ఎల్. కాంతారావు.**

# ఆ ఊరి పేరు కొంకనక్కలపెంట !

## కొంకనక్కలపెంటకు కూతదవ్వులో కోట్లవారిపేట. ఆ పేట- పేరు సార్థకపరుచుకొనింది.

పేరు సార్థకపరుచుకొన్న ఆ పేటలోని చెత్తా చెదారాన్నంతా ఊడ్చి ఊరవతల కుప్ప పోస్తే— ఆ కుప్ప మాదిరి ఉంటుంది కొంకనక్కలపెంట !

కొంకనక్కల పెంటలో నాలుగైదు గడపడలకు తక్కువగా నలభై గడపలుంటాయి అందులో సగానిక పైగా చుట్టుగుడిసెలు మిగిలినవన్నీ మూడంకణాల అడ్డాపిండ్లు. అడ్డాపిండ్ల ముందరైనా, చుట్టుగుడిసెలముందరైనా వెదురుతడికల ప్రహరీగోడలుంటాయి. అందులో ఒక మూలగా ఒక తొట్టి, రెండు బానలు, ఒక ముంత పాచిగట్టి మసిబారి ఎండపూట తాటికాయ రంగును తలపించేస్తుంటాయి. అది పెరడు— ఇంటి ముందర్నే జలదారి. ఆ జలదారి పై దాడిచేస్తూ దోమలగుంపు ! ముక్కుపుటాల్ని అదరగొట్టే కంపు !!...

అది ఒక పల్లే !

ఇట్లాంటి పల్లెల్నే ఈ దేశంలో కవికుమారులు 'పల్లెరా అది పల్లెరా ! పాడిపంటల ముల్లెరా !' అని కీర్తించేది.

కొంకనక్కలపెంటలో కాలూనడానికి కండ్లు చిట్లించి కోట్లవారి పేటగాళ్ళు కండ్లు నులుము కొంటూ నిద్రలేచి బద్ధకాన్ని బండెక్కించక ముందే కొంకనక్కలపెంటవైపు కండ్లు యింతలంతలుచేసి ఎదురుచూస్తూ ఉంటారు—పాలకో పండ్లకో... లేదు కూరగాయలకో !...

కోట్లవారిపేటలోకానీ,కొంకనక్కలపెంటలో కానీ అందరూ ఆస్తిపాస్తులపట్ల ఆసక్తులే !— అయితే ఆ పూరికొంపల్లో చాలమంది ఆస్తిపాస్తులమాట తలపెట్టలేని అశక్తులే !— ఆ అశక్తులకు కూడా కడుపులున్నాయి ఆకడుపుల్లో కూడా ఆకలుంటుంది. ఆ ఆకలి తీరాలంటే ఏదో ఒక విధంగా నాలుగు వేళ్ళు నోట్లోకి పోవలసిందే !

నాలుగువేళ్ళు నోట్లోకి పోవడం ఈ వ్యవస్థలో అందరికీ అంత సుభమైన పనికాదు అందుకే ఆ ఊరు తన అవస్థ తాను పడుతూ ఉంది.

కొంకనక్కల పెంటలో ప్రతి మనిషీ శక్తి వంచన లేకుండా పుడమి తల్లితో పోరాడుతున్నాడు. ఫలితాన్ని పేటకు చేరవేస్తున్నాడు. పేట ఆ ఫలితాన్ని అతి తెలివిగా చేతులు మారుస్తూ ఉంది. ఆ మారుబేరంలో పేట మహడీమీద మహడీగా పెరుగుతూనే ఉంది. అయితే కొంకనక్కలపెంట మాత్రం — ఎక్కడున్నావే గొంగిళీ అంటే వేసినచోటనే !— అన్నట్లుగా ఎదుగు బొదుగు లేకుండా వుంది

కొంకనక్కల పెంటలో ముంతడు పాలు కానీ, గంపడు కూరగాయలు కానీ, కండపట్టిన పొట్టేళ్ళి కానీ బండెడు వేరుశెనక్కాయల్ని కానీ ఎంతో శ్రద్ధగా పేటకు చేరవేసే రైతు తన బిడ్డల్నిమాత్రం పేటకు పంపడానికి తరతరాలుగా వెనుకాడుతూనే ఉన్నాడు.

అంటే — కొంకనక్కల పెంటలో కుర్రవాళ్ళకి పేటంటే భయమనీకాదు పేటంటే తెలియకా కాదు. తూర్పున పటమెగరక మునుపే చెంబుడుపాలు చేతికిచ్చి శాస్త్రులు గారింట్లో యిచ్చిరమ్మని మునెప్ప తన ముద్దుల కొడుకును పంపుతున్నాడు మలికోడి కూతలో మేలుకొన్న తిక్క వరదప్ప తన కొడుకు గోవిందును ఏడాదిగా తాను వెంటబెట్టుకొని మేపిన పొట్టేళ్ళి ఖాదర్ సాహెబ్ కసాయి అంగట్లో తోలరమ్మని పురమాయిస్తాడు గంపకు ఎక్కువై మిగిలిన కూరగాయల్ని బుట్టకువేసి ఆ బుట్టను నెత్తినపెట్టి పేటకు వెంట నడవమంటాడు తన మనుమణ్ణి గంగులయ్య తాత. అయితే పేటలో వుండే స్కూలుకు పంపమంటేనే, 'సదువుకుంటే వాల పడబొయ్యేదేముంది ? అంతకుమించి వొరగబడబొయ్యేదేముంది ?' అని ఎదురు ప్రశ్న వేస్తూనే ఉన్నాడు

అయితే అనుముల అంకయ్య మాత్రం ఏటికి ఎదురీదినట్లుగా, తన ఒక్కగానొక్క కొడుకును పేటకు పంపుతున్నాడు.

ఆ ఊళ్ళో అనుముల అంకయ్యకు చుట్టుగుడిసె మినహాయిస్తే చిట్టెడు పొలంలేదు. పైసా యిరుపులేదు అప్పు పుట్టించుకోగల పరపతి అసలేలేదు.

అయినా అంకయ్య తన బిడ్డను చదువుకు పంపుతున్నాడు !

ఇంక ఒక్క యేడట్లా కండ్లు మూసుకొంటే తన కొడుకు పదవ తరగతి దాటేస్తాడు. పదవ తరగతి చదివినవాడికి ఏదో ఒక ఉద్యోగం రాకుండాపోదు. వస్తే తనకష్టాలన్నీ గట్టెక్కినట్లే !— అన్నఅభిప్రాయంతో అంకయ్య ప్రాణం ఉగ్గబట్టి పనిచేస్తున్నాడు. కూలిచేసి కడుపుగట్టి కొడుకును బడికి పంపిస్తున్నాడు

అంకయ్య కొడుకును బడికి పంపిస్తున్నాడు, వాడు పోతున్నాడు. శ్రద్ధగా చదువుకొంటున్నాడు వస్తున్నాడు. అంకయ్య పెళ్ళాం అలమేలు కూడా తాను తిన్నా తినకున్నా వేళకంత సంకటో సరిబిందో బిడ్డకు పెడతూఉంది అంతవరకు బాగానే ఉంది అయితేవాడు "పరీక్షకు ఫీకు కట్టాలయ్యా !... పుస్తకాలు కొనుక్కోవాలయ్యా !. పదోతరగతి చదవతా వుండికూడా నిక్కరేసుకొని పోవడానికి జంకుగా



# ఊహల ఉయ్యాల

పులికంటి కృష్ణారెడ్డి

ఉంటుందయ్యా!'' అని అడగలేక అడుగుతూ తల గీరుకొంటూ ముందు నిలబడినప్పుడే అంకయ్య గొంతులో పచ్చివెలక్కాయ పడుతూ ఉంటుంది.

కూలిచేస్తే కుండగాలు. లేకుంటే కడుపు గాలు బతుకు అంకయ్యది అట్లాంటప్పుడు కొడుకు అవసరాలు తీర్చాలంటే ఏ అయ్యముందరో చేతులు కట్టుకొని నిలబడాల్సిందే!..

చేతులు కట్టుకొని నిలబడినంత మాత్రాన ఉన్నవాళ్ళ చేతలు మారుతాయా? రీతులు మారుతాయా? నీతుల మూతుల్ని నిమరకుండా వదలిపెడతారా? అందుకే.

''ఒరే! అనుంవులూ! ఎందుకొచ్చిన బాదరాయిదంతా?... నెత్తిన నోరుబెట్టుకొని మొత్తుకుంటే నీ సెవల్లో సెట్లు మొలసేనే!— ఏం జెయ్యాలసెప్పు? ఆహాఁ! వాడు సదువుకొని ఉద్యోగాల్జేసి ఊళ్ళేలబొయ్యేది లేదుకదా? ఏదోఒక మేకపిల్లనో గొర్రెపిల్లనో పట్టియ్యి. ఏడాదట్టా తిరిగీ తిరగకముందే అది కట్టి యీనిందంటే ఒకటిరెండవ్వచ్చు. మూడవ్వచ్చు. ఇంకొక్క యేడాది కండ్లట్టా మూసుకుంటే సేతిలో రూక!—రూకకు రూక కూడేసుకుంటా పోతే అనుంవలూ! యియ్యిరవకు రెండుబర్రె గొడ్లు యింటిముందరుండేవిగదా? పో నీ! యిప్పటికైనా మించిపొయ్యిందేంవీలేదు వాణ్ణి యిస్కూలికి పొయ్యేది నిలిపేయ్. మేకల్నో గొర్రెల్నో నేను పట్టిస్తా!— వాడు మేపకరానీ సాలు. నీకష్టాలెట్లా తీరవో నేన్సూస్తా!''

అంతో యింతోవున్నవాడు ఎంతో అభిమానాన్ని ఒలకపోస్తాడు. అంకయ్య ఆ అభిమానాన్ని తట్టుకోలేక యింకొక్క అయ్యదగ్గరికి బయలుదేరతాడు. అంకయ్య ముందుకుపోతూంటే వెనుక నవ్వుల పువ్వులు రాలుతుంటాయి

అంకయ్య యింకొక్క అయ్యదగ్గర చేతులు కట్టుకోవడమేకాదు. యింకాస్త వంగి నిలబడతాడు. వంగి నిలబడితేమాత్రం ఉన్నవాళ్లు వంగినిలబడుతారా? అట్లా అయినవాడు కాని వాడు వచ్చి వంగి వంగి నిలబడితే ఆ వంగుళ్ళకు నంగేడుపులకు వాళ్ళు వంగిపోతే యింక వాళ్ళు వున్న వాళ్ళెట్లవుతారు? కారు కాబట్టే.

''అంకయ్యా! శానగానమ్మకు సెవుకాడ కొప్పని ఊరికే అన్లేదురా పెద్దోళ్ళు!— అప్పటికి మేంవంతా యదవలంవయినట్టు. నువ్వేమో మహామొనగాడయినట్టు — కాదండీ అవునంటివి. సేతికింద బిడ్డుంటే సెపులేనంత అందగా వుంటాడు. అంతో యింతో కయ్యాగాలవవున్నోళ్ళం, మేంవే సదివించుకోలేకుండా గొడ్డా గోదను మేపకరమ్మంటావుంటే — ఊరు సూడమంటే ఉత్తరం జూసినట్టు నువ్వేమో వాణ్ణి పేటకు పంపిస్తివి. ఇప్పుడు సేతులు పిసుక్కుంటా నిలబడ్తే ఎవురేంజేస్తారు సెప్పు. నువ్వే సెప్పు!''

చెప్పగలగిందానికిమించి వాళ్ళేచెబుతూంటే అంకయ్యమాత్రం ఏమని చెబుతాడు? చెప్పలేడు కాబట్టి చెబితే వినేవాళ్ళు దొరుకుతారేమో? అన్న ఆశతో బయలుదేరుతాడు. ఎంత తిరిగినా తలమట్టి నోటిదగ్గరికి వచ్చినట్లే అవుతుంది.

అంకయ్య యిట్లా ఎంతెంతమంది ముందర నిలబడ్డాడో? ఎన్నెన్ని అనిపించుకొన్నాడో? సేతులు కాదని కాళ్ళే పట్టుకొన్నాడో? ఒక్కగా నొక్క నలుసు... ఎంతో శ్రద్ధగా చదువుకుంటున్నాడు. వాడి ఆశలు తీర్చలేక ఏచెట్టుచాటులోనో నిలబడి ఎన్నెన్ని దినాలు వెక్కివెక్కి యేడ్చినాడో? ఆ మండే వాడికే ఎరుక!

పట్టువదలని విక్రమార్కుడిలా పట్టుబట్టినాడు. పడరానిపాట్లు పడినాడు వినరాని మాటలు విన్నాడు. ఒకపూట తిని యింకొక్క పూట తినక మిగలబెట్టినంతవరకు మిగలబెట్టి కొడుకు కోర్కెలు తీరుస్తున్నాడు. అయినా ఒక్కొక్కప్పుడు పదిమంది చెప్పిన మాట పెడచెవినిబెట్టి ఎందుకీ పని చేసినానా? అని పశ్చాత్తాపపడుతున్నాడు. 'ఇంకీ భారాన్ని మొయ్యలేనురా తండ్రీ!' అని మొత్తుకుంటున్నాడు. అయితే ఒకనాడు కొడుకు పరుగుపరుగున వచ్చి 'అయ్యా! నేను ఫస్ట్ క్లాసులో పాసైనానయ్యా!' అని అన్నప్పుడు మాత్రం అంకయ్య గుండె ఆనందంతో గంతులు వేసింది. ఇక తన కష్టాలన్నీ సూర్యరశ్మిముందు మంచుబిందువుల్లా కరిగిపోతాయనే కలలుగన్నాడు. ఆ కలల్లో తేలిపోతూ ముద్దుల కొడుకును ముద్దులతో ముంచెత్తినాడు.

ఆ రోజు చుట్టుగుడిసెలో ఆనందం సుళ్ళు తిరిగింది!

ఆ రోజు వరకు అంకయ్య కొడుకు మాత్రమే పేటకు పోయివస్తున్నాడు. ఇప్పుడు కొడుకుతో కలిసి అంకయ్య కూడా పేటకు పోతున్నాడు. చేస్తున్న పనిని వదలిపెట్టి కొడుకును వెంటపెట్టుకొని కోట్లవారిపేటలో తిరుగుతున్నాడు. కాసంత తెల్లగా తేటగా కనుపించిన వాళ్లనంతా నిలబెట్టి 'బాబ్బాబూ! పదోతరగతి ఫస్టుక్లాసులో పాసయినాడు బాబూ! ఏదైనా ఉద్యోగం బాబూ! పిలగాడు శానా తెలివైనోడు బాబూ! మేగంలో నీళ్లు దెమ్మంటే తటిక్కేమని తెచ్చేస్తాడు బాబూ! -- మీరు గొప్ప మణుసుజేసి ఏదైనా ఉద్యోగం యిప్పించండి బాబూ!''అని ఏ కుంటి



వాడో గుడ్డివాడో ధర్మం అడిగినంత సులువుగా అడిగేస్తున్నాడు.

అంకయ్యను అందరు అదోరకంగా చూస్తున్నారు. ఆ తరువాత పిచ్చిగానీ పట్టలేదుకదా ? అని ఆలోచిస్తున్నారు. 'లేదు!' అని నిర్ధారించు కొన్న తరువాత తేలిగ్గా నవ్వేస్తున్నారు

వాళ్లు ఎందుకు నవ్వుతున్నారో ? అర్థం కాకుండా అంకయ్య వాళ్లవైపు తెల్లపోయి చూస్తున్నాడు. తెగ బాధపడిపోతున్నాడు. ఒక్కొక్కసారి కడుపు రగిలి కొరకొర చూస్తున్నాడు. చరచర ముందుకు నడుస్తున్నాడు

నడిచి నడిచి కాళ్లు పీకుతున్నాయి. అడిగి అడిగి నోరు నొస్తూ ఉంది తన నిస్సహాయత మీద తనకే కోపం వస్తూ ఉంది అయినా ఏం చెయ్యగలడు? పేదవాని కోపం పెదవికి చేటు!—

ఏం చెయ్యలేనపుడు చేతనైనపని ఒక్కటే! జుట్టు పీక్కోవడం! పీక్కొన్నాడు తల కొట్టుకొన్నాడు. కొంకనక్కల పెంటలో పెద్దోళ్లు చెప్పినమాట తలచుకొని తలచుకొనియేడుస్తాడు

తండ్రి ఎందుకు ఏడుస్తాడో అర్థంకాక కొడుకు తండ్రివైపు చూస్తాడు ఓదార్పే వైనం తెలియక తికమక పడతాడు.

అంతలో పొద్దు గూట్లో పడుతుంది

అబ్బ కొడుకు గూడు చేరడానికి బయలు దేరతారు

దారిలో ఎవరూ కంటపడకపోతే ఏ బాధా లేదు గుట్టుగా గుడిసెజేరి కాళ్లెత్తి కడుపులో పెట్టుకొని ముడుచుకుంటారు ఎవరైనా ఎదురు పడినపుడే లేనిపోని పీకులాట!—

'ఏంరా అంకయ్యా! నల్లపూసవైపోతివి గదరా!— అవున్లే కొడుకు పస్టు కళాసులో పాసైపాయగదా! యింక నీకేం తక్కవలే!' అని ఒకరంటే—

''ఏంటో అనువులూ! కొడుక్కుఉద్దోగం వచ్చేసినట్టేనా ?'' ''ఏం ఉద్దోగంలే ? — కలెట్రా ? తాసీల్దారా ?'' అని మరొకరి ఎత్తిపొడుపు

పుండుమీద కారం చల్లినట్లుంటుంది! అయినా వంచిన తలెత్తడు అంకయ్య పెదవి కదపడు అంకయ్య నవ్వినఊళ్ళే పట్నాలవుతా యని నమ్మకం పాపం! —

ఒకానొకదినం కోట్లవారిపేటలో ఆ తండ్రీ కొడుకుల దయనీయమైన పరిస్థితిని అర్థం చేసుకొన్న ఒకానొక దయామయుడు శుక్ర గ్రహాన్ని చేరుకొనే సూక్ష్మం తెలిసినంత ధీమాగా ఎంప్లాయిమెంటు ఆఫీసుకు దారిచూపి అక్కడికి పోతే అక్కడికక్కడే ఉద్యోగం ఖాయం అన్నట్లు ధైర్యం చెప్పినాడు.

అంకయ్య అరక్షణంలో ఆ ఆఫీసుముందరి నిలబడినాడు

ఆ ఆఫీసుముందరొక పెద్ద క్యూ!

రెండు రూపాయల కిలో బియ్యం కోసరం, కిరసనాయిలు కోసరం గంటలతరబడి నిలబడిన అనుభవం ఉంది కాబట్టి అంకయ్య ఆ క్యూని చూచి ఆశ్చర్యపడలేదు. 'ఇది అలవాటే గదా ?' అన్నట్లుగా కొడుకును పక్కన నిలబెట్టుకొని తాను ఆ క్యూలో నిలబడుకొన్నాడు

ఆ క్యూ నడిచింది నడిచింది నత్తనడక నడిచింది!

నిట్టమధ్యాహ్నం వేళకు అంకయ్యవంతు వచ్చింది

ఆఫీసర్ ఎదుట నిలబడీ నిలబడగానే అంకయ్య రెండు చేతులు పైకెత్తి దండం పెట్టాడు లయితే ఆఫీసర్ వంచిన తలెత్తకుండా ఏదో రాసుకొంటూ ఉన్నాడు.

''అయ్యా అయ్యా! ఈడు నా కొడుకయ్యా! అష్టకష్టాలు పడి చదివించినానయ్యా! పదోతరగతి పస్టుకళాసులో పాసైనాడయ్యా! ఆ పూటకు గెంజికికూడా నోసుకోని పేదోణ్ణయ్యా! కావందులవారు గొప్పమనుసు జేసి నా బిడ్డకొక ఉద్దోగం యియ్యాల్సిందేనయ్యా!''

క్యూలో నిలబడినంతసేపు బుర్ర బద్దలు కొట్టి కొట్టి ఆలోచించి ఆలోచించి మననం చేసుకొన్న మాటల్ని దాదాపు ఏడుపు గొంతుతో ఏకరువు పెట్టాడు

ఆఫీసర్ వంచినతలెత్తలేదు!

అంకయ్య పైకెత్తిన చేతులు దించలేదు.

గోడమీది గడియారం వీళ్ళకోసరం క్షణం ఆగలేదు

అంకయ్య ఓర్పు దెబ్బతినింది

''అదేంటయ్యా ? — పొట్ట క్కరకొచ్చిన సేన్లో మా పక్కింటోళ్ళు పోటేరి పడినట్లుందే యవ్వారం సెప్పింది సెవల్లో యేసుకోకుండా ఒక్కవోపుని రాసుకుంటావుండావే ?'' —

వంపులు తిరిగిన క్యూలో నవ్వులు కెంపులు తిరిగినాయి

ఆఫీసర్ చెవుల్లో ఆ నవ్వులు మాత్రం దూరినట్లున్నాయి.

చివుక్కున తల పైకెత్తినాడు

''ఏంవన్నావురా! ఫూల్!. .యిడియట్!. గెటవుట్ !! .. పోరా ఫో! ఎవుడితో చెప్పకొంటావో చెప్పకో పోరా! — నీ యబ్బకు లేకుంటే వాడెబ్బకు! ఉద్యోగాలంటే చెట్లో కాసే చింతకాయ లనుకొన్నారు వీళ్ళు వస్తూనే కోసి కోసి వీళ్ళ చేతుల్లో పోయడానికి! . .''

చెప్పులమీద నిలబడినా ఆఫీసర్ నిప్పులమీద నిలబడినట్లు చిందులు తొక్కుతున్నాడు.

''అదిగాదయ్యా !...'' అంకయ్య ఏదో చెప్పబోతున్నాడు.

''అది గాదెకాదు. ఇది బొట్టం కాదు. నోరు తెరిచినావంటే మెడపట్టి బయటికి గెంటేస్తా!... నడు బయటికి!''— ఆవేశంతో అరుస్తున్నాడు ఆఫీసర్.

అంకయ్య బయటికి నడిచినాడు — మెడ బట్టి గెంటవలసిన అవసరం లేకుండానే!— ఆ ఆఫీసు ముందర్నే దిగులుగా నిలబడుకొన్నాడు. అంతకు మునుపే తన మాటలకు విరగబడి నవ్విన గుంపో యిప్పుడు తన్ను ఒక పురుగును చూచి నట్లు చూస్తూ ఉంది. ఇక అక్కడ నిలబడ లేక పోయినాడు.

అంకయ్య బయల్దేరినాడు!

ఎటు వెళ్ళాలి? ... పేటకు నాలుగు దిక్కులు. నాలుగు దిక్కులకు నలబై దోవలు. ఏ దోవనుబట్టి పోవాలి?—అని ఆలోచిస్తూనే అలవాటు మేరకు కొంకనక్కల పెంట దారినే పట్టాడు.

అంకయ్య యింట్లో అడుగు పెట్టాడు!

ఇంట్లో యిల్లాలు అలమేలు అలిగినట్లు మంచంమీద ముడుక్కోనుంది. ఎదురింటి వాళ్ళ పిల్లి తనఇంటి పొయ్యిలో హాయిగా పడుకోనుంది!



అప్పటికి అంకయ్య కూలికి వెళ్ళి పదిరోజులకు పై బడింది చేతిలోవున్న రూకా అడ్డగా తిరుగుళ్ళలో చేతిఖర్చులకే సరిపోయింది ఆ చుట్టు గుడిసెలో కడవల్లేవు కాగులూ లేవు అడుగు బొడుగు దోర్చుకొన్నా ఆ పూట గడుస్తుందనడానికి! అందుకే అటు యిటు చూడకుండా ఒక్కంగలుగువులో వెళ్ళి బోడిరెడ్డి పంచన నిలబడినాగ, అంకయ్యను చూచీ చూడగానే బోడిరెడ్డి అందుకొన్నాడు

"ఏవిరే! అనువులూ! ఎంతదానీ కొడుకు పాస్సు కళాసులో పాసైతే మాత్రం మ ణి సే కనపడకుండా పోతివిగదరే?— మొన్నా పెద్ద బాయిలో తిరుగుడు కపిలతోలేదానికి మణిసి దొరక్క తికమక పడిపోతిగదరా! అయినా యింక నీకేం కర్మ పట్టిందిలే కూల్జేసేదానికి?—కొడుకు సంపాయిస్తావుంటే కాలుమింద కాలేసుకోనితింటా వుండే పనేగదా? "

కడుపు మంట కాపురానికి రే జీ క టి మగడంట!

అంకయ్య అభిమానం చచ్చింది కానీ, ఆకలి చావలేదు

ఆ ఊళ్ళో మానెడుగింజలు పుట్టించుకోవడానికి పుట్టెడు దెప్పించుకొన్నాడు

*   *   *

కొడుకు పదవతరగతి ఫస్ట్‌క్లాస్‌లోపాసైనా అంకయ్య రోజూ కూలికి పోతూనే ఉన్నాడు.

అలమేలు ఆయింటా, ఈయింటా పాచి పనులు చేస్తూనే ఉంది

అటు పై చదువులకు పోలేకుండా, యిటు కూలిపనులు చేతగాక అంకయ్య కొడుకు అమ్మ నాయనా కష్టపడుతూంటే చూస్తూనే హాయిగా కూర్చుని తింటున్నాడు — అంతకంటే ఏమీ చేయను చేతగాక!—

అంకయ్య ఎదుటపడితేచాలు — ఊరు ఎకసక్కేలాడుతూనే ఉంది

కష్టాలు అడుగడుగునా కాలాన్ని గుర్తు చేస్తుంటే కాలయంత్రం తెలియకుండా గడచిపోతూ ఉంది

ఏడాది గడచిపోయింది!—

ఒకనాటి ఉదయాన

రెండు బారల పొద్దెక్కిన సమయాన కొంక నక్కల పెంట పనీ పాటకని బయలుదేరుతున్న తరుణాన— ఊరిముందర ఒక జీప్ వచ్చి ఆగింది

బెల్లం చుట్టూ ఈగిలు ముసిరినట్లుగా ఆ ఊళ్ళో పెద్దా చిన్నా తరతమ భేదాలు లేకుండా ఆ జీప్‌ను చుట్టుముట్టారు

ఆ జీప్‌లోనుండి ఒక ఆఫీసర్ హుందాగా దిగినాడు ఆ జవాను పిల్లల్ని ఈగల్ని తరిమినట్లు తరుముతూంటే — ఆఫీసర్ పెద్దవాళ్ల వైపు తిరిగి 'ఈ ఊళ్ళో చదువుకున్నవాళ్ళు ఎంతమందున్నారు?' అని ప్రశ్నించాడు

"ఎందుకూ ? ఉద్యోగాలేవైనా యివ్వబోతారా?" ఒక నోటి దురుసు మనిషి ఎదురు ప్రశ్న వేసినాడు

"ఉద్యోగా లెందుకురా ? నీకంగా రేపు ఎలక్షన్లలోనే నిలబెట్టేస్తారు!" ఇంకొకడు నోరు చేసుకొన్నాడు

"మీరుండారే యితండవంటే కోదండమనే నాయాండ్లురా! — అడిగిందానికి బదుల్జెప్తే పోలా?" — మరొక నెమ్మదస్తుడు జోక్యం చేసుకొన్నాడు.

"సెప్ప. సెప్తానంటే నిన్నెవురో యిక్కడ పట్టుకోని పాతేసినట్టుందే!"

"సెప్తాన్రా! సెప్తాను ఎందుకు సెప్పను. అయ్యా! ఈ ఊళ్ళో ఒక్కడే ఒక్క పింగాడండీ! వాడా అంకటి కొడుకు పదో తరగతి పస్టు కళాసులో పాసైనాడంట!"

"ఆ కుర్రవాడొక్కడేనా చదుపుకొనింది!" ఆఫీసర్ అడిగినాడు

"అవునయ్యా!"

"కనీసం ఏడవ తరగతిదాకాకూడా ఎవ్వరూ చదవలేదా?" ఆఫీసర్ ఆశ్చర్యంగా అడిగినాడు.

"మా అబ్బతోడు వాడికి తప్పితే అచ్చరం ముక్కొచ్చిన ఎదవెవుడూ లేడండీ ఈవూళ్ళో!"

"అయితే ఆ కుర్రవానికి ప్రభుత్వం యిరవై అయిదువేలు అప్పు యిస్తున్నది"

"ఆఁ!"

ఆశ్చర్యంగా నోరు తెరిచింది ఊరు!

"అవునయ్యా! గ్రామాల్లో చదువుకొని ఉద్యోగంలేని కుర్రవాళ్ళకు ప్రభుత్వంచేస్తున్న సహాయంయిది ఈ అప్పుతో అతడు అవుల్ని కొనవచ్చు గేదెల్ని కొనవచ్చు కోళ్ళఫారం పెట్టుకోవచ్చు లేదా ఒక చిన్న కుటీర పరిశ్రమ ఏదైనాసరే! — అప్పుయివ్వడమేకాదు మేము అతనికి ఆసరాగావుండి అన్ని స హా యా లు అందిస్తాం. ఇందులో నాలుగింట ఒకభాగం కేంద్రప్రభుత్వం స బ్సి డీ కిం ద ఉ చి తం గా యిస్తుంది." అని అంటూ ఆఫీసర్ అంకయ్యని పలిపించి ఆ కుర్రవాడి వివరాలు రాసుకొన్నాడు. ఆ తరువాత జీప్ దుమ్ము రేపుకొంటూ వచ్చిన దారిన పట్టి వెళ్ళిపోయింది!

ఊహించని ఈ ఆస్తితో కొంకనక్కల పెంటలో ఊహాగానాలు లేచినాయి.

అంకయ్య చుట్టుగుడిసెలో ఆనందం సుళ్ళు తిరుగుతూ ఉంది!

అంకయ్య, అంకయ్య కొడుకు చుట్టు గుడిసెలో ఊహల ఉయ్యాల్లో కూర్చుని వెళ్ళిపోయిన జీప్ కోసం ఎదురు చూస్తూనే ఉన్నారు!





## ఆంధ్రప్రదేశ్‌లోని వీరకల్లులు

— ఫొటో : ఏలేశ్వరపు నరసింహారావు



# సినిమా దృష్టి సృష్టి

-ఎన్. కృష్ణంరాజు (నవత)



క్రాఫ్, పేపరు జీవితంలో భాగమైనట్టే సినిమా కూడా జీవితంలో భాగమైంది. గుడిలో, బడిలో, నడివీధిలో సినిమా మాట వినిపిస్తోంది. సినిమా పాట వినబడుతోంది.

సాహిత్యానికి సినిమా యాంత్రిక రూపం. ఒకటి కాగితంమీద, మరొకటి ఫిలిమ్‌మీద అచ్చు అవుతాయి. సాహిత్యం చదువుతూ చూస్తాం. సినిమా చూస్తూ చదువుతాం. సాహిత్యంలో మంచి చెడు వున్నట్టే సినిమాలోనూ అవి వున్నాయి.

"ఆఫ్ ఆల్ ఆర్ట్స్ సినిమా ఈస్ గ్రేట్" అన్నాడు లెనిన్. ఇది 1920 నాటి మాట. "నేను ఒకే ఒక్క సినిమా చూశాను. సినిమాల గురించి నేను ఏమి చెప్పగలను? అవి మంచి చేస్తే మంచిదే కదా" అన్నాడు గాంధీజీ చార్లీ చాప్లిన్‌తో. నవ్వులరాజు నవ్వుకుంటూ వెళ్లిపోయాడు, ఇది 1931లో; "సినిమాలు మన మనసుల్ని కలుషితం చేస్తున్నాయి," అన్నాడు రాజాజీ. ఇందులో ఎవ్వరూ సినిమా మనుషులు కాదు. వంటవాడ్ని వంట రుచి అడగకూడదు. సినిమావాళ్ల అభిప్రాయాలు నేను కోట్‌చేయటం లేదు. లెనిన్ ఆశావాది. గాంధీజీ ఆదర్శవాది. రాజాజీ యదార్థవాది.

లెనిన్‌కు రాజాజీకి మధ్య అంతరం నాలుగు దశాబ్దాలు. ఈ కాలంలోనే రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా ప్రపంచంలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆ మార్పుల ప్రభావం అంతా సినిమాలమీదకొచ్చి తీరుతుంది. వచ్చింది. బికాస్ సినిమా ఈస్ ఎ పీపుల్స్ ఆర్ట్. సినిమా సమాజ ప్రతిబింబమే అవుతుంది. అది మానవ సృష్టే కనుక, సృష్టించేవాడి సంస్కారం, అభిరుచి, స్థాయినిబట్టే అది ఆవిష్కరింపబడుతుంది. ఇన్‌స్టిట్యూషన్‌నుంచి ఇన్‌స్టిట్యూషన్— అంతర్ దృష్టినుంచి బాహ్యదృష్టి. అందుకే అన్ని దేశాల్లోను, అన్ని కాలాల్లోను ఎన్నోరకాల సినిమాలు రావడం జరుగుతోంది. కమ్యూనిస్టు దేశాలకన్నా ప్రజాస్వామ్య దేశాల్లో స్వేచ్ఛ, లాభాపేక్ష దృష్టి మరింత ఎక్కువ కనక వైవిధ్యం వున్న సినిమాలు వస్తున్నాయి. మరీ హీనమైన సినిమాలు వస్తున్నాయి.

"లాభం" పాపంకాదు. "లాభమే లక్ష్యం" అన్నది పాపం, ఏమంటే అది అపమార్గాలు పట్టిస్తుంది. జీవిత విలువల్ని అపవిత్రం చేస్తుంది. కళల్ని కలుషితం చేస్తుంది. సినిమా అన్నది వులికి శిలకి, కాగితాన్కి కలాన్కి పరిమితమైన కళకాదు. వందలాది కళాకారుల సమిష్టి కృషి. లక్షలాది ధనాన్కి సంబంధించిన ఖర్చు. కోట్లాది జనం దాని ప్రేక్షకులు. ఇంతటి విస్తృత ప్రజాహిత, ప్రజా సన్నిహితమయినది కనుకనే రకరకాల మనుషులు దాని ఆకర్షణకు లోబడుతున్నారు.

కొందరు కళాదృష్టితో, కొందరు కళా వ్యాపార దృష్టితో, కొందరు వ్యాపారదృష్టితో మాత్రమే.

పై ముగ్గురినీ ఎ, బి, సి గా విభజించి, కాస్త వివరణలలోకి వెడదాము. కథకు ఓ హృదయం వుంటుంది. కథకుడికి ఓ హృదయం ఉంటుంది. దాన్ని సహృదయంతో అర్థం చేసుకొని హృద్యంగా సెల్యులాయిడ్ చేస్తారు కొందరు

వీరు ఎ తరగతి:—వీరికి డబ్బు రాకపోకలతో పనిలేదు. వారి సినిమా నలుగురూ చూస్తే హర్షిస్తారు. చూడకపోతే కృంగిపోరు. వీరి సినిమాల్లోకూడ జయాపజయాలు వుంటాయి. సత్యజిత్‌రాయ్, మృణాల్‌సేన్, శ్యామ్ బెనెగల్ మొదలైనవారు ఈ తరగతి. వీరి హార్టు అంతా ఆర్టుతో నిండిపోతుంది. కళ మానవ కళ్యాణం కోసమనే నమ్మేవాళ్లు, ఆచరించేవాళ్లు, రాజీ ప్రసక్తి లేనేలేదు.

బి తరగతి :— సినిమా కళే. అయితే డబ్బుతో కూడిన కళ ఖరీదయిన కళ. అందులో వాణి, వాణిజ్యం, వినోదం, వికాసం ఉన్నాయని నమ్మేవారు. జనం చెడిపోకూడదు; నిర్మాత చెడిపోకూడదు. పరిస్థితులతో కాస్త రాజీ. సంసార పక్షం, సెన్సారు పక్షం వీటికి గల్లాపెట్టెదగ్గర విజయ అపజయాలు వుంటాయి.

హృషీకేష్ ముఖర్జీ, జా సూ చ ట ర్జీ, బాలచందర్, బాలూమహేంద్ర, మన విశ్వనాథ్ వగైరాలు.

సి తరగతి :— వీరి సినిమా అన్నది పట్టే వ్యాపారం లాభమే ప్రధానం. డబ్బుకోసం ఏ అడ్డదారులయినా తొక్కుతారు, ఏ గడ్డిఅయినా తింటారు. గవర్నమెంటు నోరు నొక్కడం, సెన్సారు కళ్లు కప్పడం, ప్రజల దౌర్భాగ్యాలను కేష్ చేసుకోవడం వీరి ఆశయం. వీరికి తలతో పనిలేదు. వలే వారి ఆయుధం. ఈనాడు వారిదే పైచేయి అయినా వీటికి జయాపజయాలు మామూలే. వీటినిబట్టి ఏమి తేలతోందంటే — మన దృష్టిని బట్టే సృష్టి వస్తోంది కాని, సృష్టిని బట్టే లాభనష్టాలు రావడంలేదు. అందుకే సినిమా సైన్సు కాదు. ది లా ఆఫ్ సినిమా ఈస్ లా లెస్‌నెస్. దాని విజయరహస్యం పరమ రహస్యం. మూడు వేల పేజీల గ్రంథాన్ని, మూడు రూపాయలతో, మూడు గంటల్లో చూపించగల సత్తా దానికి ఒక్కదానికే వుంది. సమాజం వల్ల అది చెడుతోందో, దానివల్ల సమాజం చెడుతోందో మనం ఖచ్చితంగా చెప్పలేము కాని ఒకదాని ప్రభావం ఒకదానిమీద వుంది. వుంది కనుకనే ఏమాత్రం రాజకీయ జీవనం లేనివాళ్లుకూడ రాజ్యాధికారం చేయగల్గుతున్నారు. జనం వాళ్లకి జేజేలుపడుతు తున్నారు.అన్నిరంగాలుచెడ్డాయికనుక ఇదిచెడింది. దానికి చెడగొట్టగలశక్తి ఉందికనుక బాగుచేయగలశక్తి వున్నట్టే. ఒక మాత్ర మనిషిని చంపుతోంది మరోమాత్ర బ్రతికిస్తోంది. సకలకళల సంగమం అది. దాన్ని పవిత్రసంగమం చేసుకోవాలి. మూవీస్ మస్ట్ మూవ్. అది కదపాలి కుదపాలి కల్లోల పరచాలి.

"కదిలేది కదిలించేది
పెనునిద్దర వదిలించేది
మునుముందుకు నడిపించేది" అన్నాడు శ్రీశ్రీ సాహిత్యం గురించి. సినిమాకి ఇది అక్షరాలా వర్తిస్తుంది. మంచిపుస్తకంలాగే మంచి సినిమా మానవాలికి మంచిమిత్రుడు.★

# ట్రిలో

## ఉపయోగించడానికి మీకొక మంచి కారణం:




## ఇతర ప్రముఖ డిటర్జెంట్ బిళ్లలకన్న
# దీని ధర 30% తక్కువ.

## ఇవిగో, ఇంకా మూడు కారణాలు:

### మరింత నురుగు



దీని సమృద్ధమైన నురుగు మరే డిటర్జెంట్ బిళ్లకన్న ఎక్కువ బట్టలను శుభ్రం చేస్తుంది.

### మరింత ఉతికే శక్తి

అతిగా మాసిన బట్టల్ని కూడ చక్కగా శుభ్రం చేయగలది ట్రిలో అందులోనే ఉన్న బ్లూ తెల్లటి బట్టలకు వాటి అసలు తెల్లదనపు మెరుపు తెస్తుంది.



### మరింత మన్నిక




ట్రిలో సులువుగా మెత్తబడిపోదు. అందుకే అందులో వృథాపోయేది ఎంత మాత్రం ఉండదు. పూర్తిగా అరిగిపోయేదాకా ట్రిలోను వాడవచ్చు.

**ట్రిలో** — <u>మరింత</u> ఉపయోగకరమైన నీలి డిటర్జెంట్ బిళ్ల.

Godrej ఉత్పాదన

CHAITRA-GS-188 FEL



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "నిర్దోషి"లో న్యూస్

కిరణ్ [మురళీమోహన్]ను హోటల్ వద్ద రిసీవ్ చేసుకున్నాడు బావ [గొల్లపూడి] "గుడ్ మార్నింగ్, బాసూ! ప్రమాదాలు లేకుండా ప్రయాణం జరిగింది కదా? కుడికాలు పెట్టు రూమ్ ఎలా ఉంది?"

చేతిలోని బ్రీఫ్‌కేస్‌ను టేబుల్‌మీద పడేసి కిరణ్, "బాగుంది కాని, మన అసలు పాయింట్ లోకి రా!" అన్నాడు

"పాయింట్‌లోకి వచ్చేముందు చిన్న జాయింటే న్యూస్ ఈ ఊరు మా భలే ఊరు, బాసూ! సాధారణంగా దొంగలను వెతుక్కుంటూ పోలీసులు తిరుగుతూంటారు కాని, ఈ ఊళ్ళోని దొంగలంతా కలిసి ఓ కమిటీ కింద ఏర్పడిపోయి, పోలీసుల ఫామిలీలను దోచెయ్యటానికి కంకణాలు కట్టుకుని తిరుగుతున్నారుట దాంతో రాత్రయే సరికి పాపం పోలీసులంతా తలుపులు వేసుకుని ఇంట్లోంచి బయటకు రావటం లేదట"

కిరణ్ చిరాకుతో "నిన్నిక్కడికి పంపించింది ఇలాంటి బేవార్స్ న్యూస్ పోగుచెయ్యటానికి కాదు, నేను చెప్పిన పని ఎంతవరకు తగలెట్టావో ఆ సంగతి చెప్పు!" అన్నాడు

చివాలున జేబులోంచి ఓ ఫోటో తీసిస్తూ, "నువ్వు బాణం గురిపెట్టాల్సిన లేడిపిల్ల ఫోటో" అన్నాడు బావ

కిరణ్ రెప్పలార్పకుండా ఆ ఫోటో వంకే చూస్తూండిపోయాడు

మురళీమోహన్ సమర్పించే జయభేరీ ఆర్ట్ ప్రొడక్షన్స్ "నిర్దోషి" చిత్రాన్ని రామచంద్ర దర్శకత్వంలో మాగంటి వెంకటేశ్వరరావు నిర్మించారు ఏప్రిల్ మొదటి వారంలో విడుదల నిర్వహణ కిశోర్

## డైరెక్టర్ కె రాఘవేంద్రరావు సొంత హిందీ చిత్రం ప్రారంభం

"రాజమండ్రి దగ్గర ఒక లంకలో మార్చి 14 నుంచి పక్షం రోజులపాటు తొలి షెడ్యూల్ జరుగుతుంది," అన్నారు డైరెక్టర్ కె రాఘవేంద్రరావు ఈయన మాధవీ ఇంటర్నేషనల్ [మద్రాసు] పతాకంలో "త్రిశూలం" ఆధారంగా నిర్మించే హిందీ చిత్రంలో రాజేష్‌ఖన్నా, శ్రీదేవి, జయప్రద, పద్మిని కొల్హాపురి, కాదర్ ఖాన్, అస్రాని, రంజిత్, ఓం శివపురి, సత్యేన్ కపూర్, మోహన్‌ఛోటీ, రాజ్‌కిశోర్, మాస్టర్ వికాస్ నటిస్తున్నారు కాదర్‌ఖాన్ సంభాషణలు, ఇందీవర్ గీతాలు, బప్పిలహిరి సంగీతం, కె ఎస్ ప్రకాష్ ఛాయ, సలీం నృత్యాలు తెరవెనుక హంగులు

## సురేష్ ప్రొడక్షన్స్‌లో బాలకృష్ణ

"మే నుంచి షూటింగ్," అన్నారు డి రామానాయుడు ఈయన నిర్మించే సురేష్ ప్రొడక్షన్స్ చిత్రంలో నందమూరి బాలకృష్ణ సరసన విజయశాంతి నాయిక మురళీమోహనరావు దర్శకుడు

"కోడెత్రాచు"లో శోభన్‌బాబు, శ్రీదేవి

## దాసరి దర్శకత్వంలో "మహాత్ములారా మళ్ళీ పుట్టండి"

''మద్రాసులో కొంత భాగం, హైదరాబాద్‌లో కొంతభాగం షూటింగ్ ప్లాన్ చేశాం,'' అన్నారు కొడాలి బోసుబాబు. ఈయన తారకేశ్వరి క్రియేషన్స్ పతాకంలో నిర్మించే పై చిత్రంలో మురళీమోహన్, సుజాత, సుమలత ఆదిగాగల వారుంటారు. రమేష్‌నాయుడు సంగీతం, కె.ఎస్. మణి ఛాయ, కృష్ణ కూర్పుతో దాసరి నారాయణరావు రచన, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

## కృష్ణ "సూపర్ స్టార్"

''పద్మాలయా సోదరుల సహకారంతో ఈ చిత్రనిర్మాణ కార్యరంగంలో దిగాను,'' అన్నారు ఎడిటర్ జగదీష్. ఈయన దర్శకత్వంలో ఎస్. సూర్యప్రకాశరావు నిర్మించే విజయపావనీ ఎంటర్‌ప్రైజెస్ ''సూపర్ స్టార్'' చిత్రంలో కృష్ణ, జయప్రద, జగ్గయ్య, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ఆదిగాగలవారు పాల్గొంటున్నారు. సత్యానంద్ సంభాషణలు, సత్యం సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, పి. వెంకటేశ్వరరావు శిల్పం, చంద్రమౌళి — సూర్యనారాయణ ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు.

"ఈ సంవత్సరం మీరు పది సినిమాలు తీస్తారు వాటిల్లో ఐదు వజ్రోత్సవాలూ, రెండు రజతోత్సవాలు, రెండు శతదినోత్సవాలు. ఒకటి ఫరవాలేదు!''




## వేజెళ్ళ దర్శకత్వంలో డి. వి. ఎస్. రాజు చిత్రం

''ఏప్రిల్ 8 నుంచి మే 15 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది,'' అన్నారు డి. వి. ఎస్. రాజు. ఈయన నిర్మించే డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి చిత్రానికి మార్చి 7న లాంఛన ప్రాయంగా ప్రారంభోత్సవం జరిగింది. తొలి షాట్‌కు యు. విశ్వేశ్వరరావు కెమెరా స్విచ్ ఆన్ చేయగా, నందమూరి త్రివిక్రమరావు క్లాప్ కొట్టారు. చంద్రమోహన్, రంగనాథ్, శారద, శ్యామలగౌరి, కళారంజని, గొల్లపూడి మారుతిరావు, అన్నపూర్ణ, రమాప్రభ, వేలు, రాజా, సాక్షిరంగారావు, తాతినేని రాజేశ్వరి పాత్రధారులు. డాక్టర్ నెల్లుట్ల మాటలు, పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, ఆర్. కె. రాజా ఛాయ, మారపనేని కళాధర్ శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పుతో వేజెళ్ళ సత్యనారాయణ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు.

# నేటి తెలుగు సినిమా

**— డి.వి.యస్.రాజు**



**1982లో** టాకీ స్వర్ణోత్సవం జరుపుకున్న తెలుగు సినిమాకు మహత్తరమైన చరిత్ర ఉంది. 1931లో అంటే దాదాపు అయిదు దశాబ్దాల క్రితం మనదేశంలో టాకీ చిత్ర నిర్మాణంతోపాటు తెలుగు చిత్ర నిర్మాణం ప్రారంభమైంది. 1931లో తొలి తెలుగు టాకీ "భక్తప్రహ్లాద" నిర్మించబడింది. అదే సంవత్సరం తొలి హిందీ టాకీ "ఆలమ్ ఆరా" తయారైంది. తొలి హిందీ టాకీతోపాటు తొలి తెలుగు టాకీ రూపొందడం తెలుగు చలన చిత్ర రంగానికి ఒక ఘనతే. ఎందరో మహనీయుల నిరంతరకృషి, తపస్సు ఫలితంగా ఈరోజు తెలుగు సినిమా భారత సినిమా రంగంలో ప్రథమస్థానం ఆక్రమించిందని చెప్పడానికి ఆంధ్రుడిగా ఎంతో గర్విస్తున్నాను. ఏటా దాదాపు 150 చిత్రాలు తెలుగులో తయారవుతూ హిందీ చిత్ర నిర్మాణాన్ని కూడా అధిగమించింది. అలాగే ప్రదర్శనారంగంలో కూడా యావద్భారత దేశంలో దాదాపు 11 వేల థియేటర్లు ఉండగా — మన రాష్ట్రంలోనే రెండువేల పైచిలుకు థియేటర్లు ఉన్నాయి. ఇలా ప్రదర్శనారంగంలోనూ అగ్రస్థానంలో ఉన్నాం. అంతేకాక ఇతర భాషల్లో తయారయ్యే చిత్రాల స్థాయికి మించి మన తెలుగులో ఉత్కృష్టమైన చిత్రాలు నిర్మించగలుగుతున్నాం. తద్వారా ఎన్నో వేలమంది ఈ సినిమారంగంలో శ్రమించి, తమకూ— తద్వారా తెలుగు వారికీ ఎనలేని కీర్తిప్రతిష్ఠలను ఆర్జించి పెట్టగలిగారు. ఇంతటి ఔన్నత్యానికి ఆదిలో మూలపురుషులైన ఎందరో వైతాళికులు ఈనాడు మన మధ్యలేరు. సర్వశ్రీ రఘుపతివెంకయ్య, పోతిన శ్రీనివాసరావు, పి వి. దాసు, జి. కె. మంగరాజు, నిడమర్తి సూరయ్య, హెచ్. ఎం. రెడ్డి, సి. పుల్లయ్య, మిర్జాపురం రాజా, గూడవల్లి రామబ్రహ్మం, బి. ఎన్. రెడ్డి, కె. వి. రెడ్డి, నాగయ్య, వై. వి. రావు, చక్రపాణి, కన్నాంబ ప్రభృత బహుముఖ సేవలు చేసిన మహనీయులందరికీ జోహారులర్పించడం మన విధి. శ్రీ ఎల్. వి. ప్రసాద్ తొలి తెలుగు టాకీ "భక్తప్రహ్లాద", తొలి తమిళ టాకీ "మహాకవి కాళిదాసు", తొలి హిందీ టాకీ "ఆలమ్ ఆరా"లో నటించి, ఇంతింతై వటుడింతయై అన్నట్లు ఒక గొప్ప నటుడుగా, మేటి దర్శకుడుగా, అగ్ర పారిశ్రామిక వేత్తగా ఈనాటికీ చలన చిత్ర పరిశ్రామివృద్ధికి ఎంతో కృషి చేస్తుండడం మనమెంతో గర్వించదగ్గ విషయం. శ్రీ ప్రసాద్‌తోపాటు శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీమతి పి. భానుమతి, శ్రీ పి. రామకృష్ణారావు, శ్రీ రామకృష్ణప్రసాద్ ప్రభృతులెందరో నిరంతరం కృషి చేస్తూ తెలుగు వారంతా గర్వపడే రీతిలో అత్యంత ఆధునికమైన స్టూడియోలు, లేబరేటరీలు నిర్మించి, ఈ పరిశ్రమాభివృద్ధికి ఇంకా విశేషమైన కృషి చేస్తూనే ఉన్నారు. ముఖ్యంగా శ్రీ సి. పుల్లయ్య గారు ఆదిలో తెలుగు చిత్ర నిర్మాణం కలకత్తా, కొల్హాపూర్‌లలో ప్రారంభమైన నాటి నుంచి ఈనాటి వరకు ఎన్నో చిత్రాలు నిర్మించి తెలుగు చిత్ర జగతికి గణనీయమైన సేవ చేస్తూనే ఉన్నారు. ఈ ప్రముఖులందరూ ఈనాటికీ తెలుగు చిత్ర పరిశ్రమాభివృద్ధి కృషిలో భాగస్వాములై ఉండడం ఈతరం వారి అదృష్టమని నేను భావిస్తున్నాను.

ఇక రెండవ తరం ... శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ ఎన్. టి. రామారావుగార్లు అగ్రశ్రేణి నటులుగానే కాక పరిశ్రమను పెంచుతూ, దానితోపాటు తామూ పెరుగుతూ, పారిశ్రామికవేత్తలుగా కూడా తెలుగు సినిమా రంగం మూడు పువ్వులూ ఆరు కాయలుగా విస్తరించడానికి తోడ్పడి, తెలుగు చిత్ర పరిశ్రమ కీర్తిప్రతిష్ఠలను మరింత పెంపొందింపజేశారు. రాసితోపాటు వాసికల్గిన చిత్రాలు ఆ రోజుల్లో తయారయ్యాయి. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు పలు సాంఘిక చిత్రాలలో తన నటనా ప్రాభవంచే అద్వితీయుడనిపించుకుని, ఇప్పటికీ నవయువకునిలా ముందంజ వేస్తూనే ఉన్నారు. శ్రీ ఎన్. టి. రామారావు సాంఘిక చిత్రాలలోనే కాక జానపద, ప్రత్యేకించి పౌరాణిక చిత్రాలలో శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, రావణబ్రహ్మ, దుర్యోధనుడు లాంటి విభిన్న విలక్షణమైన పాత్రలను అసమానచాతుర్యంతో పోషించి, తనకు తానే సాటి అనిపించుకున్నారు. అంతేకాక రాజకీయరంగంలోనూ ఓ చరిత్రను సృష్టించారు. పార్టీని నెలకొల్పిన తొమ్మిది నెలల్లోనే అత్యధికమైన మెజారిటీతో మన రాష్ట్రంలో చిరకాలంగా వేళ్ళూనిన కాంగ్రెస్ పార్టీని అధిగమించి, రాష్ట్ర నాయకత్వాన్ని చేపట్టారు. మరింకా ఎందరో దర్శక నిర్మాతలు, కళాకారులు, సాంకేతిక నిపుణులు తెలుగు చిత్రరంగాన్ని ఓ స్థాయికి తీసుకురావడానికి కారకులయ్యారు — స్థలాభావం వల్ల అందరి పేర్లూ పేర్కొనలేకపోతున్నాను.

ఇక మూడవ తరం: అభ్యుదయ భావాలతో యువతరానికి చెందిన పలువురు ప్రతిభావంతులైన దర్శకులు, నిర్మాతలు, కళాకారులు, తెలుగు చిత్రపరిశ్రమ యావద్భారత ఖ్యాతి నార్జించేలా హిందీ చిత్ర నిర్మాణరంగంలోనూ ప్రవేశించారు.

గణనీయమైన ఈ పురోగమనంతోపాటు ఉన్నత ప్రమాణాలతో తయారయ్యే తెలుగు చిత్రాలకు అవరోధంగా ఉన్న ఎన్నో క్లిష్ట సమస్యలను గురించి కూడా పరిశీలించక తప్పదు.

దురదృష్టవశాత్తు లోగడ అత్యున్నతమైన ప్రమాణాలు గల చిత్రాలతో ఒక ఒరవడిని సృష్టించి ఒక క్రమపద్ధతికి, ఒక స్థాయికి చెందిన సిసలైన నిర్మాతల పరిస్థితే నేడు అస్తవ్యస్తంగా— ఆందోళనకరంగా ఉంది: ఇందుకు ముఖ్యకారణం నేడు కొందరిలో కళాతృష్ణ తగ్గి వ్యాపార ధోరణులు ఎక్కువగా ఉండడమే. సినిమా పరిశ్రమ గురించి ఏ విధమైన అవగాహన లేని కొందరు కేవలం మోజుతో ఈ రంగంలో ప్రవేశించడం వల్ల అనారోగ్యకరమైన వాతావరణం ఏర్పడింది. చిత్ర నిర్మాణంలో వేగం పెరిగింది. త్వరితగతిన చిత్రాలను తయారు చేసి పోటీగా విడుదల చేసేంతటి అవాంఛనీయమైన పరిస్థితి నెలకొంది. ఒక చిత్రం సూపర్ హిట్ అయితే తప్ప — లాభాల మాట అటుంచి, పెట్టుబడి పెట్టిన సొమ్ము తిరిగి రాబట్టుకోవడమే దుర్లభమైపోతోంది. ఈ స్థితిలో జిల్లాలవారీ కొనుగోలుదార్ల మూలంగా నిర్మాతలకు ఒకింత మేలు జరుగుతున్నా ప్రజాదారణకు నోచుకోలేని చిత్రాల మూలంగా క్రమక్రమంగా

# సిగ్గు చేటు

– యు. విశ్వేశ్వరరావు



మనిషికి కనీస అవసరాలైన తిండి, బట్ట, కొంప – ఈ మూడింటి తర్వాత నిత్యావసరంగా నేటికీ నాలుగో స్థానాన్ని ఆక్రమించినటువంటి మరొక నిత్యావసరమైనది ఈ సినిమా. ఇరువైపులా పదును గల ఖడ్గం లాంటిది ఈ సాధనం. జాతిని బాగు చేయడానికీ ఉపయోగపడుతుంది; నాశనం చేయడానికీ ఉపయోగపడుతుంది. ప్రస్తుత పరిస్థితుల్లో జాతిని సర్వనాశనం చేయడానికే ఈ సాధనం ఉపయోగపడుతోందని నిస్సంకోచంగా చెప్పగల్గుతున్నాను.

ఈ సాధనం జాతిని నాశనం చేస్తుందని తెలిసీ కూడా ఏమీ పట్టించుకోనట్లు చూస్తూ ఊరుకోవడం అటు కేంద్ర ప్రభుత్వానికి, ఇటు రాష్ట్ర ప్రభుత్వానికి అలవాటైపోయింది. ఎందుచేతనంటే – వారి పరిపాలనా విధానం కూడా జాతిని సర్వనాశనం చేయడానికే ఉపయోగపడుతోంది కాబట్టి ఇటువంటి శక్తివంతమైన సాధనాన్ని ప్రభుత్వాలు కట్టుబాట్లలో పెట్టలేకపోవడం, దీనికి సంబంధించిన వ్యాపార సంస్థలు కేవలం డబ్బు చేసుకోవడమే ప్రధాన లక్ష్యంగా వ్యవహరించడం మన జాతికే సిగ్గు చేటు.

ఏ వ్యాపారమైనా కొన్ని సాంప్రదాయాలకు కట్టుబడి ఉన్నప్పుడే సమాజం దాన్నిబట్టి మంచి ఫలితాన్ని పొందగల్గుతుంది. జాతి పురోభివృద్ధికే కాకుండా దేశ పురోభివృద్ధికి కూడా చిత్ర పరిశ్రమ ఎంతో దోహదం చేస్తుందని నా నమ్మకం.

వివిధ భాషలతో, వివిధ సంస్కృతులతో, విభిన్న ఆచారాలతో భిన్నత్వంలో ఏకత్వంగా జీవన విధానాన్ని జరుపుకుంటున్న మన దేశ ప్రజల జాతీయ సమైక్యతకు ఈ పరిశ్రమ – ఈ సాధనం తప్ప మరొక శక్తివంతమైన సాధనం లేదు. జాతీయ సమైక్యతకే కాకుండా అంతర్జాతీయ సమైక్యతకూ, దేశ విదేశ ఆచార వ్యవహారాలను, సంస్కృతిని తెలుసుకోడానికి కూడా ఈ సాధనమే. శక్తివంతమైనది.

ప్రస్తుతం ఉన్న పరిస్థితుల్లో సప్త వ్యసనాల (వ్యభిచారము, జూదము, మధుపానము, వేట, వాక్పారుష్యము, తగిన వెచ్చము, కరిన దండము)తో బాటు సినిమా తీయడం అష్టమ వ్యసనంగా పరిగణింపబడుతోంది.

ఇది సాంస్కృతిక పరమైన వ్యాపారం కాబట్టి విజ్ఞానం, సంస్కారం ఉన్న వ్యక్తుల చేతుల్లో ఉన్నప్పుడే శక్తివంతమైన ఈ సాధనం సమాజాన్ని ముందుకు నడపగల్గుతుందని, సమాజాన్ని అనారోగ్య పద్ధతులనుంచి బయటవేసి, ఆరోగ్య పద్ధతుల్లో నవ సమాజ నిర్మాణానికి తోడ్పడుతుందని నా అభిప్రాయం.

పంచదార, టెక్స్‌టైల్స్, ఉక్కువంటి భారీ పరిశ్రమల జాబితాలో ఈ సినిమా పరిశ్రమను కూడా చేర్చాలి. దీనికి నేషనలైజ్డ్ బాంక్‌ల ద్వారా (ఇన్‌స్టిట్యూషనల్) ఫైనాన్సింగ్ జరగాలి. లైసెన్సింగ్ విధానం రావాలి. లైసెన్స్ ఇచ్చేముందు చిత్ర నిర్మాణానికి పూనుకునే వ్యక్తికి ఈ రంగంలో ఉన్న అనుభవాలనుబట్టి లైసెన్సింగ్ సిస్టమ్‌లో గ్రేడ్స్ నిర్ణయించాలి. గ్రేడ్స్ పద్ధతిలోనే లైసెన్స్‌లు ఇవ్వాలి.

చిత్ర పరిశ్రమ సాంస్కృతిక పరమైన వాణిజ్యం కాబట్టి చిత్ర నిర్మాణం జరుగుతున్న ఏ దశలోనూ, కొనుగోలు జరుగుతున్న ఏ దశలోనూ, ప్రదర్శన జరుగుతున్న ఏ దశలోనూ 'బ్లాక్ మనీ' (నల్లధనం) జాడ్యాన్ని మనం నివారించుకోగలిగినప్పుడే ఈ చిత్ర పరిశ్రమ సక్రమ పద్ధతుల్లో ముందంజ వేస్తుందని నా అభిప్రాయం. ★

ఆ కొనుగోలుదార్లు కూడా దెబ్బతినడం జరుగుతూన్నట్లు తెలుస్తోంది. ఒక వంక ఎందరో ఔత్సాహిక యువకళాకారులు, సాంకేతిక నిపుణులు ప్రవేశించి నవ్యపంథాలో చిత్రాలు తీస్తూనే ఉన్నా రాసి పెరగడంతో వాసి తరిగి మరో వంక ఆశించినంత రాబడికి నోచుకోక పోవడం దురదృష్టకరమైన విషయం. 1983 లో 134 తెలుగు చిత్రాలు తయారైతే, వాటిల్లో 8 చిత్రాలే లాభదాయకమైనవి 15 నుంచి 20 చిత్రాలు పెట్టుబడి సొమ్మును కొంతవరకు రాబట్టుకో గలిగాయి. మిగతా వంద పైచిలుకు చిత్రాలకు లక్షనుంచి కొన్ని లక్షలవరకు నష్టం వాటిల్లింది. ఇది ఆరోగ్యకరమైన ప్రగతి కాదని అందరికీ తెలుసు. ఈ నష్టాలను నివారించడానికి చిత్రనిర్మాణ రంగం తదితర అనుబంధ రంగాలను ఇదివరకటిలా సక్రమమైన రీతిలో వ్యవస్థీకరించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఇందుకు ఒక మార్గం నిర్మాణవ్యయం తగ్గించి చిత్రాలు నిర్మించడానికి తగిన మార్గాలు అన్వేషించాలి. అప్పుడు చిత్రం ఓ మోస్తరుగా ఆడినా పెట్టుబడికి ఢోకా ఉండదు. ఐతే, వేగంతో చిత్రనిర్మాణం జరిగి పోటీలుపడి విడుదలవుతున్న ఈ తరుణంలో ఇది ఎంతవరకు సాధ్యం ?

ఇక పంపిణీరంగం : 30–40 ఏళ్ళుగా పంపిణీరంగంలో ఉన్నవారికి కూడా ఎన్నో సమస్యలు ఉత్పన్నమయ్యాయి. జిల్లాలవారీ అమ్మకాల వల్ల నిర్మాతలకు కొంత మేలు జరిగినా తదనుగుణంగా పంపిణీ విధానంలో మార్పు వచ్చినందున అస్తవ్యస్తమైన పరిస్థితి ఏర్పడింది. జిల్లాల విక్రయం జరగకపోతే ఇదివరకు నిర్మాతలు పంపిణీదారులు, ప్రదర్శనదారులు కలిసి పొందే రిస్క్ ఇప్పుడంతా నిర్మాతమీద పడ్డట్లే. ఇక జిల్లాల వారీగా చిత్రాలుకొంటే, కొనే పంపిణీదారులకు రిస్క్ ఎక్కువైంది. నిర్మాతలు, పంపిణీదారులు, ప్రదర్శనదారులు తమ పెట్టుబడికి అనుగుణమైన నిష్పత్తి పద్ధతిలోనే జయాపజయాలను పంచుకునే ఇదివరకటి సనాతమైన సక్రమమైన సత్సాంప్రదాయం మళ్ళీ ఆచరణలోకి వస్తేగాని చిత్రపరిశ్రమ మనుగడ సాధ్యంకాదు. ప్రస్తుత పరిస్థితిలో ఈ పునర్వ్యవస్థీకరణ ఎంతవరకు వీలవుతుంది ?

తెలుగు సినీపరిశ్రమతో వివిధ శాఖలకు చెందిన వారందరూ ఆలోచించి, సముచిత నిర్ణయాలు తీసుకుని తాత్కాలిక ప్రయోజనాన్ని ఆశించి స్పెక్యులేషన్‌లా కాకుండా, చలనచిత్ర పరిశ్రమను ఒక వాణిజ్యరంగంగా భావించి కూలిపోయిన పునాదులను పునరుద్ధరించి, తెలుగుచిత్ర పరిశ్రమను ఇదివరకటి ఉన్నతమైన స్థాయికి తీసుకొని వచ్చేందుకు వారందరికీ అవకాశాన్ని, శక్తిని ప్రసాదించాలని మూడు దశాబ్దాలుగా ఈ పరిశ్రమతో సన్నిహిత సంబంధమున్నవ్యక్తిగా ఈ తరుణంలో భగవంతుని ప్రార్థిస్తున్నాను.

సత్సాంప్రదాయాలకు ప్రసిద్ధి పొందిన "ఆంధ్రపత్రిక"ద్వారా చలనచిత్ర పరిశ్రమలో ఉన్నవారికీ, ఆరుకోట్ల తెలుగు మహాజనులకూ నా "ఉగాది" శుభాకాంక్షలు ఈ సందర్భంలో అందజేస్తున్నాను. ★



# నటిగా నా గమ్యాన్ని... చేరుకోలేదు

షావుకారు జానకిది బ్రిటిష్ పంక్చుయాలిటీ అంచేత ఆమె చెప్పిన టయిమ్‌కే ఆమె భవంతికి చేరుకున్నా.

"కరెక్ట్ టయిమ్‌కు వచ్చారే!" అన్నారామె సహజ మందహాసంతో.

"మా ఇంటి పేరు గడియారం," అన్నాను.

అసలు ఆమె భవంతికి ఆ పేరు ఉండాలి. ఎంచేతంటే, ప్రతి గదిలోనూ ఓ గడియారం చొప్పున ఉంది. వంట గదిలో కూడా గరిటె రూపంలో ఓ గడియారం ఉంది!

నేత్రపర్వమొనర్చే రకరకాల అలంకరణలతో అత్యాధునికమైన వసతులు గల ఆ భవనం ఆమె ఉత్సాహాభిరుచులకు నిదర్శనం. ఆ భవనంలో ఆగంతకులను ఆప్యాయంగా పలకరించే ఆమె సదా మందహాసం ఆమె సహృదయానికి చిహ్నం.

ఆ మందహాసం వెనుక జీవితంలో ఎన్నో ఒక్కామక్కీలుతిన్న అనుభవసారం కన్పిస్తుంది. ఆ విషయం ఆమెతో చెప్పకుండా ఉండలేక పోయాను.

"నిజమేనండి... చిన్న వయసులోనే నా కాళ్ల మీద నేనే నిలువవలసిన పరిస్థితి ఏర్పడింది. 15వ ఏట పెళ్లయింది. 18వ ఏట పిల్లల తల్లినయ్యాను. పిల్లలను పెంచి పెద్ద చేసే బాధ్యత కూడా నామీదే పడింది. నాకు ఉద్యోగం చేయడానికి తగు విద్య గాని, ఏదైనా వృత్తి చేపట్టడానికి తగిన ట్రెయినింగ్ గాని లేదు. రేడియో నాటకాలలో నటించి, డైలాగ్ డెలివరీలో పొందిన అనుభవం నేను సినిమానటి అవడానికి తోడ్పడింది. నిజానికి నాది అందమైన ముఖంకాదు. నా చిరునవ్వులో ఏదైనా ఆకర్షణ ఉందేమో నాకు తెలీదు. నటనలో అనుభవం వల్ల పొందిన టేలెన్ట్సే నేను మూడు దశాబ్దాలకు పైగా ఈ సినిమా రంగంలో ఉండడానికి తోడ్పడ్డాయనుకుంటా. కుటుంబ భారాన్ని మోయడానికి చేపట్టిన ఈ వృత్తిలో ఖ్యాతి, సంపద కూడా లభిస్తాయని నా తొలి చిత్రం 'షావుకారు' లో నటిస్తున్నప్పుడు నేనెరుగను సుమండీ!" అన్నారామె.

ఆమెలో దాపరికాలు లేవు. నిజాన్ని నిర్భయంగా చెప్పడంలో ఆమె తర్వాతే ఎవరైనా. "మీరు నడివయస్సులో ప్రవేశించారనుకుంటా?" అని నేనంటే, "కరెక్ట్‌గా నా వయసు 52 ... ఒక్కోసారి కాలచక్రం గిర్రున తిరుగుతూందేమో అనిపిస్తుంటుంది కదండీ?" అన్నారామె.

ఆమె హీరోయిన్‌గా వేస్తున్నప్పటి ఫాన్‌లకు, ఇప్పుడు కేరెక్టర్ రోల్స్ వేస్తున్నప్పటి ఆమె ఫాన్‌లకు ఏదైనా తేడా ఉందేమో తెలుసుకోవాలనిపించింది నాకు.

"నిజానికి ఆ తరం వారి కన్నా ఈ తరం వారిలోనే నాకు ఎక్కువమంది ఫాన్స్ ఉన్నారు. ఇటు మన రాష్ట్రంలో గాని, అటు తమిళనాడులో గాని నేను నాయికగా నటించిన నా పాత చిత్రాలను చూసి ఎంతోమంది యువతీ యువకులు ఉత్తరాలు రాస్తున్నారు; ఎదురు పడితే స్వయంగా చెప్తున్నారుకూడా. వాస్తవానికి ఆనాటి చిత్రాలు అంత చక్కగానూ ఉండేవి కదా? నేను నాయికగా నటించిన 'ఇరుకోడుగళ్' తమిళ చిత్రంలో నా నటనకు పన్నెండు అవార్డులు వచ్చాయి."

ఆనాడు నాయిక పాత్రలు ధరిస్తున్నప్పుడు నటిగా ఆమెకు ఎక్కువ తృప్తా, ఈనాడు కేరెక్టర్ రోల్స్ వేస్తున్నప్పుడు ఎక్కువ తృప్తా?

ఏ మాటకా మాట చెప్పడం ఆమె ప్రత్యేకత: "ముమ్మాటికీ ఈనాడు కేరెక్టర్ రోల్స్ వేస్తున్నప్పుడే నాకు ఎంతో తృప్తి. డ్యుయెట్లలో చెట్ల చుట్టూ పరుగెత్తే పరిమితమైన ఒకేమూసలో తయారైనట్లుండే రొటీన్ రోల్స్ కన్నా నవరసాలొలికించడానికి అవకాశమిచ్చే నాయిక పాత్ర నాలుగు సీన్‌లదైనా అభిలషించేదాన్ని. టాలెంట్స్ చూపించడానికి తగినపాత్ర లభించినప్పుడే కదా ఏ నటీ నటులకైనా తృప్తి? ఆనాడు నా అభిలాష నెరవేరలేదు. వెరైటీ అంటూ ఉంటే కేరెక్టర్ రోల్స్‌లోనే. అడపా దడపా నేనిప్పుడు వేస్తున్న కేరెక్టర్ రోల్స్ విభిన్నమైనవే. అలాంటి రోల్స్‌కు అనువైన గాంభీర్యత నాలో ఉందనేమో—వాటిలో వెరైటీ గల వాటికి నేనే సూట్ అవుతానని అనుకుంటూంటారు. ఇటీవల 'కొడెత్రాచు' చిత్రంలో లైట్ కామెడితో పాటు సెంటిమెంట్ గల ఓ విలక్షణమైన పాత్రను పోషించాను."

ఇంతకీ, హీరోయిన్ నుంచి కేరెక్టర్ ఆర్టిస్ట్‌గా ఆమె ఎప్పుడు మారినట్లు?

కెమెరా ముందు ఎంత సునాయాసంగా నటిస్తారో అంత సునాయాసంగానే జవాబిచ్చారామె: "ఎవరి ప్రోద్బలం, ప్రోత్సాహం లేకుండా నన్ను నేనే కేరెక్టర్ ఆర్టిస్ట్‌గా మలచుకున్నాను. 'మమత' హిందీ చిత్రాన్ని నేనే తమిళంలో 'కావ్య తలైవి' గా నిర్మించాను. అందులో నాయిక పాత్రతో పాటు క్లిష్టమైన నాయిక తల్లి పాత్రను కూడా నేనే పోషించాను. అలా ఆ రోజుల్లోనే నేను వయసు మీరిన పాత్రను ధరించానన్నమాట... ఎక్స్‌క్యూస్‌మీ," అంటూ ఆమె కుక్కింగ్ రేంజ్ దగ్గరికి వెళ్లారు కాఫీ తయారు చేయడానికి.

ఆమె స్వయంగా ఎందుకీ శ్రమ తీసుకోవడం—అనిపించింది నాకు. ఆ మాటే చెప్పాను.

"ఇందులో శ్రమ ఏముందండీ? మా ఇంట్లో పనిమనుషులు ముగ్గురు నలుగురున్నా—అన్ని పనులూ నేనే చేయడంలోనే నాకు అదో ఆనందం. ఉదయం ఆరుకే లేస్తాను— కాస్సేపు తోట పని ... బ్రేక్‌ఫాస్ట్‌ను నాతోపాటు పని వాళ్లందరికీ నేనే తయారు చేస్తాను. ఇంతవరకు మా ఇంట్లో వంటమనిషిని ఏర్పాటు చేసుకోలేదు సుమండీ! వంటపని నాకో విధమైన రిలాక్సేషన్."

రిలాక్సేషనే కాక ఆమె ఇప్పటికీ అంత చురుకుగా ఉండడానికి అలా శ్రమ పడడం కూడా ఓ కారణమై ఉండాలి— అనిపిస్తుందెవరికైనా.

ఇకపోతే, నటిగా ఆమెకేదైనా లోటు?

"తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషల్లో అనర్గళంగా మాట్లాడగలను గనుక ఆ భాషల్లో తయారైన చిత్రాల్లో నటించాను— మలయాళ చిత్రాల్లో తప్ప. అదొక లోటు అనుకోను. లోగడ చక్కని చిత్రాల్లో ప్రతిభావంతంగా నటించి విశేషంగా ప్రజాదరాభిమానాలు చూరగొన్న మా తరానికి చెందిన కొందరు నటీనటులను అప్రోచ్ చేయడానికి ఈనాటి దర్శక నిర్మాతలు ఎందుకు తటపటాయిస్తారో నాకెంతకీ అర్థంకాదు. మొత్తంమీద నామటుకు నాకు ఈ నాటికీ ప్రజలలో నా స్థానాన్ని గౌరవప్రదంగా నిలబెట్టుకోగలిగానన్న సంతృప్తి మాత్రం మిగిలింది. నాకంతే చాలు."

ఇప్పటి హీరోయిన్‌లలో ఆమెను ఆకర్షించిన వారెవరో? ఈ ప్రశ్న కొందర్ని ఇబ్బంది పెడుతుంది. "కొందరి తారల పేర్లు పేర్కొంటే, మిగతా వాళ్ల మనస్సుకు కష్టం కలుగుతుందేమో!" అంటూ దాటేస్తారు. కాని, జానకి అలాకాదు అందుకే రక్కున జవాబిచ్చారు: "శ్రీదేవి .. చక్కదనంతోపాటు చక్కని టేలెంట్స్ ఉన్న ఆర్టిస్టు. జయసుధ, జయప్రదలు కూడా ఒకరిని మించిన ఒకరు ఎక్స్‌ట్రార్డినరీగా నటిస్తున్నారు."

మాటల మధ్యలో ఆమె తొలి చిత్రం "షావుకారు" హీరో ఎన్.టి. రామారావుగారి ప్రస్తావన వచ్చింది.

"రాష్ట్రనాయకత్వాన్ని చేపట్టినప్పట్నుంచీ ఆయన ధైర్యంగా ఎన్నో సంస్కరణలను అమలు పరిచారు. ముఖ్యంగా స్త్రీలకు ఆస్తిలో సమాన హక్కు ఉండాలన్న ఆయన వాదనకు నేనెంతైనా అభినందిస్తాను. స్త్రీకి ఆర్థిక సమానత్వం లేకపోవడం చాలా పెద్ద లోటు. స్త్రీ పురుషుని లాగే జీవించగల్గాలి గాని, తన స్త్రీత్వాన్ని మాత్రం మరచిపోకూడదు," అన్నారామె.

స్త్రీ అబల కాదు; సబల అని నిరూపించిన నటీమణి షావుకారు జానకి. 

జి. వి. జి.

# పరీక్షల సమయమా ?
# కష్టపడి చదివే
# సమయం...



## పూర్తిగా ఆరోగ్యంగా
## ఉండాల్సిన సమయం,
## కాంప్లాన్®
## తీసుకోవలసిన
## సమయం.

## కేవలం కాంప్లాన్‌లోనే అతనికి అవసరమయ్యే అధిక పోషణనిచ్చే
## 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.

పిల్లలూ బాగా ఆరోగ్యంగా ఉండటం అవసరం, అది మరి వాళ్ళు పరీక్షలకి చదువుతూన్నప్పుడు మరీ అవసరం. అందుకే మరి తల్లులకు తెలుసు పరీక్షల సమయం అంటే కాంప్లాన్ తీసుకోవలసిన సమయం అని

ప్రోటీన్లు, హుటాహుటీగా పెరుగుదలకు తోడుపడే పోషక పదార్థాలు కాంప్లాన్‌లో ప్రోటీన్లు (20%) ఉండటమే కాకుండా పిల్లలకోసం అత్యుత్తమమైన ప్రోటీన్లు (పాల ప్రోటీన్లు) ఉన్నాయి దాంతోబాటే, పిల్లల అధిక పోషణకు అవసరమయ్యే 22 యితర కీలక ఆహార పదార్థాలు, అంటే కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలూ అటువంటివి ఉన్నాయి.

మీ పిల్లలకి యివ్వడం మొదలెట్టండి కాంప్లాన్—రోజుకు రెండుసార్లు ప్రతిరోజూ. గుర్తుంచుకోండి, కాంప్లాన్, డాక్టర్లు ఎక్కువగా సిఫార్సుచేసే ఆరోగ్యబద్ధమైన ఆహారం.

కాంప్లాన్ రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ-కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదా)గా కూడా దీని రుచి అంటే మరి పిల్లలకెంతో ఇష్టం!









## కాంప్లాన్® – సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం

# కృష్ణ - వ్యక్తి... శక్తి



"నేను హైదరాబాద్‌కు మకాం మార్చడానికి ఎటూ ఇంకో రెండేళ్ళయినా పడుతుంది."

"ఛత్రపతి శివాజీ — పూర్తి స్క్రిప్టు ఎప్పుడు రెడీ అయితే, అప్పుడే నాలోని దర్శకుడూ రెడీ!" పై విషయాలను ఇటీవల పద్మాలయా కార్యాలయంలో కలిసినప్పుడు తెలియజేశారు కృష్ణ.

కృష్ణ కాని పని పూనరు; పూనిన పని మానరు.

అందుకే ఆయన్ని "డాషింగ్ హీరో, డేరింగ్ హీరో, సాహసానికి మరో పేరు, సంచలన చక్రవర్తి" అన్నారు. కాని, ఈ సాహసి అనే బిరుదు వెనుక ఆయనలోని ఇతర సద్గుణాలెన్నో కప్పబడిపోయాయి. వాటిని ఎవరూ పేర్కొనరు ఎంచేతో! ఈ వ్యాసానికి ప్రేరణ అదే.

ఆయన 'సూపర్ స్టార్' అవడానికి ఆయనలోని ఆ సద్గుణాలన్నీకూడా ఎంతో తోడ్పడ్డాయి.

ఒక్కో హీరో తాను ధరించే పాత్రలకు ఒక్కో రకమైన వ్యక్తిత్వాన్ని చేకూర్చడం సహజం. ఆ వ్యక్తిత్వాన్ని ఆ నటుడు తన నటనా ప్రాభవంచేత సృష్టించాడా, లేక అతనికది సహజసిద్ధమైనదేనా—అన్న సమస్య ఏ ప్రేక్షకుడ్నీ బాధించదు. ప్రేక్షకుడు పాత్రలో చూసే వ్యక్తిత్వం సహజంగా తోచాలి. అంతే.

ప్రసిద్ధ హాలీవుడ్ నిర్మాత ఫ్రాంక్ కాప్రా ఉద్దేశ్యంలో "నటన ద్వారా తెచ్చే వ్యక్తిత్వంకన్నా నటీనటులలో సహజంగా ఉండే వ్యక్తిత్వమే చలన చిత్రాలకు ఉపకరిస్తుంది." ఇది కృష్ణ విషయంలో అక్షరాలా నిజమేనేమో ననిపిస్తుంది.

చాలామంది దర్శకులుగాని, నిర్మాతలుగాని కళాకారులలో తాము చూడగల్గిన శక్తులనే విశ్వసిస్తారుగాని, వారిలో గుప్తంగా ఉన్న ప్రతిభా విశేషాలను అంచనా కట్టగలవారు బహు అరుదు. అలాంటివారు తటస్థపడేవరకు ఏ ఆర్టిస్టుకూ తగిన అవకాశం రాదు.

స్వర్గీయ ఆదుర్తి సుబ్బారావు తొలిపలుకు రాసిన కృష్ణ నటజీవితం ఒక తెరిచిన పుస్తకం. అది పాఠకులను ఆద్యంతం మనోనేత్రాలతో చదివింపజేస్తుంది.

అవిరళ కృషి, ప్రతిభ, అదృష్టం కొద్ది మందికే లభిస్తాయి. కాలక్రమేణా అనుభవం మీద పెంపొందించుకోగల్గినా — నటన అనేది దైవదత్తమైన కళ. శిఖరాగ్రాన్ని చేరుకోవాలనే లక్ష్యంతోనే కృష్ణ నిలకడగా, గుట్టుగా, మనోస్థైర్యంతో, పట్టుదలతో ఆదినుంచీ కృషి చేశారు; శిఖరాగ్రాన్ని చేరుకున్నారు. అజేయుడై, అనన్య ప్రతిభావంతుడుగా వినుతి కెక్కినా — అడుగడుగునా తన సౌశీల్యానికి, గాంభీర్యానికి, సంస్కారానికి, నడతకు మెరుగులు దిద్దుకుంటూనే వచ్చారు. సహనం, పవిత్రత, నిండుతనం, నైర్మల్యం ఆయనలో చక్కగా పతిఫలించడమే ఆయన ఘనవిజయానికి కారణం.

నిర్హేతుకంగా, అక్రమంగా, పక్షపాతంతో, దురభిమానంతో వచ్చిన విమర్శలను, ఖండనలను సైతం స్వీకరించి, తనలో లోపాలేవైనా ఉంటే సరిదిద్దుకోవడం ఆదిలోనే అలవరచుకున్నారు కృష్ణ. ప్రతికూల విమర్శలే ప్రశంసలిచ్చే పోత్సాహంకన్నా రెట్టింపు శక్తి చైతన్యాలిస్తాయనీ, నటజీవితంలో ముందుకు సాగిపోవడానికి అవే ముఖ్యమనీ కృష్ణ విశ్వాసం. ఇటువంటి కువిమర్శలకు వ్యక్తిగా నొచ్చుకున్నా — నొచ్చుకోకపోయినా నటుడుగా మాత్రం నిగ్రహించుకోవాలని ఆయన మతం. ఇలా తన కట్టుబాట్లను తానే నిర్ణయించుకున్నారు. అందువల్లనే ఆయన ఏనాడూ భంగపడవలసిన పరిస్థితి రాలేదు.

"కృష్ణ ఏమిటి, అల్లూరి సీతారామరాజు పాత్ర ధరించడమేమిటి ?" ఇలా ప్రేక్షకులూ, అభిమానేతరులూ చెలరేగించిన పెద్ద దుమారం ఆ తర్వాత ఎంత గొప్ప సంచలనం కలిగించిందో అందరికీ తెలుసు. 'నభూతో నభవిష్యతి' అంటూ ఆ చిత్రాన్ని చూసినవారంతా కృష్ణకు బ్రహ్మరథం పట్టారు. ఒకవేళ ఆ పాత్ర పోషణలో ఏమాత్రం వెలితి కనబడినా ఏమై ఉండేది ?

మనోనిబ్బరం, పట్టుదల గలవారే అలాంటి పరీక్షలలో నెగ్గి, నిగ్గుదేల తారు.

బాల్యంనుంచీ సమిష్టి కుటుంబంలో, పెద్దల కట్టుబాట్లలో, సనాతన భారతీయ సాంప్రదాయాలలో పెరిగిన వ్యక్తి గనుకే కృష్ణలో కృత్రిమత్వం, చొరవా, యుక్తీ, గడుసుదనం వంచనాశక్తి ఏ కోశానా కానరావు. తెరమీద ఆయన్ని చూడగానే ఒక సరళ హృదయుడూ, ఉదారస్వభావుడూ, పట్టుదలగల సాహసే కనిపిస్తారు. ఇది ఆయన వాస్తవ స్వరూపం. ధరించే పాత్రలలో ఎక్కువగా ఆయన వ్యక్తిత్వాన్నే ప్రతిబింబింప చేస్తారు. ప్రేక్షకులను ఉత్తేజితులను చేయగల శక్తి చైతన్యాలకు జన్మస్థానం ఆయన హృదయమే అనడంలో ఎలాంటి సందేహమూ లేదు. అందుకే ఆయన వెండితెరమీద కలకాలం కళకళలాడుతూ కనిపించాలని కోరుకుంటాడు ప్రతి ప్రేక్షకుడూ.

మనస్సును సదా శుచిగా, నిర్మలంగా, ప్రశాంతంగా ఉంచుకుంటారు కృష్ణ. వైవిధ్యం గల పాత్రలు ఒకేరోజు మూడు చిత్రాలకు మూడు సెట్‌లలో నటించవలసి వచ్చినా — ఏ పాత్రకు ఆ పాత్ర మరొకదానితో ఢీకొని రసాభాస కల్గించకుండా పోషించగల నేర్పరితనం ఆయనకుంది. పాత్రల రూపకల్పనలో మునిగి తేలుతూన్న సమయాన సైతం — ఒక్కోసారి అంతరాంతరాలలో విద్యుద్వేగంలో ఆలోచనా పరంపరలు తీవ్రంగా పరిభ్రమిస్తూన్నా — పైకి నిండుగా, ప్రశాంతంగా, ప్రసన్నంగా ఉండగల రాయన. ఎందరి జీవితాలనో ధరిస్తూ, ఆ పాత్రల సమస్యలను, కష్టసుఖాలను ఆలోచిస్తూ, ఆ పాత్రల ఆశలను, ఆనందాలను, బాధలను భరించి, కన్నీరు కార్చి; జీవితం ఏదో, నటన ఏదో, కల ఏదో, నిజమేదో తెలియని స్థితిలో షూటింగ్ ముగిశాక ఇంటికి చేరుకున్నా— మామూలు కృష్ణ అయిపోయి, తాపీగా ఇంటి వ్యవహారాలు చూసుకునే మనోనిబ్బరం ఆయన కుంది. ఎప్పుడూ పరిసరాలు కళకళలాడుతూంటే ఆయనకదే బ్రహ్మానందం.

ఆయనలో ద్వేషాన్నిగాని, క్రోధాన్నిగాని ఎవరూ పసిగట్టలేరు. లేనిపోని రాజకీయాలతో ఆయనకు నిమిత్తంలేదు. ఎవ్వరినీ నొప్పింపక,

తానొవ్వక తప్పుకునే తత్త్వం. తనకు ఒకరిపట్ల మక్కువ, మరొకరిపట్ల విముఖత్వం ఉన్నట్లు కనిపించనివ్వరు. అందుకే విరోధులెవ్వరూ లేని అజాతశత్రువు కాగలిగారు.

నేడు కృష్ణ జీవితం వడ్డించిన విస్తరి ఆయనలోని ఎలాంటి ఆర్భాటాలూ లేని నిరాడంబరత్వం ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది. భేషజాలకు పోరు. మెప్పుకోసం హెచ్చులకు పోయే తత్త్వం కాదాయనది. కీర్తి ప్రతిష్ఠలూ, సిరిసంపదలూ ఆయనలో ఏ అతిశయమూ కల్గించకపోవడం విడ్డూరమే మరి. తానొక సినిమా హీరో అని గుర్తుచేసే వారిని ఆయన భరించలేరు. ఆయన కారును బట్టి తప్పితే — ఆ ఛాయల్లో ఆయన ఉన్నారని ఎవ్వరూ గ్రహించలేకపోయకుండా — తనేమిటో, తన పనేమిటో చూసుకోవడమే ఆయన మతం ప్రేక్షకుల హృదయాలలో, సినీ పారిశ్రామికుల దృష్టిలో తన స్థానం ఎంత ఉన్నతమైనదో తెలియనట్లే ఉంటారు కృష్ణ.

చిన్న నిర్మాతలు, పెద్ద నిర్మాతలు అనే తారతమ్యం ఆయనలో లవలేశమైనా లేదు. అందరినీ సమదృష్టితోనే చూస్తారు. చక్కని, చిక్కని పాత్రలను శక్తివంచన లేకుండా ఒప్పించడమే ఆయన ధ్యేయం. సెట్‌లో డైరెక్టర్ చెప్పిన ప్రతి విషయాన్నీ శ్రద్ధగా ఆలకిస్తారు. ఏదైనా సన్నివేశంలోగాని, దృశ్య చిత్రీకరణలోగాని లోటుపాట్లను ఎన్నగల సామర్థ్యం ఆయనలో లేకపోలేదు. కాని, తప్పనిసరి అయితే తప్ప — ఏ విషయంమీదా తన అభిప్రాయాన్ని వ్యక్తపరచరు. ఎవరితోనూ అనవసరంగా వాదనలకు దిగరు. ఎదుటివారి మాటకు, అభిప్రాయానికి గౌరవం ఇచ్చి ఆలోచించే స్వభావం ఆయనది. ముఖ్యంగా అభిమానుల అభిప్రాయాలకు ఎంతో విలువ ఇస్తారు. ఐతే, తన అభిప్రాయాలను మరింతగా గౌరవించుకోవడమే ఆయన ప్రత్యేకత.

ఇదివరకటి చిత్రాలలోని తన నటనను ప్రేక్షకుడు స్ఫురణకు తెచ్చుకోలేని రీతిలో ప్రాజ్ఞత, ప్రతిభా విశేషాలను వినియోగించి నటించగలరు గనుకే కృష్ణ తన మనుగడను సార్థకం చేసుకుంటున్నారు.

ఇన్నేళ్ళుగా ఎన్నో చిత్రాల్లో నటిస్తూ వచ్చినా — ఆయనలో చురుకుదనంగాని, ముఖంలో తేజస్సుగాని, కళ్ళల్లో కాంతిగాని, మూర్తిలో సౌకుమార్యంగాని ఏమాత్రం సన్నగిల్లలేదు. "ఈ ఆహార నియమాలూ, వ్యాయామాలూ మాకేగాని, కృష్ణ వీటికంతటికీ అతీతుడు, అది ఏ ఇంద్రజాలమో!" అని హీరో



కృష్ణంరాజు ఒకసారి నాతో అన్నారు.

నిజమే. కృష్ణమీద కాలం ఏ ప్రభావం చూపకపోవడమే ఆయనకు శ్రీరామరక్ష.

కృష్ణ జీవితం చరితార్థమైంది.

చలన చిత్ర జగతిలో సాధించగల విజయాలన్నిటినీ ఆయన సాధించారు.

అయినా, ఆయన జైత్రయాత్ర అనంతమైనది.

ఇంకా అనూహ్యమైనవి సాధించి, అసామాన్యమైన మహోన్నత పథాలందుకునేందుకు తగు వ్యవధి, తగిన ప్రతిభ ఆయనలో ఉన్నాయి.

— జి. వి. జి.

'ఉ గా ది' సందర్భంగా తెనుగు
నూతన సంవత్సర శుభాకాంక్షలు



# "ది కడప జిల్లా సహకార మార్కెటింగ్ సొసైటీ లిమిటెడ్"

రైల్వే స్టేషన్ రోడ్,
కడప - 516001 (ఆం.ప్ర.)



ఆంధ్రప్రదేశ్ నిత్యావసర వస్తువుల సంస్థ మరియు ఆంధ్రప్రదేశ్ సివిల్ సప్లైస్ కార్పొరేషన్ కడపవారి స్టాకిస్టులుగా కడప, ప్రొద్దుటూరు, పులివెందుల స్టాక్ పాయింట్లలో 1982 మార్చినుండి 1984 ఫిబ్రవరి వరకు నిత్యావసర వస్తువులైన బియ్యము, గోధుమలు, నూకలు కలిసి 4 లక్షల క్వింటాల్స్, పామోలిన్ నూనె 50వేల కేజీలు అమ్ముట ద్వారా దాదాపు 9 కోట్ల రూపాయల టర్నోవర్ వ్యాపారం చేయుటద్వారా 9 లక్షల 15 వేల రూపాయలు కమీషన్ ఆర్జింపబడినదని, తద్వారా 15 మంది సిబ్బందికి, 50 మంది కూలీలకు ఉపాధి లభించినదని తెలుపుటకు మేము సంతోషిస్తున్నాము

కార్యవర్గ నిర్వాహకులు.

| | |
|---|---|
| శ్రీ జి. వీరశివారెడ్డి | అధ్యక్షులు |
| శ్రీ కె. చిన్న కొండారెడ్డి | ఉపాధ్యక్షులు |
| శ్రీ సి పెద్ద వెంకటరెడ్డి | కోశాధికారి |

డైరెక్టర్స్ :

శ్రీ ఐ తిరుపాలరెడ్డి, శ్రీ సి వి నాగిరెడ్డి, శ్రీ సి చంద్రశేఖరరెడ్డి, శ్రీ కె పెద్దతిరుమలకొండయ్య, శ్రీ ఏ ఎర్రన్న, శ్రీ జి. బాలవెంకటసుబ్బయ్య, శ్రీ యస్. పెద్ద పుల్లయ్య, శ్రీ సి రామయ్య, శ్రీ వై నాగయ్య

నామినేటెడ్ సభ్యులు

కడపజిల్లా సహకార శాఖాధికారి; జిల్లా వ్యవసాయశాఖ డిప్యూటీ డైరెక్టర్, జిల్లా సహకార కేంద్రబ్యాంక్ జనరల్ మేనేజరు

ఇట్లు
పి. నరసింహులు,
బిజినెస్ మేనేజర్,
ది కడప డిస్ట్రిక్ట్ కో-ఆపరేటివ్
మార్కెటింగ్ సొసైటి లిమిటెడ్,

ఆరోగ్యానికి రాచబాట
నెర్విటోల్®

బాలబాలికల పెరుగుదలకు
విద్యార్థుల వికాసానికి
వృద్ధుల ఆరోగ్యరక్షణకు
కార్మికుల కండపుష్టికి
సుఖసంసారమునకు
క్రీడాకారుల జవసత్వాలకు
లాయర్ల సమయస్ఫూర్తికి

SILVER JUBILEE
NERVITOL
1955-1980

NERVITOL
AN EFFICACIOUS TONIC

సోల్ డిస్ట్రిబ్యూటర్స్
మాన్ ఫార్మా ఏజన్సీస్
ఏలూరు రోడ్, విజయవాడ 520 002
P B NO 353

**M/s. Man Pharma Agencies**
ELURU ROAD, VIJAYAWADA-520 002
Phone · 75696

తెనుగు సంవత్సర సందర్భంగా
మా వినిమయదారులకు
ఉగాది శుభాకాంక్షలు



సులభవాయిదా పద్ధతులపై టి వి బ్లాక్ అండ్ వైట్ కలర్, టి వి యస్-50, లూనా, హీరో మెజస్టిక్-50, 165 లీటర్ల గాద్రెజ్ మరియు ఆల్విన్ కెల్వినేటర్ ఫ్రిడ్జులు లభించును

వివరములకు,

## శ్రీధర్ ఎంటర్ ప్రైజస్,

1/76, హెచ్. గాంధీనగర్, కడప 516004.
[ఆంధ్రప్రదేశ్]

# రక్తాక్షిలో మీతారాబలం-చంద్రబలం
# రాశిఫలం

-విద్వాన్
కోట సత్యరంగయ్యశాస్త్రి

## మేషం 

అశ్వని—భరణి—కృత్తిక 1పా. బు—బె—బో—ల—లు—లె—లో—అ—అను అక్షరాలు పేరునకు మొదటగలవారు ఈ రాశికి చెందినవారు.

మేషరాశి జాతకులు 'ఈ రక్తాక్షి'లో అందంగా, ఆనందంగా శుభావహంగా రోజులు గడుపనున్నారు. రాజపూజ్యావమానములు 4,5 భాగములుగా నుండును. ఆదాయం 16 పాళ్లు, వ్యయం 2పాళ్ళు. అంటే ఆదాయమే అధికం, గృహవాహన అప్రయత్న ధనలబ్ధి, నూతనోద్యోగ, నూతనవృత్తి వసతులకు అనుకూల వత్సరం. రాజకీయంగా పరిభ్రమించే వారికి అనుకూలం. వ్యాపారంలో చెప్పదగిన అనుకూల, ఆనంద దాయక, లాభప్రదాయక మార్పులున్నాయి. చాల మంది యింట శుభకార్యానుకూలతకు అవకాశ మున్నది. నూతనవృత్తి భాసించుట, గృహానందం, ఆరోగ్యాభివృద్ధి, వస్తు విక్రయలాభం, సిరి సంప దలయందు పెంపు, వ్యవహార విజయం యిత్యాది శుభసూచిక సన్నివేశాలు విరివిగా కనిపిస్తాయి. ఉన్నత విద్యాప్రమాణాలు పెంచుకోగలరు. డిశం బరు 31వరకు సప్తమ శని, స్వర్ణమూర్తి. అలాగే వత్సరాంతము వరకు అష్టమమున సువర్ణ మూర్తి. క్షేమకరుడు. బృహస్పతి కూడా వత్సర మంతయు అపకారికాడు. రాహుకేతువులుమాత్రం ఉపకారులుగారు, అందుచేత శుభాశుభ మిశ్రమ ఫలదాయక వత్సరం. స్త్రీలకు శుభకార్యాను కూలత, ఆదాయం, వృత్తియందు వృద్ధి, నూత నాంశ సంగ్రహణం చెప్పదగిన అంశాలు.

## వృషభం 

కృత్తిక 2,3,4. రోహిణి, మృగశిర 1,2 పాIIలు. ఇ—ఉ—ఎ—ఒ—వ,వీ,వు,వె,వో. అను అక్ష రాలు పేరుకు మొదట కలిగినవారు ఈ రాశికి సంబంధించినవారు.

ఈ రాశికి చెందినవారు వత్సరంలో శుభా శుభ మిశ్ర ఫలాలు అందుకోనున్నారు. రాజ పూజ్యావమానాలు 7, 5 పాళ్లు. ఆదాయ వ్యయాలు 14.2.పాళ్లుకొందరకు నూతన గృహ నిర్మాణమో.క్రొత్తయింటికిపోవుటో, ఉన్న వాహ నాన్ని అమ్ముకొనుటో, వ్యర్థ ప్రయాణాలలో కాలం వ్యయించటం, అనవసరమైన గొడవలో తలదూర్చి బాధపడటం, చివరకు పశ్చాత్తాప పడుట, చేతచిక్కిన అవకాశాలు పోగొట్టుకొనుట యిత్యాది ఫలితాలు అనుభవనీయం కొన్ని రంగా లలో అంటే, రాజకీయ, విద్యా వ్యాపార రంగాలలో శుభదాయక వత్సరం. షష్ఠ శని, కొంతకాలం అష్టమ రాశిలో సంచరించును. బృహస్పతి, రాహు కేతు గ్రహాలు కూడా అనుకూల ఫల ప్రదాతలు. స్త్రీలకు; ఉద్యోగమందు అభివృద్ధి. నగల సేకరణకు అవకాశం. చేతిలో డబ్బు సదా మెదలుచుండుట గమనింపదగిన ముఖ్యాంశాలు.

## మిధునం 

మృగశిర 4, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాIIలు. కా—కీ—కూ—ఖం, జ, ఝ, కె, కో, హ, అను అక్షరాలు తమ నామానికి మొదట గలవారు ఈ రాశికి చెందినవారు.

ఆదాయవ్యయాలు 11, 8 పాళ్లు, రాజ పూజ్యావమానాలు 3, 1గా గ్రహించాలి. వత్సరమంతయు విజయప్రదం. ఉన్నత విద్యా ప్రమాణమందు అభివృద్ధి గలదు. గృహమో, భూమియో, నగలో, వాహనమో కొనుగోలు చేయగలరు. సాహస కార్యాలలో, సభారంగాన, రాజకీయ మార్గాన, కళా సాహితీ రంగాలలో అభివృద్ధి కనిపించును. శుభ కార్యానుకూలతకు నిరాఘాటంగా అనుకూలతగలదు. పెద్దలవలన సుకరంగా కొన్ని వ్యవహారాలు విజయమంత మగును. 'శని, బృహస్పతుల' స్థానములు, మూర్తులు మంచివి కావటంతో, అన్ని విధాలా శుభ పర్యవసానమే కనిపిస్తుంది. స్త్రీలకు : ఉద్యోగ యత్నాలు ఫలితానికి రావటమో, గృహ వసతి యేర్పడటమో, విలువగల వస్తు సేకరణకు అవకాశమో, కళారంగాన వికాసమో కనిపించుట గమనించగలరు. మొత్తానికి అన్ని విధాలా ఆనందదాయకం ఈ 'రక్తాక్షి' వర్షం.

## కర్కాటకం 

పునర్వసు4, పా. పుష్యమి, ఆశ్లేష 1, 3 పాIIలు. హి, హు, హె, హో, డ, డి, డు, డొ అను అక్షరాలకు సంబంధించినవారు ఈ రాశివారు.

ఆదాయం 5, వ్యయం 8 పాళ్లు. రాజ్య పూజ్యావమానాలు 6, 1గా గ్రహించాలి. గౌరవానికి, సభామర్యాదకు, సంఘమందాదరణకు, మిత్ర బృందంలో పలుకుబడి సాధనకు, మాటకు విలువ పెరుగుటకు అవకాశం గల వత్సరం ఈ సంవత్సరం. ఉద్యోగమందు స్వయం కృషిచే అభివృద్ధి సాధింపనున్నారు. విలువగల వస్తువులు సమకూర్చుకోగలరు. రాజకీయంగా సదవకాశాలు లభ్యం కాగలవు. పత్రికా ప్రకటనమందు, విలేఖనమందు, గ్రంధ రచనయందు, కవితా వ్యాసంగమందు చాలమందికి అనుకూలత చేకూర గలదు నూతన చిత్ర నిర్మాణ దక్షత కొందరకు లభించగలదు. ఈ రాశివారికి డిశెంబరు వరకు, 'శని అర్ధాష్టమమున', తామ్రమూర్తిగా సంచ రించగలడు. ఆరోగ్యమందు జాగ్రత్త పడవలె. చాలమందికి ఔషధ సేవ తప్పదు. బృహస్పతి ఉపకారియే. స్త్రీలకు · లాభ వ్యయములు సమముగా, ధనరాబడి అంతంత మాత్రముగా, వృత్తియందు మధ్య మధ్య ఆటంకములు తటస్థించుచుండుట గమనింపగలరు.

## సింహం 

మఖ, పుబ్బ, ఉత్తర 1 పాII మ, మి, ము, మె, మొ, ట, టి, టు, టె, అక్షరాలు తమ పేరు ముందు గలవారు కూడా ఈ రాశికి చెందినవారే.

అనేక విధాల మీకు మేలు జరుగనున్నది. అఖండ యోగం అనుభవింపనున్నారు. ఇందులకు కారణం మరేమీ లేదు. రాశికి మూడింట ఉచ్ఛ 'శని స్థితి' పంచమమందు బృహస్పతి స్థితులే. ఆదాయానికి, అభివృద్ధికి, ఆనందానికి, అధికారుల మన్ననకు, అనుకొన్న విధంగా వ్యాపారానుకూలతకు వత్సరమంతయు యోగార్హమే. మనశ్శాంతి, ఉద్యోగలబ్ధి, కుటుం బానందం, వృత్తియందు అభివృద్ధికి సర్వాను

కాలంతగల వత్సరం ఈ 'రక్తాక్షి'నామ సంవత్సరం. చూడండి. ఆదాయం 8పాళ్లు, వ్యయం రెండే రెండు. రాజపూజ్యావమానాలు మాత్ర 2, 4గా గ్రహించండి. స్త్రీలకు నిరభ్యంతరంగా, నిరాటంకంగా తలంచిన రీతిని సర్వకార్యాలు, ముఖ్యంగా శుభకార్యాలు శుభావహంగా జరిగిపోతాయి. సంవత్సరాంతాన చాలమందికి నూతన గృహ ప్రాప్తి నిశ్చయం

## కన్య

ఉత్తర 2,3 4 పా, హస్త, చిత్త 1,2పా, టో, ప, పి, పు, న, ణ, ఠ, పే, పో, అక్షరాలు తమపేర్లకు మొదటనున్న వారందరు ఈ రాశికి చెందినవారే.

ఈ రాశికి 'డిశెంబరు 21 తా,'తో 'ఏలినాటి శని బాధ' తొలగనున్నది అంతవరకు లోహ తామ్రమూర్తిగా శనిగ్రహ సంచారం. బృహస్పతి 1985 జనవరి 9వరకు చతుర్థమందు తామ్ర మూర్తి,తదుపరిస్వర్ణమూర్తి. 11పాళ్లఆదాయమయితే, 8పాళ్లు వ్యయం. గ్రహించండి. వ్యాపార, వ్యవహార, వృత్తి, ఉద్యోగ, కళారంగ ప్రసిద్ధులందు ఆశించినదానికన్న, అధికంగా ధన లబ్ధి, సుఖానందాలకు లోటు లేకపోవటం గమనించగలరు. 'దీపముండగనే యిల్లు చక్కబెట్టుకోవాలి' శ్రమించండి, రాశిఫలం వాస్తవమని గ్రహించండి, ఆనందించండి. ప్రజాసమూహంలో 5గురు గౌరవిస్తే, నలుగురు మాత్రమే మిమ్ము ఈసడించుకొంటారు, స్త్రీలకు నాలుగువిధాలా లాభంచే మార్గమున్నది. విదేశయానానికి కొందరకు తప్పనిసరిగా అవకాశమున్నది. వ్యాపార విస్తరణకు, శుభకార్య నిర్వహణకు అవకాశమున్నది. ఇంతెందుకు ? సర్వవిధాలా వత్సరం యోగదాయికం.

## తుల

చిత్త 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా, లు. రా, రి, రూ, రె, రో, త, తి, తు, తె, అను అక్షరాలు నామ ప్రథమాక్షరాలుగా గలవారు తులారాశికి చెందినవారు.

కొంతకాలం 'శని' జన్మరాశిలో మరి డిశెంబరు 21 తరువాత ద్వితీయమందులోహమూర్తిగా సంచారం. రెండవ పర్యాయం శని సంచరించేవారికి అనుకూలం. బృహస్పతి మాత్రం రాశికి వ్యయ లగ్నమున సంచారమగుట శుభాశుభ మిశ్రమ ఫలదాయకుడు. వ్యయం అధికంగా కనిపిస్తుంది. ఒకవేళ శుభకార్యం నిమిత్తమే వ్యయం కావచ్చు. అప్రయత్నంగా ధనలబ్ధి ఉంటుంది, అంతకు అంతగా వ్యయం కనిపించటం గమనిస్తారు. 8 పాళ్లు ఆదాయమయితే, 11 పాళ్లు వ్యయం. ఇక్కడే తెలిసిందిగా, అధిక వ్యయానికి లోనవుతారని. రాజపూజ్యం ఒక్క భాగమయితే, అవమానం మూడుభాగాలని కూడా గ్రహించాలి.

స్త్రీలకు : నగలకనో, వస్త్రాలకనో, సంతాన శుభకార్యాలకనో, విందు వినోదాలకనో, అధికవ్యయం చేయవలసి రావటం, అనవసరమైన ఖర్చులకు లోనుగావటం గమనించగలుగుతారు. ఉద్యోగమందు మార్పునకు అవకాశమున్నదని, వత్సరాంతం ఫలదాయమని గ్రహించాలి.

## వృశ్చికం

విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, తొ–నా–ని–నూ–నె, నొ, య, యి, యు అను అక్షరాలు పేరునకు ముందుగల వారందరూ వృశ్చిక రాశికి చెందినవారే.

ఈ రాశి వారికి ఏలినాటి శని ప్రారంభం. 1984 డిశెంబరు వరకు శని వ్యయమున స్వర్ణమూర్తి. అందుచేత పెద్దగా యిబ్బందులు చెప్ప వీలులేదు. అయినా అడుగడుగునా కార్య విఘ్నాలు చెప్ప వీలున్నది. డిశెంబరు తదుపరి 'గురుగ్రహం' లోహమూర్తిగా ద్వితీయమున, సువర్ణమూర్తిగా తృతీయమున వత్సరాంతము వరకూ సంచారముగాన పెద్దగా ఆటంకములు రావు. కాని ఉద్యోగ చలనము, మార్పులు, చికాకులు, వ్యాపార సంకటములు. గృహచ్ఛిద్రములు చెప్ప వీలున్నది. కాన జాగ్రత్త అవసరం. అందుచేత, లాభాలాభాలు, జయాజయాలు, క్రయ విక్రయాలు, నూతనోద్యోగ ప్రాప్తియందు శుభాశుభ మిశ్రమ కాలమని గ్రహించాలి. ఆదాయ వ్యయాలు 14, 2లుగా గ్రహించాలి. ఏమయినా మధ్య వయస్కులకన్న వృద్ధులకు బాధాకరమైన వత్సరమే, గ్రహించాలి.

స్త్రీలకు : కుటుంబ చిక్కులనుండి, కొందరు ఉద్యోగ యిబ్బందుల నుండి, మరి కొందరు బంధుమిత్రుల చిక్కులనుండి విడివడాలి. లలితా సహస్ర నామస్తోత్ర పఠనం. దైవ చింతన అత్యావశ్యకములు.

## ధనుస్సు

మూల, పూ.షా., ఉ.షా., ప్రథమ పాదమయినా, యె, యో, బా, బి, బు, ధ, భా, ఢా, బే అక్షరములు పేరునకు మొదట గలవారు ధనూరాశి జాతకులు. లాభ శని, బృహస్పతి స్వర్ణమూర్తి విశేషాన శుభా శుభ మిశ్రమఫలం చవిచూడగలరు. దీర్ఘరోగులు క్రమంగా కోలుకోగలరు. అతి శ్రమము వలన కార్యానుకూలత సిద్ధించును. ఉద్యోగం పోయినవారికి ఉద్యోగ ప్రాప్తి. ఏలినాటి ప్రారంభ కాలమునకు ముందుగా సర్వవిధాలా అనుకూలత సంభవం ఆదాయ వ్యయాలు 2, 11లు. రాజపూజ్యావమానాలు సరిసమంగా గ్రహింపనున్నారు. దైవారాధన, స్వధర్మ నిరతి, పట్టుదల, రుజు ప్రవర్తనాదులు కొంతలో కొంత ధైర్యాన్ని సమకూర్చుతాయి. స్త్రీలకు : యత్నకార్య విలంబన, ఉద్యోగమున మార్పులు, స్థానచలనం శుభ కార్యప్రస్తావనలతో హడావుడి చెప్పదగిన అంశాలు.

## మకరం

ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠలో 1, 3 పాలు. బొ, జ, జి, జూ, జె, చొ, ఖ, గ, గి అను అక్షరాలు పేరునకు మొదటనున్నవారు ఈ రాశి జాతకులే.

'శని' డిశంబరు 21 వరకు దశమమున లోహమూర్తి తదుపరి వత్సరాంతము వరకు ఏకాదశమున స్వర్ణమూర్తి. బృహస్పతి 1985 జనవరి 9 వరకు వ్యయమున స్వర్ణమూర్తి. తదుపరి లగ్నమున 'తామ్రమూర్తి' అందువలన యితర గ్రహానుకూలత ఉన్నా, అన్ని వసతులున్నా, పేరుప్రతిష్ఠలున్నా, శ్రమచేసే శక్తి యుక్తులున్నా, అవకాశాలున్నా, అదాయం, కార్యానుకూలత సామాన్యమే. శుభాశుభ మిశ్రమ ఫలమే. దైవారాధన, సుందరాకాండ పారాయణాలు నవగ్రహజపాదులు పరోపకార చింతన అవశ్యం ఆచరింపదగిన అంశాలు. ఆదాయవ్యయాలు సరి సమం. రాజపూజ్యావమానాలు 4, 3 లుగా గ్రహించాలి. బాగా కృషి చేయవలసిన కాలం

స్త్రీలకు :– నూతన యత్నాలు ఫలించటం, నూతనోద్యోగం శ్రమకరం కావటం, నూతనోద్యమాలలో పాల్గొనటం. ఇంట శుభ ప్రస్తావనలుడటం గ్రహించాలి.

## కుంభం

ధనిష్ఠ 3, 4, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా. గు, గె, గొ, స, సి, సు, సె, సొ, ద, అను అక్షరాలు పేరు మొదట ఉన్నవారు ఈ రాశివారే.

సంవత్సర ఫలం

'శని' భాగ్యమున తామ్ర మూర్తిగా, దశమమున అలాగే సంచరిస్తాడు, బృహస్పతి మాత్రం 1985, జనవరి 9 తా. వరకు లాభ మందు రజతమూర్తి. అందుచేత ఒక్క బృహస్పతి బలమే ఆధారంగా కనిపిస్తుంది. శుభకార్యానుకూలత, అధిక వ్యయం చెప్పదగిన అంశాలు, యత్నకార్యసిద్ధి చెప్పవీలులేదు, నటనాసామర్థ్యం, చిత్రనిర్మాణాత్మకంలో నిరూత్సాహత ఏర్పడుతుంది. వ్యయాలు సమం. రాజపూజ్యావమానాలు 6, 3 లుగా గ్రహించాలి. స్త్రీలకు : అతిప్రయాస మీద పనులు నెరవేరటం, అధిక విద్యాయోగ్యతకు ఆటంకాలు రావటం గ్రహిస్తారు. అయినా శ్రమపడటం మానరాదు గదా!

## మీనం 

పూ. భాద్ర 4 వ పా, ఉ. భా, రేవతి, ది, దు, శ్యం, ఝా, థ, దె, దో, చ, చి, అను అక్షరాలు పేరు మొదట గల వారు ఈ రాశికి చెందిన వారు. డిశంబరు 21 వరకు 'అష్టమ శని' అందువలన అనారోగ్యత, కార్యములందు ఆటంకాలు, ప్రయాణమున ప్రయాస, అడుగడుగునా విఘ్నాలు, మనశ్శాంతికి భంగకరం, యిలాంటి ఫలితాలుంటాయి. కాని, డిశెంబరు పిమ్మట వత్సరాంతము వరకు 'భాగ్యశని' యోగప్రదాయకుడు, లాభదాయకుడు, వ్యాపారానుకూలాదాయం కాదు, గృహకార్య చింతనకు, ఉద్యోగప్రాప్తికి అనుకూలుడు. 'బృహస్పతి, కూడా వత్సరాంతముననే ఉపకారి, వస్త్రాలంకార, శుభప్రస్తావనలకు అనుకూలుడు. ఆదాయ వ్యయాలు 2, 11 లుగా, పూజ్యావమానాలు 2, 6 లుగా గ్రహించాలి, స్త్రీలకు : ధనప్రాప్తి, శుభయోచన, నూతనాంశ గ్రహణం, కార్య విజయాదులు, వత్సరాంతమున గ్రహింపగలరు. మొత్తానికి నూత్నవత్సరం శుభఫలదాయకమే. గ్రహించండి.

సమస్త సన్మంగళాని సన్తు. ★




Printed and Published by S Nageswara Rao at The Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3
Editor S Radhakrishna

# ఆప్కో వస్త్రసంప్రదాయంలో మంత్ర ముగ్ధుల్ని చేస్తుంది.

సంప్రదాయానికి అద్దంపట్టే అందమైన ఆప్కో వస్త్రాలు మిమ్ములను ముగ్ధులను చేస్తాయి. ఆప్కో వస్త్రాల విస్తృత శ్రేణి- షర్టింగులు, డ్రెస్-మెటీరియల్స్, చీరలు, తయారీ-దుస్తులు మరియు గృహోపకరణ-వస్త్రాలు.




చేనేతలు




దీ ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్సు
కోపరేటీవ్ సొసైటి లిమిటెడ్
హైదరాబాద్ 500 029

kiron/apco/84g5